# ప్రతీకారము

(చరిత్రాత్మక నవల)

గ్రంథకర్త:

మహాకవి, సరస్వతీపుత్ర,

పుట్టపర్తి నారాయణాచార్యులు

ప్రకాశకులు :

రాజశేఖర బుక్ డిపో

కర్నూల్

౧

అది పుష్యమాసము. వృక్షము లప్పుడే చిగురుపెట్టు చున్నవి. భూమి సస్యరమ్యముగ నుండెను. పరిణతో న్ముఖములైన శాలిక్షేత్రములు — మనోహరముగ తల లూపుచున్నవి. పద్మములపై నున్న హిమబిందువులు — ప్రియాధరముల పైని మందహాసము ననుకరించు చున్నవి. ప్రాతర్వేళల మంచు దట్టముగ నిండుకొని యున్నది. ఆమంచునకు జనులు భయపడు చున్నను దాని యందమును మాత్రము వలచు చుందురు. ప్రకృతిదేవి గప్పికొనిన వెలిపట్టువలె — దిగంగనా తారహారముల వలె — యొక్కసారిగా గుప్పికొన్న యనేకాప్సరసల పడిపడి నవ్వులవలె యామంచు యెంతో హృదయంగమమై యున్నది.

'శృంగేరి' లో జనుల యొత్తిడి తక్కువగా నున్నది. శీత బాధతో యాత్రికు లెక్కువగా వచ్చుటలేదు. ప్రాతఃకాలమున నిశ్శబ్దముగా నున్నది. అపుడపుడు దేవాలయము నుండి వినవచ్చు ఘంటా నాదము మాత్ర మా నిశ్శబ్దమును చీల్చుచున్నది. ఒక్కొక్కసారి గురుకులము నందలి విద్యార్థులందరును కలిసి యేక కంఠమున

"ఓం! సహనావవతు. సహనౌభునక్తు. సహవీర్యం కరవావహై. తేజస్వి నావధీతమస్తు. మావిద్విషావహై. ఓం. శాంతి. శాంతి. శ్శాం

అని పల్కెడు వచనములు — అవమానమును దేవభూ యముగ నొనర్చుచున్నవి.

తుంగానది పరమపావని. ఆమె శృంగేరికడ మృదుమంద గమనములతో — వినయాభిరామముగఁ బాఱుచున్నది; తక్కిన మాసములలో — జనఘోషములతో నెంతయో రభ సముగ నుండెడు నాస్నాన ఘట్టము లానాళ్లలో మూగవో యిన వీణలవలె — పాడని పాటవలె — అనభ్యస్తమగు కూచి మారమువలె మౌనముగ నున్నవి. దూరముగ హరితశాద్వల ములలో మేయు — పశువుల మెడలలోని గంటలుమాత్రి మప్పుడప్పుడు — పదవర్ణములోని జతిస్వరములవలె మ్రోగు చుండెను. తుంగలో చేపలు బట్టుకొనుట కాకసమున పక్షులు గుంపులుగ —విశకలితములుగఁ బారాడుచున్నవి. వానిరెక్కల సవ్వడులు — నిదురించుచున్న ప్రికృతిని లేపుచున్నటు లుండెను. అటనట నెవ్వరో—అపురూపముగఆస్తికమహాజనులు—ప్రియాం గనా హేమంత దృఢబాహు కదుష్ణ పరిష్వంగ సుఖాఽతి దూరులు స్నానమాడు నపుడు

గంగే! చ యమునే! చైవ గోదావరి! సరస్వతి!
నర్మదే! సింధు! కావేరి! జలేఽస్మిన్ సన్నిధింకురు!

అనిపఠించెడు మంత్రఘోషలు — వినఁబడినను — వినబ డునట్లే లేదు. నారాయణశాస్త్రి లింకను బ్రిహ్మచారి. గార్హ్యస్థ్యధర్మ సుఖమెఱుఁగడు. ఆతఁడా చలిని లెక్క పెట్టలేదు. ఆతని దృష్టిప్రాతురు పాస్తవ్య గాయత్రీ పునః పునరుచ్చారణా పులక పరిష్కృత సుఖముపై

నుండెను. నారాయణశాస్త్రి శ్రీమఠమున గరణీక మొనర్చు చుండెను. అతని తలి దండ్రులు బాల్యముననే గతించిరి నాటి నుండి యన్నయే వానికి దండ్రియయ్యెను. వదినయే తల్లి. ఆమె తల్లి వలెనే వానిని బెంచినది. నారాయణశాస్త్రి తండ్రి సుబ్బారాయశాస్త్రి. అతడు గొప్ప శ్రోత్రియుడు. జటాంతము వేదము వల్లించినవాడు. ప్రాతిశాఖ్యలోఁ గూడఁ బేరుమోసిన వాడని యనుచుండిరి. సుబ్బరాయశాస్త్రి మొదట శృంగేరి దగ్గరనున్న "విద్యారణ్య పురమున" వసించుచుండెను. వైదిక వృత్తియే యతని జీవితము అగ్రహారములోని వారందరికిని — సుబ్బరాయశాస్త్రి గారిపై గొప్ప యభిమానము. గౌరవ మును. శ్రీమఠమునగూడ నాతనికి పలుకుబడి యుండెడిది. అప్పటి శృంగేరి పీఠాధిపతులు — నృసింహ భారతీస్వామి. వారికి సుబ్బరాయశాస్త్రి గారన్నచో — గొప్ప వాత్సల్యము. శాస్త్రిగారిలో విద్యాసక్తి — సదాచారము—అనుకూల దాంప త్యమువలె — పరస్పరము పెనవైచికొని యుండెను. శ్రీమఠ ములోగాని, శారదాదేవి యాలయములోగాని — విశేషపూ జలు, ఉత్సవములు — నడచినచో శాస్త్రిగారి కాహ్వానము వెళ్ళెడిది. వారి కిర్వురు కుమారులు: పెద్దవాడు శ్రీకంఠశాస్త్రి. నారాయణశాస్త్రి రెండవవాడు. వీరిర్వురును శృంగేరి గురు కులము నందే చదివిరి. అందే కరణీకవృత్తి నొనర్చు కొను చున్నారు.

తండ్రి గతించునాటికి — నారాయణశాస్త్రికి పంద్రెం

డేండ్ల వయస్సు. అతడు పుట్టిన వెంటనే మాతృమారణ కారకు డయ్యెను. నేడు తండ్రియూ మరణించినాడు. వ్యాధితో మంచము పట్టిన సుబ్బాశాస్త్రికి — రెండవ కొడుకు చింత పెద్దదై కూర్చున్నది. వాడు బాల్యమునుండి యుదుష్టుడే పెద్దల శిక్షకు లోగ లేదు. వాని యిష్టమువచ్చినట్లు పెరిగెను. ఏవిద్యలోను వాని కాసక్తి లేదు. వానికి నాల్గుముక్కలు చెప్పుట కెంతయో ప్రయత్నించెను, ఆ ప్రయత్నములు సాగిరాలేదు. తల్లిలేని పిల్లవాడని తండ్రికిగూడ వాని నెక్కువగ దండించుటకుభయము. 'ఈ భయముతో వానిని చెడగొట్టుకొన్నానే' యని తండ్రి తరువాత పశ్చాత్తాప పడెను. ఆసమయమున — నృసింహ భారతులు సుబ్బాశాస్త్రి కండగా నిలిచిరి.

ఒకసారి శాస్త్రులుగారు నృసింహ భారతులతో — మాటాడు చుండిరి. పరస్పర యోగక్షేమములు విచారించుట యైనది. శాస్త్రిగారి ముఖమేలకో చిన్నవోయినది. కారణమేమని స్వామిగారు ప్రశ్నించిరి "ఏమని చెప్పను? శ్రీ శారదా దేవి దయవలన నాకేకొఱతయు జీవితమున గలుగలేదు; కాని నా చిన్న కొడుకు చెడి చెటాకు లగుచున్నాడు. దేవి దయవలన వాడొక త్రోవకు వచ్చినచో — నాకదియే పదివేలు."

సుబ్బాశాస్త్రి నిట్టూర్పు విడిచెను.

"ఏమి? వానికేమైనది?" స్వామి యాతురతతో ప్రశ్నించిరి.

"గురుదేవా! వాడు నాపెద్ద కొడుకువంటివాడు కాదు.

తల్లిలేని కొడుకని వానిని ముద్దుగా పెంచితిని. అదే. వాని కప కారమైనది. వానికెవ్వరి లక్ష్యమును లేదు. ఏవిద్యపై గూడ నాసక్తి లేదు. ఆటలేవాని కన్నము – నీరును. దుర్మార్గులతోడి సహవాసము వేళకింటికిరాడు. ఒక్కొక్కసారి ప్రాణగొడ్డము లైన పనులొనర్చు చుండును. వాని దుర్మార్గములను – వారు వీరునాతో విప్పిచెప్పి నపుడు మనసున బల్లెములు గ్రుచ్చుకొనును. గట్టిగా దండించినచో – నదిలోబడి పోదునని బెదరించును. ఊరువదలి పోదుననును. చిన్నప్పటినుండి వాని స్వభావ మేదిపట్టిననదియే.తీవ్రమైన హఠము. చెప్పినంతయు చేసి తీరును. వాని గుండె దేనికిని భయపడదు.వానిని దారికి తెచ్చు మార్గమే నాకగుపించలేదు. ఇదే పెద్దచింతయైనది." శాస్త్రి నిటలముపై గ్రమ్మిన చెమటను అంగ వస్త్రముతో దుడుచుకొన్నాడు.

భారతీ స్వాములు నవ్వుచునే

"ఇంతేనా! సంగతి. దీనికి మీరు చింతింప వలసిన పని లేదు. వానిని శ్రీమఠమునకు బంపుడు. మేమే వానిని చక్కబెట్టు కొందుము." అన్నారు.

శాస్త్రిగారేదో వెనుక ముందాడు చున్నట్లున్నది.

"ఏమి మీ యోచన?" స్వామి ప్రశ్నించిరి.

"గురుదేవా! నన్ను మీరన్యథాభావించరాదు. వాడు మీవంటి వారియెదుట బడుట కనర్హుడు. మీవంటి మహాత్ముల దయకు పాత్రుడగు అర్హత వానికి లేదు."

స్వామి మరియొకసారి నవ్వెను.

"అనగా?"

"వాడు అవివేకి. హఠశీలి చిన్న – పెద్దయను భేదమే లేనివాడు. వానివలన – తమ (శ్రీ)పాదములకే దైన యపచారము జరిగినచో.....

మీరు దానికి చింతించ వలసినది లేదు. వానిని సన్మార్గమునకు దెచ్చు పద్ధతిని మేమాలోచింతుము. మాకు గావలసినది గూడ వానివంటి శిష్యుడే. మీరు వానిని మాకడ కంపి వేయుడు. వానిని మాగురుకులములో జేర్చుకొందుము."

ఈమాటలతో శాస్త్రిగారి తలపై కామధేనువే పాలను వర్షించి నట్లైనది.

రెండు మూడు దినముల తర్వాత – స్వామి నారాయణశాస్త్రిని తమ సన్నిధానమునకు బిలిపించి కొన్నారు. వానివైపు తీక్షణముగ జూచినారు. ఆ మొగముపై తేజస్సు కొట్టవచ్చినటులున్నది. కన్నులలో నేదో గాంభీర్య మున్నది. ఫాలమున్నతము విశాలమును ముక్కు కొసదేరి యుండెను. అది వాని సూక్ష్మబుద్ధికి జయపతాక. వాడు నిలిచిన పద్ధతి – ఆడిన మాటలు – హావభావములు వాడు సామాన్య బాలుడు గాడని – యేదో మహాకార్యమునకై పుట్టిన యొక వీరపురుషుడనియు యెలుగెత్తి చాటినటు లున్నది. వానిలో బీజరూపముగ నణగియున్న స్వాభిమానము – ఆత్మగౌరవము. తీక్షణబుద్ధి – దుడుకుతనము – హఠము–మొదలైన వానిని స్వామి గమనించిరి. ఆ దినములలో – బ్రిదుకుట కట్టి గుణములే

మనుష్యునకు గావలెనని – నృసింహ భారతుల యభిప్రాయము వారు వానివైపు సకరుణముగ జూచిరి. చిఱునగవుతో దగ్గరకుఁ బిలిచి – శరీరమును దడవినారు. ఆ తడవుట – వానికి విద్యుత్సంచార మయ్యెను. స్వామి – తన యెడ జూపిన దయకు చకితుడైనాడు, నృసింహ భారతులు దరహాస మేదురముగా ననిరి.

"బిడ్డా! నీవు భయపడ వలసిన పనిలేదు. నీ విషయమున మాకు సంపూర్ణ విశ్వాసమున్నది. నేటినుండి నీవు మాగురుకులమందే వసింప వలెను. ఇందు నేకొఱతయు నుండదు. ఆ యేర్పాటు లన్నియు మేము చేయుదుము. నీపై మేమే నిర్బంధమును సధించుటలేదు. నీయిష్టము వచ్చినట్లుండుము."

నాటినుండి నారాయణశాస్త్రికి గురుకుల వాసమారంభమయ్యెను. మొదట కొన్ని దినములు వానికిఁ బిచ్చియెత్తినటులున్నది, క్రమక్రమముగా వాడు మఠములోని జీవనమున కలవాటు పడినవాడు. వానికి తెలియకయే – మఠములోని జీవనము – వాని స్వేచ్ఛా ప్రవృత్తి కొక సంకెలగా తయారైనది. ఒకటి రెండు సారులు మఠ నియమములకు తాళలేక – ఉన్నట్లుండి ఊరికి వచ్చివేసినాడు. నృసింహ భారతులు వానిపై కోపగింపలేదు." పాపము! తండ్రిని చూడవలెనని పోయియుండును." అని సమాధాన పడినారు. మనుష్యులను బంపి వానిని మరల మఠమునకు బిలిపించి కొన్నారు. ఇట్లు కొన్ని సారులు జరిగెను. తరువాత వాడు శ్రీమఠపు జీవనమున

కొదిగి పోయెను. వాడు మఠములోనే నిలిచి నృసింహ భారతు లకు బ్రియ శిష్యుడైనాడు. వేద వేదాంగములు నేర్చెను. వ్యాకర్ణము నెరిగెను. ఛందస్సును బరిశోధించెను. సంగీత సాహిత్యములలో నధికారము సంపాదించెను. స్వామి దివ్యాను గ్రహమునకు బాత్రుడై శ్రీ మఠము నందే కరణీక వృత్తి చేయ దొడగెను.

ఈ యభివృద్ధిని చూచు పుణ్యమునకు మాత్రము తండ్రి నోచుకొనలేదు, నారాయణశాస్త్రి గురుకుల వాసమునకు బోయిన సంవత్సరమే - తండ్రి మరల మంచము పట్టినాడు. పత్నీ వియోగమా తనిని తిని వేసినది. మంచముపై నుండి మరల లేవనేలేదు. కాని యట్టిస్థితిలోగూడ తనపూజా పునస్కారము లను వదలలేదు. కఠోరవ్రత నియమములను వదలలేదు, ఆత నికి విషశీత జ్వరము నెలల తరబడి గాచెను, ఆ జ్వరములో నాతడు తన భార్యనుగూర్చియే పనవెడువాడు.

"అది నాకొఱకై గాచుకొన్నది. స్వర్గమునకు బోక - నాకొఱకై యెదురు సూచుచున్నది. నేనిక తొందరగా బోవలెను."

హఠాత్తుగా సుబ్బాశాస్త్రి లేచి కూర్చున్నాడు.

వాడేడీ! నారాయణుడు. కనపడనే లేదు.

శ్రీమఠమున జేర్చిన సంగతి యాతనికి జ్ఞాపకమే లేదు,

"శృంగేరిలో నున్నాడు. పిలిపింతునా! శ్రీకంఠశాస్త్రి ప్రశ్నించెను.

"అక్కరలేదు. వాడక్కడనే ఉండనీ. ఎక్కడనో ఒకచోట శాంతముగ నున్నచో జాలును. వాడు నల్లురివంటి వాడుగాడు బిడ్డా! శ్రీకంఠా! దగ్గరకురా! తల్లీ పార్వతీ! నీవు నాకోడలవు గాదు. మా యింటికి భాగ్యదేవతవు, ఇకముందు వానికి మీరే తల్లి దండ్రులు వానిని మీ యొడిలో వేసి పోవుచున్నాను. వాడు దుష్టుడు. కాని మేధాశాలి. అదృష్టశాలి స్వేచ్ఛాచారి. వాని నంకెకు దెచ్చుటకు నాచేత కాలేదు. భారతీ స్వాములే పైన వేసికొన్నారు. వానినుండి మనవంశమునకుఁ గాని భారతీ స్వాముల శ్రీపాదములకు గాని యే యపకీర్తియు రాకుండు నట్లు – మీరు జాగ్రత్త పడవలెను. వాడింకను చిన్నవాడు తాకు తప్పు తెలియదు. కనుక మీరిర్వురును వానిని జాగ్రత్తగ విచారించు చుండవలెను. వానిని త్రోవకు దెచ్చుట చిన్న పనిగాదు. కాని – నాకింతకంటె వేరుమార్గము దోపలేదు. మీరు నాకు మాటయిచ్చినచో నిశ్చింతగ కన్నులు మూసి కొందును."

శాస్త్రిగారి నిటూర్పులతో – మంచము వేడెక్కినది. వాని కన్నులలో నీరు తళతళ లాడినది.

"నాయనగారూ! మీరా విషయమై యేమియుచింతించ వలదు, నాకడుపున బుట్టిన కొడుకును వలెనే నేను వానిని జూచుకొందును ఈ మాటకు తిరుగులేదు." శ్రీకంఠశాస్త్రి గంభీరుడై అన్నాడు. శాస్త్రిగారికీ మాటతోఁ గొంత మనశ్శాంతి చేకూరినది. వెంటనే వారు కోడలివైపు జూచిరి. ఆమె యింగిత

ఙ్ఞరాలు. ఆమె యిట్లు పలికినది.

"మామగారూ! నేటినుండి—నారాయణుడు మా సంతానము. మీ కొడుకుగాడు. వానినిగూర్చిన యే చింతయు మీరుంచుకొనవలసిన పనిలేదు. వానినుండి మీ వంశమునకే కళంకమును రానివ్వక చూచుకొను బాధ్యత నాది."

శాస్త్రిగారి ముఖమున చిఱునవ్వు చిందులాడెను. వారియాత్మ తృప్తిపడెను. మరి కొంతసేపటికే వారు జీవములు చాలించిరి. పాడబడిన పాటవలె - వీచిపోయిన గాలివలె - శాస్త్రిగారి జీవము - పత్నీ జీవముతో నైక్యమయ్యెను.

తండ్రికిచ్చినమాట శ్రీకంఠశాస్త్రి తప్పలేదు. అతడు "విద్యారణ్యపురము"నుండి కాపురము శృంగేరికి మార్చెను. ఒకచేయూరిలోనున్నచో తమ్మునిపై నెక్కువదృష్టి నుంచికొనవచ్చునని యాతనియూహ. ఈమార్పునకు మరియొక కారణముగూడనుండెను. "విద్యారణ్యపురము" చాలచిన్నయూరు. దానినిండ విద్వాంసులేయుండిరి. వారిలో కొందరికి భూమి—పుట్రయున్నది. తక్కినవారికి వైదికవృత్తియేజీవనము. వారిలో కొందరికి ప్రక్కరాబడిగూడ నుండినది. దేవాలయములలోని పూజలు మొదలైనవి. ఇవేవియును లేనివాడుసుబ్బశాస్త్రి యొక్కడే. అతడుబ్రదికినపుడుగూడ జీవనము కష్టముగనే సాగుచుండెను. తండ్రిమరణానంతరము శ్రీకంఠశాస్త్రికి—జీవనము

ఘరియుకఠినమయ్యెను. అందుల కాతడు శృంగేరికి వలసరాక తప్పదయ్యెను.

సుబ్బారాయశాస్త్రి మరణవార్త విని—నృసింహ భారతులు చాల పశ్చాత్తాప పడిరి. ఆ సంసారమునకు జీవనమును జరుపు నుద్దేశ్యముతో — వారు శ్రీ మఠము నందలి కరణీక వృత్తిని— శ్రీకంఠశాస్త్రికి ప్రసాదించినారు. శృంగేరి మఠమునకు విస్తారముగ జహగీరు లుండెడివి. వాని విచారణ — ఆదాయ వ్యయములు నిర్వహించుట మొదలైన పనులకెంతయో సిబ్బంది యున్నది. నరసింహశాస్త్రి శృంగేరి మఠమున సర్వాధికారిగా నుండెడివాడు. మఠవిషయములపై నాతనిదే యధికారము. శ్రీకంఠశాస్త్రి యాతనిక్రింద కర్ణముగా జేరినాడు. నారాయణశాస్త్రి గురుకుల వాసము ముగిసినది. వాని బుద్ధిశక్తి వ్యవహార చతురత — స్వామిదృష్టి నాకర్షించినది. నారాయణ శాస్త్రియు శ్రీ మఠమునందే కరణీక వృత్తిలో చేరుకొన్నాడు.

నారాయణశాస్త్రికి ప్రతిదినమును తుంగభద్రలోనే స్నానము. అతడు మూడువేళల స్నాన మొనర్చెడువాడు. తుంగ యొడ్డుననే సంధ్యావంద నాదులను ముగించుకొని యింటికి పోవుట వాడుక. భోజన మైనంతనే కొంతసేపు విశ్రాంతి తర్వాత దైనందిన కార్యముల నారంభించును. అలవాటు ననురించి నేడుగూడ నతఁడు తుంగగట్టునకు వచ్చెను. పై వస్త్రములను పిండుకొని గట్టుపైనుంచి—సూర్యున

కర్తవ్య మొనర్చుటకై—ఆతడు నీటిలో దిగెను కాని—మనస్సు అక్కడ లేదు. వదినతో తనకైన సంభాషణమును భావించి కొనుచున్నాడు. వాని కామెపై మాతృభక్తి. ఆమె తనతో నన్న విషయములను—నారాయణశాస్త్రి మాటిమాటికి—నెమరు వేసికొనుచుండెను.

పార్వతీదేవి జ్ఞానవృద్ధురాలు. ఆమెదొడ్డమనసు—కుటుం బమునకు రక్షగానుండెను. ఆమె నారాయణశాస్త్రితో నిట్లన్నది

"ఏమోయి మఱదీ! ఈనడుమ నీపద్ధతియొక తీరుగా నున్నది. ఏదేదో యోచించుకొనుచుందువు. స్నానము నకు నదికి పోయినచో తిరిగి వచ్చుటకు కొన్ని గంటలగును. అస లింటి కథయే నీకు జ్ఞాపకముండదు నది దగ్గర ఎవరైనా మత్స్య కన్యక దొరికిందా ఏమిటి?"

"వదినా! నీవన్నది నిజమే. నేనాస్నాన ఘట్టమునకు పోవుట—అచ్చట నున్న మత్స్య కన్యలను చూచుటకే. ఆనదిలోని చేపలు—యెంత అందముగానున్నవి! ఆ అందమును చూచుటకే వేయికండ్లు కావలయును. ఆ ఆనందములో—యింటికథయే జ్ఞాపకమునకురాదు. నారాయణశాస్త్రి నవ్వుచు నన్నాడు. అతడన్నది నిజము కూడ.

శృంగేరి సమీపము నందు తుంగానది—ప్రశాంతరమణీయముగా ప్రవహించును, అక్కడి ప్రకృతి కూడ తనయందములన్నిటిని కుప్పబోసి కొన్నది. నదికి సమీపముననే "ఋష్య

శృంగ పర్వతమున్నది. దానిదగ్గరనే మల్లికార్జున గుట్ట. అది ధ్యానస్థితి యందున్న శివుని ననుకరించు చుండును. పరమ శివుని జటా జూటము వలెనే—ఆగుట్టపై నల్లగా మూసి కొన్న మేఘమాల. జటా జూటము నందుడి కుటజ పుష్పముల ననుకరించు వర్ష బిందువులు కొప్ప మనెడు సీమలో కెర యనెడు గ్రామము. దాని సమీపమున నొకగుట్టలో తుంగానది—జన్మించును. ఆ శైలమున వరాహస్వామి వెలసియున్నాడు అతని దంష్ట్రి నుండి నీటి బొట్లు సదా జారు చుండును. ఆ వరాహస్వామి దంష్ట్రి కటాహ మే—తుంగా దేవి జన్మస్థలము. అక్కడ జన్మించి యామె పచ్చని పీఠ భూములలో ప్రయాణ మొనర్చును కూడలి క్షేత్రమున తన కభిన్న సఖయైన "భద్రానది"తో నామె కూడు కొనును. అచ్చటి నుండి శ్రీశైలమల్లికార్జునుని దర్శింప వలెనని యామె కొకటే తొందర. కాని—శృంగేరి స్మిాపించు వేళ కామె తొందరపాటు తగ్గును. కన్నులు మురిపించు తన వాలకములను మరచి—ఆమె యాస్తికశిరోమణిగా మారి శ్రీవిద్యా శంకరులకు—శారదా దేవికి తలవంచి నడుచుచున్న దానివలె మహా వినయమున బారును. కొంత దూరము త్తర దిశగాసాగి మరల పూర్వవాహిని యగును. శృంగేరి సమీపించినపుడామె మందగమనము భక్తి రసప్రబోదితము. శృంగేరి సమీపమునందు ఆతుంగలో నెవ్వరును చేపలను పట్ట కూడదని నృసింహ భారతుల యాదేశము. ఆయాదేశము నెవ్వరుకూడ నుల్లంఘించుట లేదు. ఆనీటిలో నొక్కొక్క చేప

రెట్ట లావుండును. ఆస్తికజనులు, వానిలో నొక్కొక్క చేపను బట్టికొని-దాని ముక్కు చెవులకు చిన్న చిన్న తొడవులను దొడిగి వదలుచుండిరి. ఆసొమ్ములతోనవి. నవవివాహితలగు వధువుల వలెనే యుండెడివి. ఆమత్స్య సుందరులతో నాడుకొను చున్న నారాయణ శాస్త్రికిప్రొద్దు యూనే తెలియదు.

నేడుకూడ నాపనియే జరిగినది. ఆతడు స్నాన మొనర్చు చుండెను. ఒక మత్స్యాంగన – యొయ్యారపు నడకలతో – వాని చెంతకు వచ్చినది. దాని నేత్రము లనిమేషములు. అది యప్సర సుందరివలె నుండెను. రతీదేవి ఱెక్కమునుండి తప్పించికొని వచ్చిన – శఫరీ విలాసినివలె నుండెను. అతఁడని మేషుడై – దానివైపల్లే చూచు చుండెను, వాడింటికి వచ్చు వేళకు బారెడు పొద్దెక్కినది, మఱదిని చూచి వదినె నవ్వెను. వాఁడును ప్రతి నవ్వెను.

“వదినా! నీ వెప్పుడు నన్నిట్లే యనుచుందువు. నీవన్నట్లే యొకానొకనాడు – ఒక మత్స్య సుందరినే పెండ్లి చేసికొం దును. అపుడు నాకేగాదు. దానికి గూడ, నీవు వండిపెట్ట వలసి వచ్చును.”

“ఏమీ! స్వచ్ఛమగు శ్రోత్రియు వంశమున బుట్టిన నేను. మత్స్య సుందరుల వంటకత్తెనా? బాగుగనే యున్నది.” మీ యిర్వురకు నేనే వండిపెట్టెదను”

“నీవు మాత్రము మత్స్యసుందరి నెట్లు పెండ్లియాడె దవు? నీకుమాత్రము – జాతి – నీతులు లేవా? ఏమి? “అనాఁడు

శంతనునకు గూడ - జాతి స్త్రీతులుండెను" "ఇంతకు—వివాహా ముపై బుద్ధి పోనిచ్చి నావన్నమాట! దానికే సంతోషము నీవు మత్స్యగంధిని వివాహ మాడినను, మత్స్యనేత్రిని వివాహ మాడినను మాయింటి కొక తోడికోడలును తెచ్చినచో మా కదే పదివేలు."

"వదినా! నీకు రాత్రి-పగలు నా పెండ్లి చింతయే యై పోయినది. ఆ మాటననిది - అన్నము పెట్టవు నీరు పోయవు. నీవే యేదైన నొక పెండ్లికూతురును చూచి - వివాహము చేసివేయుము. దానితో నీసమస్య తీరిపోవును."

"నేనెవరినైన నెన్ని కొన్నచో—నీవు దానికి—ముక్కు—బాగులేదని—మొగము బాగులేదని పేరులు పెట్టినచో"

"పెట్టను లెమ్ము. నీ వెన్ని కొనుకన్య బాగుగనే యుండును." నారాయణశాస్త్రి నవ్వుచు నే యనెను.

"బ్రదికించినావు. ఇక తక్కిన విషయమంతయు నేను చూచుకొందును. రేపే నీవివాహమునకు తొలిమాట లారంభింతును."

"పెండ్లి కూతురు నెక్కడ చూచినావు?"

నారాయణశాస్త్రి ప్రశ్నించెను.

"నీకు సరిపోవు పిల్లనే చూచినాను. దానిపేరు భారతి. నా తమ్ముని మామబిడ్డ. దానికి పండ్రెండేండ్ల వయస్సు. చేయి కడిగికొని ముట్టవలసి నంత యందము. దానితల్లిపోలిక. నీవు ఒప్పుకొన్నచో—రేపే ఆపిల్ల తల్లి తండ్రులను పిలిపించి మాటా

డుదును."

"వారి యూరేది?"

"తెలిసి తెలియనట్లు మాటాడు చున్నావు. వార యూరు "కిగ్గ"

ఇక్కడికి మూడు నాలుగు మైళ్లుండును. ఆవిడ నావ లెనే శ్రోత్రియుల యింటి బిడ్డ. నీ కేమి ఆక్షేపణ లేదుగదా!"

"నీవు మెచ్చినచో– నా కేమి యాక్షేపణ?"

నారాయణ్ణశాస్త్రి యింటినుండి బయటకు వచ్చినాడు అతడు శ్రీ మఠమువైపునకు నడచెను, తోవ పొడుగున నిదేచింత. తాను వివాహమాడబోవు "భారతి" యెట్లుండ వచ్చును? తన స్వప్నలోకములోని మత్స్యసుందరి యంతటి యందగత్తె యగునా? వారి తల్లి శారదాంబ పోలికయట! అయినచో బాగుగనే యుండును. ఒకసారి యామెను చూచి నచో? తానే వారి యూరికిఁ బోవలెనా? వారినే వదినె– యిక్కడికి పిలిపించిన నెంత బాగుండును? వదినె బాగున్నదని చెప్పినది. బాగుగనే యుండును." వానికి మధ్యాహ్న మంతయు నిదేచింత. ఆ చింతతోనే– వాడు సాయం సంధ్యకై తుంగ భద్రలో దిగెను. వాని కెచ్చరిక గల్గినది ఒకానొక మత్స్య గంధి సవిలాసముగ వాని లలిత కపోలములు చుంబించి–యెద పైనిఁ బొరాడి నపుడే."

---

శృంగేరి ప్రాచీన కాలమునుండి ప్రసిద్ధ యాత్రాస్థలము లలో నొకటి. త్రేతాయుగమందు నిది "రుద్రపాదక్షేత్ర" మను పేరుతో ప్రసిద్ధమైయుండెననియందురు, అచట విభాండకముని తప మొనర్చుచుండెను. అతని ఇష్టదైవము మల్లి కార్జునస్వామి. ఒక్కానొకనా డాతడు తుంగానదిలో స్నాన మొనర్చుచుండెను. అచటి కూర్వసియను యప్సరస వచ్చినది. దాని దేహ కాంతి తో నది యంతయు మాంజిష్ఠ వర్ణ మయ్యెను, ఆనవ్వులు—ప్రాంత వృక్షములలో—పూవులై పూచెను. ఒక మహాప్రయోజనమునకై దేవతలు దానినంపిరి. దానినిచూచి విభాండకుని మనస్సు చలించినది. అతనికి రేతస్సు స్ఖలించెను. దానినొక కృష్ణమృగముద్రావినది. దానికిగర్భమయ్యెను. కొన్ని దినములకు దానిగర్భమున నొక బాలకుడు జన్మించెను, వానితలపై జింకకొమ్ముల వంటికొమ్ములు. అతడు ఋష్యశృంగుడను పేరట ప్రసిద్ధుడయ్యెను. ఋష్యశృంగుని మహిమతో నీప్రదేశమునకు క్షామము దేశోపద్రవము లేకపోయెను.

ఆ సమయమున నంగదేశమును — రోమపాదుడు పాలించుచుండెను. వాడు శతక్రతువను యజ్ఞమును చేయ దలచినాడు. ఇంద్రునకీ ప్రయత్నముతో భయమైనది. అతని ప్రయత్నము ఫలించినచో తన యింద్రపదవి పోవునేమోనని యాతని బెడద. రోమపాదుని దేశమున నింద్రుడు క్షామము వచ్చునట్లొనర్చెను. ఈ సమాచారము రోమపాదుడు నారదుని వల్ల

తెలిసికొనెను. తనరాష్ట్రము నందలి క్షామము పోవుట కౌతడు తుంగాతీరమున తపమొనర్చుచున్న ఋష్యశృంగుని తనదేశమునకు గొని రాదలచెను. తన బిడ్డయైన శాంతాదేవి నాపనికై వినియోగించినాడు. అదివరకు స్త్రీలముఖమే యెఱుగని ఋష్యశృంగుడు శాంతాదేవిపై మరులుగొని — ఆమె వెంట నంగ దేశమునకు వచ్చెను. వాని యాగమనముతో నంగదేశమున క్షామములు పోయినవి. తన యభ్యుదయము నకు కారణమైన ఋష్యశృంగునకు రోమపాదుడు — తన కూతు రునొసగి వివాహ మొనర్చెను.

త్రేతాయుగమున దశరథు డుండెను. అతడు పుత్రుల కొఱకై "పుత్రకామేష్ఠి యాగమునకు దొరకొన్నాడు. ఆ యాగమునకు ఋష్యశృంగుడు పురోహితు డయ్యెను. అది నిర్విఘ్నముగాసాగి దశరథునకు నలువురు కొడుకులు పుట్టిరి. ఇట్లా క్షేత్రము ఋష్యశృంగుని కాలము నుండియు ప్రసిద్ధ మయ్యెను. ఆ మహర్షి వసించిన చోటు ఋష్యశృంగ పుర" మైనది. తరువాత నది "శృంగపురి" యయ్యెను. 'ఋష్యశృంగ మహాముని' దేహమువదలినచోటని' యొక ప్రదేశమును నేటికి నక్కడి వారుచూపు చుందురు. ఆ ప్రదేశ మొక యూరైనది. అదే "కిగ్గ" ఋష్యశృంగుడు దేహము వదలినచోటు — ఒక దేవాలయము కట్టబడినది. ఇది శృంగేరి కారుమైళ్ళ దూర ములో నున్నది. అచట శాంతాదేవి—ఋష్యశృంగుల దేవా లయము లున్నవి. రోమపాదుల రాజ్యమునకు ఋష్యశృంగుడు

ప్రయాణమై పోవుచున్నప్పటి దృశ్యము ఒక శిలపై చిత్రింప బడినది. అందులో వానిపల్లకిని జింకలు మోసికొని పోవుచున్నట్లు చిత్రింప బడినది.

అద్వైత మతస్థాప నాచార్యుడైన ఆది శంకరులు—అపౌరుషేయములగు వేదధర్మము లుద్ధరించుటకై దేశాటనమును గైకొని — అన్యమత ఖండన మొనర్చుచు 'వారణాసి'కి వచ్చెను. వేదవ్యాసుల యనుజ్ఞతో వారు కాశిలో 'మండన మిశ్రుడ' నెడి మహాపండితుని జయించిరి. మండన మిశ్రుడు బ్రహ్మదేవుని యవతారమని ప్రసిద్ధి. ఇతడు కాశ్మీరి. మండన మిశ్రుడు శంకరుల శిష్యుడయ్యెను. శంకరు లాతనికి—'సురేశ్వరాచార్యులని' వేరుపేరు పెట్టిరి. ఆది శంకరులు తమ యద్వైత మత ప్రచారమునకు — ధర్మ పీఠమును స్థాపించుటకు — తగిన ప్రదేశమును వెదకు కొనుచు వచ్చుచుండిరి, రోమపాద క్షేత్రమని ప్రసిద్ధికొన్న ఋష్యశృంగ పురమున నపుడొక చిత్రమైన సంఘటన జరిగెను.

పరమ పావనమైన తుంగానదిలో స్నానమొనర్చి — వారను స్థానమొనర్చు కొనుటకై — తగిన ప్రదేశము కొఱకు నాల్గువైపుల చూపు సారించిరి. నదిగట్టున నొక చెట్టుక్రింద ప్రసవవేదన ననుభవించు చున్నదొక కప్పవారికంట బడినది. దాని తలపై ప్రచండ సూర్యకిరణములు పడి బాధించు చుండెను. ఆ మండూకము ప్రసవ వేదనతో — అచటనుండి — కదలుటకు శక్తిలేక — ఎండతో బాధపడు చుండినది. అప్పు

డొక చిత్రముజరిగెను. ఆ కప్పనొక పాముజూచినది ఆకప్పపై నది జాలిగొనెను. కప్పతనకాహారమను విషయమేయది మరచినది. అది తనపడగవిప్పి ఎండకడ్డముగా—కప్పపై గొడుగు పట్టెను. ఈ సన్ని వేశమునుచూచిన యాదిశంకరులాశ్చర్యపడిరి. ఇది ఆ క్షేత్ర మహిమయని శంకరులుతలచినారు. తమపీఠమునుస్థాపించుటకు— యోగ్యముగా శృంగేరిని నిశ్చయించికొని — వారచట నొక మఠమును స్థాపించిరి. ఆ మఠమున సురేశ్వరా చార్యునికి పట్టము గట్టిరి. అది శారదా పీఠము. వేరొక పీఠమును ద్వారకలో స్థాపించిరి. అది 'హస్తామలకా చార్యుల' చేతిలో నుండి నది. బదరి కాశ్రమములోని పీఠమునకు 'తోటకాచార్యులు' ధర్మగురువులు. పురుషోత్తమ క్షేత్రమైన జగన్నాథ మఠము 'పద్మనాభా చార్యుల' స్వాధీనము. శృంగేరి పీఠమునకు దేవతలు — ఆదివరాహ — శారదా దేవులు; ద్వారకా పీఠమునకు సిద్ధేశ్వర భద్రకాళికలు దైవములు. బదరి కాశ్రమము నందలి పీఠమునకు శ్రీనారాయణ పూర్ణగిరి దేవులు ప్రధాన దేవతలు. జగన్నాథ క్షేత్రమున శ్రీ జగన్నాథ విమలా దేవులు పీఠమున కారాధ్యములు. ఈనాల్గు పీఠములను శంకరులు ధర్మ ప్రచారమునకై పనియోగించిరి.

శారదా దేవి శృంగేరి పీఠమున కభిమాన దేవతగ నిలిచిన దాని కొక కథ యున్నది. శంకరులు మండన మిశ్రులను వాదమున గెల్చిరి. అతని భార్యను గూడ వాదమున గెల్చినారు. వారిరువు రాతని శిష్యులైరి. శృంగేరిలో మండన మిశ్రి

నకు పట్టము గట్టిన శంకరులు ఆ స్థలమున కభిమాన దేవతగా వెలయవలెనని శారదా దేవిని ప్రార్థించిరట! మండన మిశ్రుని భార్య శారదాదేవి యవతారమని ప్రతీతి. శంకరుల మాట కామె యంగీకరింపలేదు. తానచట నున్నచో — తనతోపాటు సత్యలోకము గూడ నచ్చటికి వచ్చునని యామె తెలిపెనట! ఆమె శంకరుల యనుజ్ఞతో బ్రహ్మలోకమునకు వెడలి పోయినది. కాని ప్రతి నవరాత్రము నందును — దినమున కొక్క కళగా ప్రతీకమున బ్రవేశించి — మహానవమినాడు- పదునారు కళలతో నొప్పుచు. భక్తులను రక్షింప వలెనను ప్రార్థన కామె సమ్మతించినది, నవరాత్రోత్సవములలో శారదాదేవి తన సంపూర్ణ కళలతో — నచ్చట నివసించునని నేటికిని భక్తుల నమ్మిక.

సురేశ్వరాచార్యుల యనంతరము - పదునొకండవ గురువుగా నున్న విద్యాతీర్థులు — ద్రావిడ సంప్రదాయముతో శారదాదేవి కొక చక్కని యాలయమును నిర్మించిరి. వారు ప్రతిష్ఠించిన శారదాదేవి నేటికిని యున్నది. ఆమెయొక చేతిలో నక్షమాల, మరియొక చేత నమృత కలశము. ఒక చేత పుస్తకము మఱియొక. చేత నభయముద్ర.

విద్యాతీర్థుల శిష్యులే విద్యాశంకరులు. వారు తపోనిష్ఠులు. తమ కాల మాసన్నమైనదని తెలిసికొన్న విద్యాశంకరులు — తమ యధికారమును భారతీకృష్ణ తీర్థుల కిచ్చి — లంబికా యోగమును బట్టి తపస్సున కూర్చుండిరి. వారు

కోరినట్లుగనే - వారు తపస్సునకు కూర్చున్న గుహను నాల్గు వైపుల కప్పించి వేసినారు. పండ్రెండు సంవత్సరముల వరకును తనగుహను తెరువగూడదని వారియాజ్ఞ. కాని వారిశిష్యుల కుతూహలము విద్యాశంకరుల యాజ్ఞను చెల్లనివ్వలేదు. వారు తపస్సున గూర్చున్న నాల్గవ వసంతముననే శిష్యులాగుహా ద్వారమును దెరచిరి. ఏమాశ్చర్యము! విద్యాశంకరులు లేరు. లంబికా యోగముతో వారులింగైక్యతను బొందిరి, వారి దేహము పంచభూతములలో జీర్ణమగుట కారంభించినది. పండ్రెండు వర్షములు పూర్తిగాఁ జెల్లియున్నచో - వారే లింగ రూపమున దర్శన మొసగి యుందురో యేమో! వారియాజ్ఞ చెల్లలేదు. ఆ యోగనిద్రకు భంగము గల్గెను. విద్యాశంకరు లొకనాడు భారతీ కృష్ణుల స్వప్నమున నగుపడి - తాముతప మొనర్చిన గుహపై నొక లింగమును స్థాపించి దేవాలయమును గట్టింప వలెననిరి. భారతీ తీర్థుల ట్లే యొనర్చిరి. నాటినుండి యది విద్యాశంకర లింగమను పేర ప్రసిద్ధిగాంచెనది. శారదా దేవి - విద్యాశంకరుల దేవాలయములు - హోయిసల - వాస్తు శిల్పమునకు చేరినవి. కాని బయటికి చూచుటకు బౌద్ధుల చైత్యాలయములవలెఁ గనుపించును. అవి యెనిమిదవ శతాబ్ద మున నిర్మింప బడిన అజంతా - కన్హారీ - ఎల్లోరా దేవాలయ ములఁబోలియున్నవి. పశ్చిమ భాగములు అర్ధవృత్తాకారముతో నున్నవి. మధ్య భాగము వర్తులము. కాని గోపురము మాత్రి ముచాల దూరము వరకగుపించును.

ఆదిశంకరులు శారదా పీఠమును నిర్మించినపుడు దాని రక్షణకై — పూర్వ దిక్కున కాలభైరవుని, దక్షిణమునదుర్గని, పశ్చిమమున హనుమంతుని, ఉత్తరమున కాళికాదేవిని ద్వార పాలకులుగా ప్రతిష్ఠించిరి. తాము దేశసంచార మొనర్చి నపుడు తమకు సహాయ మొనర్చిన మళయాళ బ్రాహ్మణునకు గూడ నొక గుడికట్టించి — ఈ దేవాలయముల పూజలకు — తగిన వ్యవస్థలు కల్పించినారు.

నారాయణశాస్త్రి తుంగానదిలో స్నానాహ్నిక ములను తీర్చుకొని యింటిదారి పట్టినపుడు దారిలోనున్న మళయాళ బ్రాహ్మణుని గుడిముందు జనులు గుంపుచేరి యుండిరి. దానిని చూచి యితడాశ్చర్య మొందెను. వృత్తాంత మేమి యని విచారించినాడు. ఎవరో అన్నారు.

"పూజారయ్యపైకి బ్రహ్మపిశాచం వచ్చింది."

"ఏమి? పూజారిపైకి శ్రీరంగ భట్టావేశించినాడా?

నారాయణశాస్త్రి గట్టిగా నరచెను. అతడా జనము లోనికి దూరినాడు. పూజారి సాంబయ్య భూతావిష్టుని పగిది నావేశముతో గంతులు వేయుచుండెను. వానినొక నల్గురు పట్టుకొన్నారు. కాని యానల్గురిని గూడవాడీడ్చి తన్నుచు గట్టిగా నిట్లరచు చుండెను.

'నీచులారా! నన్నుకూడు లేక చంపుచున్నారు. నేనుప వాసముతో నానా యాతనలు పడుచుండగా—మీరు సుష్టు గాతిని బొజ్జలు పెంచికొను చున్నారా? నే నెవరనో తెలియునా?

శ్రీరంగ భట్టును; బ్రాహ్మణపిశాచిని. నన్ను పేక్ష యొనర్చి నందులకు — ఈసారి మీకు చక్కగా బుద్ధిచెప్పెదను. ఈసారి మిమ్మందరిని ఆపోశనము పట్టకున్నచో—నాపేరు శ్రీరంగభట్టు కాదు. నాకాది శంకరుల యనుజ్ఞ యున్నది. ఈసారి నే నెవ్వరికిని భయపడను. జనులలో నన్యాయములు అనాచారములు పెరిగి పోవుచున్నవి. ఎక్కడ చూచినను మోసము; వంచన; నాకన్నుల యెదుట నే ధర్మగ్లాని సాగిపోవు చున్నది. నేనిట్టి సమయమున కే కాచికొని యున్నాను. ఈచోటి కధికారి నేనే. నన్నాపుట కెవ్వరికిని శక్తిలేదు. నాపొట్టనిండు వరకీ సారి నరబలులు తీసి కొందును. నన్నుపవాసముండ జేసిన నీచుల రక్తమును తృప్తిగా త్రాగెదను. ఈసారి గురువుల యాజ్ఞయైనది. అనేక వర్షముల యాకలినీయాకుతో తీర్చుకొనెదను."

పూజారి సాంబయ్య మొగము చామ నలుపు. అది యిప్పుడు కాలిన పెనమువలె నుండెను. వాని నుదుటినిండ పసుపు — కుంకుమములు పూయఁబడి యుండెను. సాంబయ్య సుడిగాలి వలె నూగుచున్నాడు. వాడు నడుమ నడుమ తననె వెంట్రుకలు పీకి కొనుచుండెను.

నారాయణశాస్త్రికి శ్రీరంగభట్టు యెవరో తెలియును. అందుచే నాతఁడు వినయమున నిట్లు ప్రశ్నించెను.

"స్వామీ! మేమే యపరాధ మొనర్చినాము? మాపై నెందులకు పగతీర్చుకొన యత్నించు చున్నారు?.

శ్రీరంగభట్టు పకపక నవ్వెను." మీరు చేసిన యప

రాధములా? ఎన్నని చెప్పుదును? నూరారు వర్షముల నుండి ధర్మము పేరిట మీరు చేయుచున్న యన్యాయములను చూచు చున్నేయున్నాను. ధర్మమన్న మాట మీ యన్యాయముల కొక్క ముసుగు. నాకు మిమ్ముజూచి వేసరిక యైనది. ఇక నోర్చుకొనుటకు సాధ్యముగాదు. మీ యన్యాయములే శ్రీగిరి భట్టయినాడు. ధర్మము పేరిట వంచన; మతము పేరిట మోసము నాకు గురువుల యాజ్ఞయైనది. నాచేతనైనంత మందిని బలిగాఁ దీసికొందును.”

పూజారి సాంబయ్య గావు కేకలువేయు చున్నాడు. ఆ కేకలు తుంగానదిలో ప్రతిధ్వనించు చుండెను.

“స్వామీ! తెలియక మేము చేసిన యపరాధములను క్షమింప వలయును. చెప్పుడు అన్నదానములు చేయుదుము వస్త్రదానములిత్తుము. ఇంకేమి చేయవలెనో చెప్పుడు. మీ కోర్కె తు. చ. తప్పక చెల్లింతుము. ఈయొక్కసారి మాత్ర ప్పులను మన్నింప వలయును. భారతీస్వాముల కీవిషయము లన్నియు నివేదించి వారియనుమతి సంపాదింతుము, తమరు శాంతింప వలెను.”

“ఈమాట తప్పమని ప్రతిజ్ఞ చేతురా?” బ్రహ్మరాక్షసి హుంకరించెను.

“తప్పక చేతుము.”

“రేపు పున్నమ లోపల పదివేల మంది కన్నదానము కావలెను. వస్త్రదానములు జరుగ వలెను. తెలిసినదా!”

“తెలిసినది.”

"ఈమాట తప్పినచో – దాని పరిణామము ఘోరమై తీరును. జ్ఞాపక ముంచి కొనుడు."

పూజారి సాంబయ్య శరీరమునుండి బ్రహ్మరాక్షసి తొలగి పోయెను. అతొలఁగి పోవునప్పుడు – వాడు చేయు హాహాకారములు – గర్భ నిర్భేదకములుగ నుండినవి. వాడఱచుచు, పెద్దచెట్టువలె నేలఁ గూలెను. దగ్గర నున్నవారు వానిపై నీరు తెచ్చి పోసిరి. కొంత సేపటికి వాడు లేచి కూర్చున్నాడు. అంతకన్నముందు జరిగిన వృత్తాంతము వానికి జ్ఞాపకమే లేదు. వాడేదో నిద్రనుండి నట్లుండెను. జరిగిన సంగతి వానికి తెలిసినపుడు – తక్కిన వారి వలెనే వాడుగూడ నాశ్చర్య పడెను. భయపడెను.

ఆ ప్రాంతములలో మళయాళ బ్రహ్మరాక్షసి కథ తెలియని వారు లేరు. అతని నిజమైన పేరు శ్రీరంగభట్టు. కాని సామాన్య జనుల నోళ్ళలో నాతడు మళయాళ బ్రహ్మరాక్షసి యైయుండెను. అతనిది పెద్దకథ.

ఒకసారి భగవత్పాదులు సంచరించు చున్నపుడు సింగిరి భట్టు, బ్రహ్మపిశాచము కనపడెను. అతనిని సింగిరిభట్టనియు, శ్రీరంగభట్టనియు పిలిచెదరు. త్రేతాయుగమున వాడేదో గొప్ప పాపమొనర్చెనట! ద్వాపర యుగము గడచి కలియుగము వచ్చినగూడ నాపాపము తీరలేదట! అతడు పిశాచియై యొక చెట్టు నాశ్రయించి యుండెను. ఆ మార్గమున వచ్చుపోవు వారిని పీడించు చుండెడివాడు.

ఆదారిలో సంచరించుచున్న శంకర భగవత్పాదుల కాపిశాచ వృత్తాంతము తెలిసినది. వానిపై వారికి దయగల్గి నది. కాని వాని నోటనే వాని వృత్తాంతము విననలయునని భగవత్పాదులు తలచిరి.

"ఎవరది? ఎందుకక్కడ గూర్చున్నారు?

భగవత్పాదులు ప్రశ్నించినారు.

"నేనేప్రభూ! శ్రీరంగభట్టును. నాపాపఫలముగా పిశాచత్వము వచ్చినది. దానిని దీర్చుకొనను చున్నాను."

"నీకీ పాడుజన్మ మెందుకు వచ్చినది? అంతటి మహాప రాధమేమి చేసితివి?

ఆది శంకరు లనుకంపతో నడిగెను.

"భగవన్. ఇది పెద్దకథ. సంకుచితముగా చెప్పెదను. నేనొక దరిద్ర బ్రాహ్మణుడను. కృతయుగమున శ్రీరామ చంద్రుడు - తులాపురుష దాన మొనర్ప నుద్యోగించినపుడు — నేనులోభి తనమున దానిని ప్రతిగ్రహించితిని. దాని ఫలమే నాయీ అనుభవము."

"ఆపాపము రెండు యుగములు గడచినను తీరలేదా?

"లేదుప్రభూ! నేనాకలి దప్పుల కలమటించు చున్నాను. నాయాకలి బాధను తమరు తీర్పవలయునని నాయాశ."

"పరిహరించినచో - నాకేమి సాయ మొనర్తువు?

"స్వామీ! మీరు సర్వజ్ఞులు. మీకు తెలియని విషయ ము లేదు. కాని - మీరేదో నన్ను పూతాత్ముని జేయుటకు —

యీపెద్ద తనమును నాకారోపించు చున్నారు. లేనిచో — శంకరావతారులగు మీకు నేనే సాయమొనర్తును? అయినను నన్ను మీరడుగుచున్నారు గనుక చెప్పెదను. తమరు వేదవ్యాసుల దరిసెనము నిచ్ఛగించుచున్నారు వారున్న స్థలమునే నెఱుగుదును. వారు కలియుగమున గూఢముగ సంచరించు చున్నారు. గుఱుతించుటకష్టము. ఈ కార్యమున మీకు నేను సాయమొనర్తును."

నేను నీయాకలి దప్పులను దీర్చెదను. వ్యాసభగవానుడు యెక్కడ నున్నాడో చెప్పుము.

"వారు కాశీయందున్నారు. మధ్యాహ్న వేళలో — మనుజు లెవ్వరు లేని యపుడు — హరిశ్చంద్ర ఘట్టమునకు స్నానమునకు వత్తురు. చూచుటకు శ్వపచులవలె నగుపింతురు. వారిని తెలియుట కొక్కటే మార్గము. వరిపొట్టును వారు దాటరు. అది పడిన మార్గమున సంచరింపరు."

ఆది శంకరులు వాని యాకలి దప్పులను దీర్చి కాశికి నడచెను. వ్యాసభగవానులను గుర్తించి వారి పాదములను బట్టుకొన్నాడు. వ్యాసులు తొలుత కసురుకొనిరి. మరికొంత సేపటికి నీకేమి కావలయునని యడిగినారు.

"నన్ను తమరు శిష్యునిగా గ్రహింప వలయును."
"నిన్ను శిష్యునిగా గ్రహించుటకు మేమెవ్వరము"?
"మీరు జగద్వంద్యులు వ్యాస భగవానులు కారా?"
"ఈసంగతి నీకెవ్వరు తెలిపిరి?"

"శ్రీరంగ భట్టు తెలిపెను."

"ఓహో! ఓహో! భట్టా! నారహస్యమును బయట పరచిన నీవు—కలియుగము ముగియువరకు పిశాచముగనే పడియుందువు.!

వ్యాసులు ఘోర శాప మొసంగిరి.

వేద వ్యాసులు శంకరులవైపు సందేహాశ్చర్యములతో చూచుచుండిరి.

వెంటనే యాది శంకరులు—"శంకరశ్శంకరస్సాక్షాత్ వ్యాసో నారాయణోఽవ్యయః. తయోర్వి వాదే స్సంప్రాప్తే కింకరశ్శంకరో భవేత్." అన్నారు.

వేద వ్యాసులపుడు గుర్తించిరి. వ్యాసుల యనుజ్ఞతోనే శంకరులు మండన మిశ్రుని గెలిచెను. వారు ధర్మ పీఠ స్థాపనకై స్థలమును-వెదకు కొనుచు—వచ్చుచుండిరి. శృంగేరికి వచ్చు వేళకు శ్రీరంగ భట్టు జ్ఞాపకము నకు వచ్చెను అతఁడొనర్చిన-సాయము జ్ఞాపకమునకు వచ్చినది. వాని యాకలి దప్పులను దీర్చుటకు—సంతర్పణ కేర్పాటు చేసి శంకరులు—శ్రీరంగ భట్టున కొక గుడికట్టించిరి. వారొనర్చిన — కట్టడననుసరించి — ప్రతి నవరాత్రి యందును శారదా విద్యాశంకర దేవతలకు — హోమపూజలు నడచినపుడు — శ్రీరంగభట్టు నకే మొదటనైవేద్యమును పూజయు నడచు చుండెను. ఈ సారి నవరాత్రి వఱకు కాచుకొను ఓర్పాతనికిలేదు. అందుకని ముందుగనే ఆహారమును వేడెను. ఈ దృశ్యమును జూచిన నారాయణ

శాస్త్రి ఆశ్చర్యము నకు మితి లేదు. ఈవృత్తాంతమును భార తీయ స్వాములకు తెలుపుట కతడు—వెంటనే శ్రీమఠము నకు నడిచెను.

౪

నృసింహ భారతులు—పూజలో నుండిరి. పూజ ముగియు వఱకును కాచుకొను నోర్పు నారాయణశాస్త్రికి లేదు. ఒకవేళ స్వాములకీ వృత్తాంత మంతయు దెలిపినను వీ రేమి చేయుదురు? శ్రీమఠపు సర్వాధి కారియైన మల్లిపండిత నరసింహ శాస్త్రు లను పిలిపించి మాటలాడుదురు. వారు భారతీస్వాముల ప్రియ శిష్యులు. వారి సలహాలేనిదే స్వామి యేపనియు చేయరు, నారాయణశాస్త్రి మనస్సున శాంతిలేదు. లేకున్నచో — పూజను జూచుచు గూర్చుండెడి వాడే; నేడక్కడ గూర్చుం డుటకు—ఆతనికి విసుగనిపించెను. తాను నరసింహశాస్త్రి కడకే యేల పోరాదు? అతడు తొందరగా నాతని యింటివైపు నడ చినాడు.

నరసింహశాస్త్రి కపుడే భోజనము ముగిసినది. అతడు మేడపై విశ్రాంతి తీసికొను చుండెను. తాంబూలమును సేవించు చు మేదోరహస్య పత్రములు జూచుకొను చున్నాడు. నారా యణశాస్త్రిని జూచిన వెంటనే సర్వాధికారి కుమారుడు చంద్ర శేఖరుడు - అతనిని మేడపైకి పిలుచుకొని పోయెను.

అది ప్రాతకాలపుమిద్దె. స్తంభములు బృహత్కాయములు. వాని పై దారుశిల్పములు. ప్రతి స్తంభమునకు చక్కని బోదెలు. చక్కని

శిల్పము లున్ననా బోదెలపైననే; నేలపైయొక రత్నకంబళము, పరువ బడినది; అదియు పాతదే. అగుటచే దానిరంగు కొంత మ్రాసినది. నృసింహ భారతులకు ముందున్న స్వాముల వారు దానిని – సర్వాధి కారుల కొసఁగి యుండిరి. ఆమేడలో రెండు వాతాయనములు. వానికిఁగూడ చెక్కడపు పనులు. ఆశిల్పి చేతిలో – శిలా దారువులు పిండివలె వంగినట్లగుపించు నంతటి చాతుర్యమూ చెక్కడపు పనిలో నున్నది. ఆగవాక్షములలో నుండి – తుంగభద్రా సముత్తుంగ వీచీఘటా శీతల శీకర పరిష్వక్తమైన గాలి వీచుచుండెను. ఆగవాక్షములకు తెరలున్నవి. కాని వాని నప్పుడు వాడలేదు. గదిలో నొకవైపున తాటి యాకుల గ్రంథములున్నవి. వానిలో నెక్కువ గీర్వాణ గ్రంథములే. కొన్ని కన్నడ పుస్తకములు. గోడలపై సర్వాధికారి తండ్రి భావ చిత్రమొక్కటి యుండెను. నృసింహ భారతుల చిత్రము గూడ నుండెను, ఒక మూలలో పాతగిల్లిన వీణ తంబూర మృదంగము మొదలైన వాద్యవిశేషము లుండెను తమ వయస్సులో నరసింహ శాస్త్రిలు చక్కని రసికులై – యుండెనని తెల్పుచుండెను. ఇపుడు వానిని పల్కరించువారు లేరు. కుమారుడు చంద్రశేఖరుఁడు శాస్త్రి కర్కశుడు. నాగాయణశాస్త్రికి వీణకొంత వచ్చును. అతడా వాద్యములను జూచి "అయ్యో" అనుకొన్నాడు. ఇపుడు నరసింహశాస్త్రిలకు సుమారరువదికి పైన వయస్సు. కాని శరీరమేమియు సడలలేదు. కన్నడ సంస్కృత ములలో నాతడుద్దండ పండితుడు.

నిష్ఠావంతుడు. వ్యవహారజ్ఞానమున నాతనిని మించిన వారా ప్రాంతములలో — లేరు, ఈ విద్య యాతనిసొమ్ము. ఎన్నో సారులు మఠము తరపున నతడు రాజధానియగు శ్రీరంగపట్టణమున నున్న టిప్పుసుల్తాన్ కడకు రాయబారము వెళ్ళి యుండెను. అతడు చేతంబట్టిన ప్రతికార్యము నందును విజయమే. అందుకై స్వామికి వానిపై ప్రత్యేకాభి మానము. ఆతడు సర్వాధికారి పదవిని స్వీకరించిన తర్వాత దానిగౌరవ ప్రతిష్ఠలు పెరిగినవి. ఆదాయముగూడ హెచ్చయ్యెను. అంతటికీర్తి ప్రతిష్ఠలు మఠమున కంతకుముందు లేవు.

నరసింహశాస్త్రి సర్వాధికారి పదవిని స్వీకరించి నపుడు— మఠపరిస్థితి సామాన్యముగ నుండెను. అంతకుముందు నరసింహశాస్త్రిల యన్న సర్వాధికారిగ నుండెను. అతని పర్యవేక్షణ యంతతృప్తి కరముగ నుండలేదు. మఠమునకు వరమానము తగ్గి యుండెను. రావలసిన రాబడులు, బాకీలు నిలిచి పోయినవి. మఠమప్పులోబడి పోయినది, జాగీరులను రైతులే యనుభవించు చుండిరి. శృంగేరికి వచ్చు — యాత్రికులలో గాని — భక్తులలోగాని. మఠముపై నంతభక్తి శ్రద్ధలు లేవు. శారదా పీఠము కొంత హీనస్థితిలోనే యుండెను. ఈపరిస్థితుల నన్నిటిని చక్కజేసి మఠము నభివృద్ధి పరచుటకు — నరసింహాశాస్త్రి రాత్రింబవళ్లు కృషిచేసినాడు. ఆతని విచారణ, నీతి, వ్యవహార కుశలత కార్యదీక్షిత, ఋజుజీవనము — స్వామినిష్ఠ దీని మూలమున — శారదాపీఠము అభివృద్ధికి వచ్చినది. దాని

కీర్తి చాల దూరము వ్యాపించెను. ఏయుత్సవమైనను వేలాది జనము చేరుచుండిరి. నవరాత్రులు వచ్చినచో నిక చెప్పవలసి నదిలేదు. మహారాష్ట్ర పీష్వాలుగూడ శ్రీమఠమునకు గౌరవము చూపించి కానుకలంపుచుండిరి. అంతమాత్రమే గాదు. విధర్మి యైన టిప్పుసులతాను గూడ సచ్చిదానంద నరసింహ భారతీ స్వాములపై గౌరవము జూపుచుండెను. అతనికి శారదా పీఠ మన్నచో ప్రత్యేకాభిమానము. ఈపరిస్థితులన్నియు — నరసింహశాస్త్రి కల్పించినవే! అతని త్యాగము, స్తుత్యర్హమై యుండెను.

శంకర భగవత్పాదులు శారదాపీఠమును స్థాపించిన వెంటనే — అది సంస్థానమగు పరిస్థితికి రాలేదు.

అది "దక్షిణదిశి రామక్షేత్రం" "ఆది వరాహో దేవతా శారదా దేవచ. తుంగభద్రా తీర్థం శృంగేరీ మఠః భూరివాళ సంప్రదాయః. తత్త్వ ప్రవర్తక సన్యాసి నామాని సురేశ్వరా చార్యః" అనెడి ప్రసిద్ధి నందికొనినను — దాని ప్రభ గొప్పగా వెలిగినది. విద్యారణ్యుల కాలమందే! ఆకాలమున — దానికి రాజమర్యాదలు దక్కినవి విద్యారణ్యులను పేరిట — అధికారమునకు వచ్చిన మాధవాచార్యులు — అద్వైత పీఠమైన శృంగేరిని ప్రముఖ ధార్మిక పీఠముగా మార్చెను. విద్యారణ్యులకు ముందున్న గురువులందరును, తమ సరళ జీవనములతో — పూజాధ్యాన వ్యాసంగములతో — గ్రంథ రచనా తాత్త్విక చింతనలతో — జనసామాన్యమందు ధర్మ

శ్రద్ధను వ్యాపింప జేసిరి. ప్రజలలో ధర్మ దృష్టితగ్గి నపుడు — తమ ఆదర్శ జీవితముతో—వారిలో ధర్మదృష్టి కలిగించుచుండిరి. వారిజీవితము ఆకు క్రిందికాయవలె, హిందూధర్మ సంస్కృతుల రక్షణకు. పరోక్షముగ తోడ్పడు చుండినది.

విద్యారణ్యులు సన్యాసమును స్వీకరించుటతో శ్రీమఠ ముయొక్క స్వరూపమే మారినది. మాధవాచార్యులు చాల కాలము హరిహరరాయ బుక్కరాయలకు మహామాత్యులుగా నుండిరి. విజయ నగర సామ్రాజ్యమునకు ప్రబలమైన అస్తి భారమును వేసినదివారే. వారు తమతపశ్శక్తిచే ధర్మశక్తిచే నాటి ధర్మగ్లానినే దొలగించి వేసిరి. యవనులనుండి ప్రాప్తించిన గండముల వలన — హిందూ ధర్మమును సంస్కృతిని రక్షించిరి. శ్రీమఠము నకు రాజాదరణము లభించెను. గురు పీఠము సామాజిక, రాజకీయ ధార్మిక రంగములో — ఆశ్చర్య కరమైన పనియొనర్చి ప్రజాజీవనములో — నవోదయమును గల్గించెను. ఆశ్రీమఠము విజయనగరసామ్రాట్టులను—ఉదాత్త ధ్యేయములకై ఆదర్శములకై నడిపించు మహాజ్యోతిగ దయా రైనది. విజయనగర సామ్రాజ్యము పోయిన తరువాత — "కెళది" రాజులు—మైసూరు రాజులు—శ్రీమఠమునకు మర్యా దలు చెల్లించుచునే యుండిరి. "కెళది" వెంకటప్ప నాయకుడు— అభినవ నరసింహ భారతులను — తనయాస్థానమునకు బిలిపిం చుకొని — మర్యాద నడపి యుండెను. మఠమునకొక పచ్చని ధ్వజమును సమర్పించెను. స్వాములు తాము రచించిన "శివ

గీత"ను ఆస్థానమున పఠించి — విద్వజ్జనుల మన్ననలకు — పాత్రులై యుండిరి. వారి తర్వాత పట్టమునకు వచ్చిన—సచ్చిదానంద భారతులు దేశ సంచారములకు బయలుదేరి ప్రసిద్ధ దేవియైన — మూకాంబను సందర్శించి — యామె యనుగ్రహమును సంపాదించికొని వచ్చియుండిరి.

వీరభద్ర నాయకుడు — శివప్పనాయకుడు—వీరి కాలములలో శృంగేరి పీఠము యింకను ప్రసిద్ధికి వచ్చినది. శివప్పనాయకుడు "భవాన్యాంబికా" దేవాలయమును గట్టించెను. రాణి చిన్నమ్మ కోర్కెతో నృసింహ భారతులు సహస్ర కుంభాభిషేకమును నడపించి—దేశమునకు వచ్చిన యరిష్టమును దొలగించిరి. బసప్ప నాయకుని కాలమున సచ్చిదానంద భారతులు దేశయాత్రకు బయలుదేరి ధర్మాభివృద్ధి నొనర్చి వచ్చియుండిరి. "చెరికె పురము" "తరికెణ" మొదలయిన పాళెగాండ్రు వారిని సందర్శించి సన్మానించిరి. సచ్చిదానంద భారతులకు ప్రజలలో గొప్ప పలుకుబడి యుండెను. రాజులకును వారిపైన గొప్పగౌరవము. వారిరెండాను కూల్యములను — ధర్మశ్రద్ధకై వెచ్చించిరి. పండితులను గౌరవించిరి. కళాకారుల కాశ్రయమొసఁగిరి. నాటి ధార్మిక జీవనమున వారు వహించిన పాత్ర సామాన్యమైనది గాదు. ఇంతయైనను శ్రీమఠమునకు మాత్రము— వృద్ధిక్షయములు దప్పలేదు. వెంకటప్ప నాయకుని కాలమున మఠము జీర్ణస్థితికి వచ్చెను శివప్ప నాయకుఁడు దానిని జీర్ణోద్ధార మొనర్చెను. అందుకై మాతఁను "శృంగేరీ,

పునరుత్థాపనాచార్య” అను బిరుదమును వహించినాఁడు. ఇమ్మడి హరిహర రాయలును—మరికొందరు పూర్వరాజులును—మఠమునకు కొన్ని జాగీరులనిచ్చి యుండిరి. వానిని స్వార్థపరులైన పాళెగాండ్లు సంగ్రహించిరి. శివప్ప నాయకుని తరువాత వెంకటప్పనాయకుఁడా భూములను వారినుండి రాబట్టుటకై కృషి చేసెను. కొందరితో మంతనములాడెను. కొందరిని బెదరించెను కొందఱికి పరలోక భయమును జూపెను; అతని ప్రయత్నములకు శృంగేరీస్వాముల యాశీర్వచనములు నిండుగా నుండెను. వెంకటప్ప నాయకుఁడు మఠమునకు రావలసిన పాత బాకీలను గూడ వసూలుచేయించెను. ”ఇక్కేరి” దొరలు శృంగేరి మఠరక్షణము — తమ పరిపాలనము లోని భాగమని భావించి యుండిరి. దాని ఖర్చు—వెచ్చములకై—వారెన్నియో జాగీరు లిచ్చిరి. అంతమాత్రమే గాదు. ‘చాలకూరు’ ‘హోబళిసీమ’ అరవట్టి యగ్రహారము. కుంభశము, బట్కల్, గెరసొప్ప, సిరాని, చందావరము ‘బెళతంగళి’ మొ॥ ప్రదేశములపై ధార్మికమైన సుంకములను విధించి దానిని శ్రీమఠమునకు చేరునట్లేర్పాటు చేయించిరి. వారి యనంతరము ప్రసిద్ధికి వచ్చిన మైసూరురాజు లక్కడ యిదే రీతినను సరించిరి. కంఠీరవ నరసరాజ యొడయరు — అనర్ఘమైన వజ్రములతో — వేణుగోపాలస్వామి విగ్రహమును — శ్రీమఠమున కొసగెను. అంతమాత్రమేగాదు ఉత్సవములకు పనికి వచ్చు సామానులను గూడ నిచ్చెను. ఇట్లు రాజులు మొదలు

శాతుల వరకును శృంగేరి పీఠముపై నభిమాన గౌరవములు పుంజుకొనియుండెను. వాని క్షేమాత్రము లోటొనర్పక రక్షించుకొని వచ్చు బాధ్యత నృసింహశాస్త్రిపై బడినది. మైసూరు రాజ్యము హైదరాలీ – అనంతరము – టిప్పు సుల్తాను చేతికి చిక్కినపుడు. వారినుండి శ్రీమఠమునకే నష్టమును కలుగక యుండునట్లు చూచుకొన వలసిన బాధ్యతస్వామిపై బడెను. వ్యవహార చతురుడు – లోకజ్ఞుడు – అయిన నరసింహశాస్త్రి టిప్పుసుల్తానుతో ఆర్థికమైన సంబంధమునే యుంచికొనెను. నృసింహ భారతులకును–టిప్పుసుల్తానునకు గూడ–మధురమైన సంబంధమే యుండెను.

ఈ నాడు టిప్పుసుల్తాను నుండి భారతీస్వాముల కొక పత్రము వచ్చినది. దానిని సర్వాధికారి చూచుచుండెను. టిప్పుసుల్తానుపై యిగ్లీషువారు యుద్ధమును ప్రకటించియుండిరి. వారికిమహారాష్ట్రులుతోడు. వారితో నిజాము చేరియుండిరి. 'కాప్టన్ టిల్, అనువాని యాధిపత్యమున బొంబాయి నుండి యింగ్లీషు సైన్యములు బయలు దేరినవి,' పరశురామ భావే సేనాధిపతియై– మహారాష్ట్ర సైన్యమును నడపినాడు, ఇవి రెండు. ఉత్తర దిక్కునుండి–మైసూరు గడి దేశములపై బడు టకు ప్రయాణమైనవి. ఈవిషయము లన్నియు టిప్పుసులతాను పత్రమున వ్రాయబడి యుండినవి. ఈ సైన్యములతో శ్రీమఠమునకు తొందర కలుగకుండ జాగ్రత్త పడవలెనని–సులతాను తెలిపి యుండెను. హఠాత్తుగా వచ్చిన యీ పత్రమును చదు

వుకొని — 'యేమి చేయవలెనా?' యని యాలోచించు నపుడు నారాయణశాస్త్రి యింతకంటెను భయంకరమైన వార్తను తీసికొని వచ్చినాడు.

"నారాయణా! ఏమి సమాచారము? నీముఖమును చూచిన నేదో యాలోచనలలో సదమదమై నట్లున్నది. విషయమేమి?"

నృసింహశాస్త్రి నారాయణశాస్త్రి మొగము చూచుచునే యనెను. వారు నారాయణశాస్త్రి నేకవచనముతో సంబోధించుట యలవాటు. నారాయణశాస్త్రి తండ్రియు — నరసింహశాస్త్రియు స్నేహితులు. నరసింహశాస్త్రి యాగర్భశ్రీమంతుడు. సుబ్బాశాస్త్రి దరిద్రుడు. ఈ భేదము వారి స్నేహమున కడ్డురా లేదు. ఇద్దరును శాస్త్రమున నద్వితీయులగు పండితులు. వారిర్వురి విద్యాభ్యాసముగూడ నొక చోటనే జరిగినది. ఒక్కొక్కరే జీవన రంగమున బ్రవేశించిరి. కాని నరసింహశాస్త్రి శృంగేరి మఠమునకు స్వారాధికారి యయ్యెను అతడు కిరీటము లేని చక్రవర్తి. మరియొకనికి వైదికవృత్తితో జీవనము గడుపు కొనవలసి వచ్చినది. సుబ్బారాయశాస్త్రి మరణించిన తరువాత వారిర్వురి కుమారులకును, నరసింహశాస్త్రి శ్రీమఠము నందే యుద్యోగముచు చూచిపెట్టెను, నరసింహశాస్త్రి కుమారుడు చంద్రశేఖరుడు—నారాయణశాస్త్రియు సమవయస్కులు—సహాధ్యాయులు. వారిర్వురికి అన్న దమ్ములకున్నంత మైత్రి. చంద్రశేఖరున కీనడుమనే వివాహమైనది. ఒక బిడ్డ

తండ్రిగూడ. నారాయణశాస్త్రి మాత్రము వివాహమువైపు తన చూపే త్రిప్పలేదు. ఈ విషయమున వాని వదిన వలెనే - చంద్రశేఖర శాస్త్రియు హాస్యము చేయుచుండెను.

"నీవిట్లే ఘోటక బ్రహ్మచారివై పోదువా యేమి?"

"నేనందరి వలెనే పెండ్లి చేసికొనను. చేసికొన్నచో - నారాయణమూర్తివలె నిర్వురు భార్యలను గట్టుకొందును." నారాయణశాస్త్రి వినోదమునకై యనెడివాడు.

కాని నేడు వారిర్వురి నడుమ - యీహాస్యము లేవియు జరుగలేదు. అతడు నేరుగా సర్వాధికారి దగ్గరకు వచ్చెను. చెమట బట్టిన వానిముఖము - అన్నమునకై - ఆకలి గొన్న ట్లున్న వానికడుపు - చంచలముగా పైకెగురుచున్న వాని కను బొమ్మలు - చూచి నరసింహశాస్త్రికి సందేహమైనది. అతడు మరల నడిగెను,

"నారాయణా మిట్ట మధ్యాహ్నము. ఎండలో పరుగె త్తుకొని వచ్చినావు? ఏమి సమాచారము? ఇంటిలో నందరు నారోగ్యమే గదా!"

"మీ యాశీర్వాదముతో నందరారోగ్యమే. నేనిక్కడ కువచ్చినది తమకొక అత్యవసరమైన విషయమును తెల్పుటకు. ఆజ్ఞయైనచో. . .

"ఏమది? సంకోచ మెందుకు?"

"స్వామీ! నేనింటికి వచ్చునపుడు, మళయాళ బ్రహ్మ పిశాచి గుడిముందు - జనముచేరి యుండిరి. విషయ మేమో

తెలిసికొందమని నేనుగూడ దూరితిని. పూజారి సాంబయ్యకు-ఒడలిపైకి వచ్చినది. వాడొక భయంకరమైన భవిష్యత్తును చెప్పెను. దానిని విని యేమియు తోచక యిట్లు వచ్చితిని."

"ఏమన్నాడు?"

జరిగిన సంగతి యంతయు నారాయణశాస్త్రి వినిపించినాడు.

"స్వామీ! ఆతడు కోరినట్లు వచ్చు పున్నమ లోపల పదివేల మంది బ్రాహ్మణులకు సంతర్పణ చేయకున్నచో - శృంగేరి నివాసులపై నాతడుపగ తీర్చుకొనునట."

"అంతేగదా! తీర్చుకొననీ. . ." ఈ సాంబయ్యకేదో మతి చెడినట్లున్నది. మళయాళ బ్రహ్మరాక్షసి పేరు పెట్టుకొని -యేదో మెత్తుగడ వేసినాడు. ఈ యెత్తుగడలకు మనము భయపడినచో - నిర్వాహమే కష్టమగును."

"మీరు పెద్దలు. సర్వము తెలిసినవారు. ఈ పిశాచి సామాన్యమైనది గాదు. దీనినిక్కడ స్థాపించి - అందరి కన్నను ముందు - నైవేద్యము - పూజ జరుగ వలెనని నిర్ణయించిన వారు ఆది శంకరులు. దీనికి స్థలపురాణమున్నది. దాని ననుసరించి యే ప్రతి నవరాత్రి యందును బ్రాహ్మణ భోజనమునకు ముందు దానికి నైవేద్యము చెల్లుచున్నది. ఈ నియమము నుపేక్షించినచో - తొందర గల్గునని జనుల కందరకును దెలియును. ఇపుడుకూడ దానిభవిష్యత్తును మన ముపేక్షించినచో మనకేదైన కష్టము గలుగ వచ్చును."

"నారాయణా! నీకింత వయసు వచ్చినను నీవమాయకుడవు. ఇది మళయాళ బ్రహ్మ పిశాచి మాటగాదు. మరి పూజారి సాంబయ్య ఆట. వానికి మనమిచ్చుచున్న నెల బత్తెము చాలదట! దేవస్థానముకొసగిన భూములు గూడ తక్కువయే. ఈనడుమ భక్తులు తెచ్చియిచ్చు దక్షిణలు గూడ తగ్గిపోయినవి. అని వాని ఏడ్పు. తనజీవనము భద్రపరచి కొనుటకై—వాడీ యెత్తు వేసినాడు."

"అవును. వాడొక సారి నాతోగూడ తన కష్టములు చెప్పి కొన్నాడు. సర్వాధి కారులతో చెప్పి యే మైన—సహాయము చేయించ వలెనని పలికి యుండెను."

"నీకు వాని కథ తెలియదు. వాడొక సంవత్సరము నుండి తనకుబత్తెముఎక్కువ చేయవలయునని గోడుగుడుచుచున్నాడు. నిజముగా చాల కున్నచో—నేమైన నుపాయము చేయవచ్చును. కానీ వాడొకటికి పది ఖర్చుపెట్టును. ఇంటిలోనెవరెవరినో చేర్చుకొన్నాడు. చాలని దానికి యిర్వురు భార్యలు ఇంతమాత్రమే యైనచో—బాగుండెడిది. చాలనిదానికి మూడవయామె నెవరితోనో సంబంధ మేర్పరచు కొన్నాడట! ఆమె కోసము వాడప్పును చేసెను వానిని తీర్చుకొనుటకు బాధపడుచున్నాడు తప్ప—తన కుటుంబమునకై గాదు. నేనిదంతయు జాగ్రత్తగ విచారించి కొన్నాను. వానిని సన్మార్గమునకు ద్రిప్పుటకై—ప్రయత్నించితిని. వినాడుగాదు. తన యింటికి సంబంధించిన విషయములలో—నితరులు జోక్యము కల్పించి కొనరాదని

క్రొత్త ధర్మ సూత్రమును వల్లించెను. వారి సర్వాధి కారిత్వ
ము —మఠమున కే గాని —మాయింటికి గాదని-అక్కడ క్కడపలు
కు చున్నాడట! ఇప్పుడు తన కోర్కెలు నెరవేర్చు కొనుటకీ
యెత్తులవేసినాడు. మనము వీనికి భయపడరాదు. వాడుచెప్పిన
భవిష్యత్తు—పిశాచి చెప్పిన భవిష్యత్తు గాదు. సాంబయ్య చెప్పి
నది. ఉత్సవము జరిగినచో సంతర్పణ జరిగినచో—తనకు గూడ
నాలుగు కాసులు చిక్కును. దానితో నప్పులు తీర్చికొన
వచ్చును. వాడు మనకు కనపడునంత రెండింతలు లోపల
నున్నాడు.”

నారాయణశాస్త్రి యీమాటలు శాంతముగానే వి
నెను. అతని కేమియు బదులు తోచలేదు. కడకు

“ఇది యంతయు సాంబయ్య కపట నాటకమా”
అన్నాడు.

“అవునవును; పదివేలమందికి సంతర్పణ చేయుటకు వీరి
తండ్రి ముల్లెతెచ్చి పెట్టినాడా? అర్థములేని మాట! వానికి
రుచిరుచిగా తింద మనిపించినది. ఆకోర్కె యున్నచో మాయిం
టికి భోజనమునకు రమ్మనుము. వాని కడుపు నిండ తిండిపెట్టె
దము. అంతేగాని వీని మాటలు విని-ఊరికంతయు భోజనము
పెట్టుటకెట్లు సాధ్యమగును? వాని మాటలన్నియు చెవిలో వేసి
కొన్నచో — మఠము దివాలా తీయువలసినదే!”

నారాయణశాస్త్రి కేమిచేయుటకును తోచలేదు. తాను
వచ్చినపని ముగిసినట్లు తోచినది. మెల్లగా నింటి ముఖము

పట్టెను. పోవుచు కడమాటగా నిట్లనెను.

"అది యతయు మళయాళ పిచాచము పేరట సాంబయ్య కట్టిన నాటకమన్న మాట."

"అందుకు సందేహమా యేమి? నీవు వాని మాటలు లెక్కపెట్టకుము, సాధ్యమైనచో నీవు పూజారి సాంబయ్యను కచేరి కంపుము. నేనా సంగతులేమో విచారించి కొందును."

నారాయణ శాస్త్రి యింటికి వచ్చెను. వాని కెందుకో అన్నము దిగలేదు. నాలుగు మెతుకులు తిని లేచినాడు.

"ఏమి మఱది! అన్నము కాబట్టలేదా! ఇంటికి పెండ్లాము వచ్చునని సంబరమా యేమి?" వదిన పార్వతి తమాష చేసినది.

"పెండ్లాము వచ్చునను సంతోషముతో నెవరైన నన్నముతగ్గింతురా యేమి? ఇంకను నాలుగింతలై తీరును."

"మరి తెల్లవారి గూడ నేమియు తినవైతివి. ఇప్పుడు గూడ సరిగా భుజింప లేదు కారణము!"

"వదినా॥ మళయాళ బ్రహ్మ పిశాచి చెప్పిన సంగతినీకు తెలుపనే లేదు. ఆవిషయమును తెలుపుటకు సర్వాధి కారి యింటికి వెళ్ళి యుంటిని. ఆబ్రహ్మ పిశాచి భవిష్యత్తును విన్నప్పటినుండి—ఏమో అన్నము సహింపలేదు."

మళయాళ పిశాచి చెప్పిన వృత్తాంతము నాతను వదినకు వివరముగ వినిపించెను. సర్వాధి కారి యాడిన మాటలు గూడ చెప్పినాడు.

"వదినా! సర్వాధికారి యెంతసర్ది చెప్పినప్పటికిని – నాకేమో వారిమాటపై నమ్మకము లేదు. ఇదంతయు పూజారి సాంబయ్య చేసిన నాటకమని తోచుటలేదు. ఎంత యోచించి నను రానున్న మహా విపత్తునకిది యేదో – సూచనగనే కన్పడు చున్నది. ఏమి రానున్నదో – ఆ చంద్రమౌళీశ్వరునకే తెలియ వలెను."

అతడు నిట్టూర్చెను. అన్నము తిని పడుకొన్న శ్రీకంఠ శాస్త్రిగూడ లేచి వచ్చినాడు. నారాయణశాస్త్రి నడచిన వృత్తాంతమంతయు నన్నకు మరియొకసారి విన్నవించినాడు.

"అన్నా! మీకేమి తోచుచున్నది? నాకేమో శృంగేరికి చెడుకాలము దాపురించ బోవుచున్నట్లు గనుపించును. పది వేల మందికి – అన్న సంతర్పణము జరుగ వలెనని పూజారి సాంబయ్య యెత్తు వేయవలసిన యావశ్యకత యేమి? ఎంత యోచించినను నాకిది వానిమోసముగ గన్పడుటలేదు. వాని మాటలలో నేదోసత్యాంశ మున్నదనినా నిశ్చయము."

"నాకుగూడ నట్లే యనిపించు చున్నది. స్వభావముగ పూజారి కంత ధైర్యములేదు. కల్పించి చెప్పునంతటి బుద్ధిగూడ లేదు. ఈమాటలు పిశాచియే యని యుండవలెను. నూరారు జనులముందు – ఇంతటి యబద్ధమును సాంబయ్య చెప్పలేడు."

క్షణకాలము మౌనముగ గడపిరి.

శ్రీకంఠ శాస్త్రియును.

"నాకిది యంతియును జూచినచో – ఇంతకు ముందు

జరిగిన యొక్క కథ జ్ఞాపకము వచ్చుచున్నది. అప్పుడుగూడ — జనులు బ్రహ్మపిశాచి మాటల నుపేక్ష చేసిరి. తరువాత పశ్చాత్తాప పడిరి. మన తాతగారు యీకథ చెప్పుచుండిరి.



"ఆ విషయ మేమి?"

శ్రీకంఠశాస్త్రి యేదో గతించిన స్వప్నమును—జ్ఞాపక మొనర్చుకొను చున్నట్లు—క్షణకాలము మౌనముగ గడిపెను.

అత డిట్లారంభించెను.

౫

సుమారు నూరు సంవత్సరముల క్రిందటిమాట. అప్పు 'డిక్కేరిని' వీరభద్ర నాయకుడు పరిపాలించు చుండెను. అప్పటికే శృంగేరి పీఠముపై సచ్చిదానంద భారతీస్వాముల వారధి వసించి వైరాగ్య సామ్రాజ్యమును బాలించు చుండిరి. నేటి వలెనే నాడుగూడ బ్రహ్మపిశాచి పూజను సాంబయ్య ఇంటి వారే చేయు చుండిరి. అప్పుడు సాంబయ్య పెద్దతాత యుండె నట! అతడు నిండు వయసులో నుండెను. అప్పుడు బ్రహ్మ పిశాచిని పూజించు చున్నప్పుడు—ఆపిశాచి యొడలి పైకివచ్చి యెట్టిదో యొక భయంకర భవిష్యత్తును చెప్పినది. ఆమాట లను సచ్చిదానంద భారతులుగూడ నుపేక్షించిరి. సర్వాధి కారియు నుపేక్షించెను. కాని ఆ బ్రహ్మపిశాచి చెప్పిన మాట లేమాత్ర మబద్ధము కాలేదు. 'కళసమ'ను బ్రదేశమును పాలించు భైరవ నాయకుడు వీరభద్ర నాయకుని సమకా

లికుడు; గొప్ప బలపరాక్రమము గలవాడు. అతడు ఇక్కేరికి చెందిన 'కెళదిప్పై' దండెత్తి సుమారు ఇరువదిమైళ్ల ప్రదేశమును తనవశ మొనర్చుకొని సంపద్భరితమైన శృంగేరి జహగీరుపై దాడిబెట్టెను; సచ్చిదానంద స్వామియు నీవార్తను విని భయపడెను. శృంగేరి జోలికి వచ్చినచో నీకు క్షేమము జరుగదని భారతీస్వామి భైరవ నాయకునికి చెప్పి పంపెను వాడా మాటలను గౌరవించు స్థితిలోలేడు. దూతలను పంపిన "నేరమునకు — భారతీ స్వాముల నింకను కూరముగా నవమాన పరతునని వాడన్నాడు, సకల రాజమర్యాదలతో తన్నుజూచి శృంగేరి ఖజానా బీగపుచెవుల నొప్పించి" తన్నభిమానముతో జూడవలె"నని ప్రార్థించి — తనకు రాజాశీర్వాదము నొనర్పవలెననివాడు. బదులు చెప్పి పంపినాడు. చాలదినముల నుండి 'కెళది' రాజుల నభిమాన పాత్రులుగచూచుచు. వచ్చిన స్వామిమనస్సున కీమాటలతో వేదనయైనది. వారి కీమాటలు బాకుపోటు లయ్యెను. నీచుడా! నీకుపోగాలము వచ్చినది. లేకున్నచోనిట్లాడెడువాడవుగాదు."అనిస్వామిగర్జించెను. ఆమాటలే భైరవ నాయకునికి జెప్పిపంపిరి. "నీవుసర్వనాశమును తప్పించుకొనవలెనన్నచో—గర్వమును వదలిపెట్టి కెళది రాజులను శరణు వేడుమని స్వామి వానికొసగినయాజ్ఞ. భైరవనాయకు డీయాజ్ఞనులక్ష్యపెట్టుస్థితిలోలేడు. శృంగేరిపై దాడిపెట్టవలసినదని వాడు; తనసైన్యములనాజ్ఞాపించెను. వారి నెవ్వరడ్డగింపలేదు. ఊరిబయట భైరవుని సైన్యము నిలచినది. స్వాములు

వచ్చి తన్ను శరణు గోరకున్నచో శృంగేరిని సర్వనాశ మొన ర్తునని వాడు దూతలతో చెప్పిపుచ్చెను. స్వామికి తనదగ్గరికి వ చ్చుధైర్యముండదని వాడెంచెను, వాడు మద్యపానమున నిమ గ్నుడై యుండెను. అప్పుడు స్వామి యొక్కరే వచ్చి వానితో గలసికొన్నారు. వారియొకచేతదండము మరియొకచేతకమండల మునునుండెను. వేఱు ఆయుధమేదియును లేదు. ఇకతక్కినవస్తు వులు జపమాల, కావిగుడ్డలు. అవిరక్షణమునకు బనికిరావు. ది నమును వెంటనుండు—పరిమితమైన అంగరక్షకులుగూడ—నాడు వారితో లేరు, కత్తిఝుళిపించి తమ్మాక్రమించుటకు వచ్చిన శ త్రువుల శిబిరమునకు—స్వామి వారొక్కరే వచ్చియుండిరి. వా రికున్న బలమంతయు నాత్మశక్తియే.

స్వాముల వారిట్లు వత్తురని భైరవనాయకుడు కలలో నైననూహింపలేదు. వానికిగంభీరమైన స్వామిముఖమును— శాంతమైనకన్నులనుచూచి భయమయ్యెను. తానుదండెత్తి వ చ్చినానను సంగతి మరచిపోయి వారిపాదములపై పడుదమను కొన్నాడు. కానిస్వాభిమాన మడ్డువచ్చినది. వాడిట్లనెను. "స్వాముల వారు చాల కష్టములకోర్చి—యింతదూరము వ చ్చినారు. మాహృదయమున నీమాత్రమైనను చోటు దొరికి నందులకు చాలసంతోషము ఇప్పటికైనను—మాసైన్య బల మెంతటిదో మీతలపునకు వచ్చినది. ఆ కెళది, నాయకులను నిష్టతో మీరు కొలిచి నందుల కేమి ప్రయోజనము కల్గినది? మీకు సహాయ మొనర్చుకొనుటకే వీరభద్రనాయకునకు

ధైర్యమున్నదా? ఇట్టివారిని మీరు ప్రభువులని నమ్మికొని యున్నారు. ఇంతవరకు నడచినది. ఇప్పటికైనను మమ్ము ప్రభువులుగా నెంచి కొనుడు. మీ యపరాధములను — అవును — అపరాధములను మన్నించి—యేలుకొందుము.”

“నీచా! నిన్ను క్షమింపుమని వేడుకొనుటకు మేము రాలేదు. హెచ్చరించి పోవుటకు వచ్చినాము. నీవు పాప మార్గమున చాలదూరము నడచితివి. ఇకనైనను మేలుకొమ్ము. నీయాత్మ కల్యాణమునకే మేమింత దూరము నడచి వచ్చితిమి. ఈ దుష్టములైన కోరికలను వదలిపెట్టుము. శృంగేరి జోలికి రాకుము. వచ్చితివా సర్వనాశము తప్పదు.”

భైరవనాయకునికి నవ్వు—కొట్టవచ్చినట్లుండెను. వాఁడనెను.

“మీ బెదరింపులకు మేము భయపడు వారము కాము. అట్లైనచో నింతదూరము వచ్చియే యుండము.”

“బెదరింపుకాదు. నీవే చూతువు. శృంగేరిపైకి దాడి వెడలినచో నీవును, నీ సైన్యములును ప్రాణములతో తిరిగి పోలేవు.”

వాఁడు మరల నవ్వి “మా ప్రాణములెట్లైనను మానె, ముందు మీ ప్రాణముల సంగతి యోచించుకొనుడు. మీరిప్పుడు మా ఖైదీయనుట మరచిపోరాదు. మాకిష్టమైనచో మిమ్మిప్పుడే చెఱనుంచుదుము.”

స్వామి నవ్వెను. నీకంత ధైర్యమున్నచో నన్ను ముట్టు

కొనుము. నేనునీకు భయపడియే యున్నచో ఈ సమయమున నొంటిగా నిక్కడికి వచ్చియుండను. నన్నుకైదీచేయు ధైర్యమున్నచో చేయుము",

భారతస్వామి — నఖశిఖ పర్యంత మొక్కసారి కంపించెను.

ఈ మాటలతో భైరవ నాయకునికి భయమైనది. వాడు స్వామివైపే చూచుచు విగ్రహము వలె నైపోయెను. తాము వచ్చిన పని యైపోయినదనుకొని స్వామి వెనుదిరిగిరి. వారు వెనుదిరిగి నప్పుడు—చెర బెట్టుటటుండగా —వారివైపు చూచుటకుగూడ భైరవ నాయకునికి ధైర్య మాగలేదు. నిలువుడని చెప్పుటకును నోరాడినది గాదు. ఆదిన మేమేమోవానికిభయంకర స్వప్నములు వచ్చెను.; భద్రకాళివచ్చి వాని యెదుటనిలిచి నట్లయ్యెను.భూతగణములు తమసైన్యముల పైబడి పీకుకొని తినుచున్న ట్లగుపడెను. వాడు భయపడి గట్టిగా నరచినాడు; నేలపైఁబడెను. పడిలేచు వేళకే దేహమున జ్వరము క్రమ్ముకొని వచ్చినది. వాడిక నచట నిలువలేకపోయి నాడు. వెనుకకు పోవలసినదని తన సైన్యమున కానవెట్టెను. ఇట్లు వచ్చిన యాయాపద తాత్కాలికముగా పరిహృతమైనది. ఇదంతయు భారతీస్వాముల మాహాత్మ్యమని జనులాడి కొన్నారు.

భైరవ నాయకు డంతటితో నూరకుండలేదు. మరు సంవత్సరము వాడు మరల నెత్తి వచ్చెను. ఈసారి వానివెంట

గొప్పసైన్య ముండినది. వాడీసారి శ్రీమఠమునుగూడ దోచి యందున్న బంగారు వెండి పాత్రిల నపహరించి నాడు, తన్నె దిరించిన వారిని క్రూరముగ హింసించెను. దేవుని సొమ్ము నువాఁడు హరించెను. కొందరిని చెఱసాల యందుంచెను ఊరి పైఁబడి జనులను దోచుకొనెను; కాదన్న వారిని నరకెను; స్త్రీల మానభంగములకు లెక్క లేదు; శృంగేరిలో పిశాచ ములు — సశరీరముగఁ దిరుగుచున్న ట్లుండెను. ఈ దృశ్యములు భారతస్వాములు చూడక పోయిరి. వారు 'కెళది' వీరభద్రి నాయకునకుఁ దెలిపినారు. వారాతని సాయమును వేడిరి. వీర భద్రి నాయకుఁడు మనస్వి. భారతీ స్వాములకు వచ్చిన యాప దకు వాడెంతయో దుఃఖించెను. ఆ యవమానమును తనదిగా నెంచికొన్నాఁడు.

ధర్మహీనుడైన భైరవ నాయకుని శిక్షించుటకై యా తడు సైన్యముతో బయలు దేరెను. వానిపట్టణమైన "కళసము" పై నాతడు పడెను. వాని నెదిరించుటకు భైరవనాయకునికి సాధ్య ము కాలేదు యుద్ధమునవా డోడెను. శరణు జొచ్చినాడు. వీర భద్రి నాయకుడు వానిని నుదారముగా క్షమించెను. వాడు దోచి కొన్న పదార్థములను మాత్రిము వెనుక కిప్పించు కొన్నా డు. ఈవిపత్పరంపరల కన్నిటికి కారణము మేము బ్రిహ్మపిశా చిమాట లుపేక్షించుట యేయని స్వాములు గుర్తించిరి. వారు భైరవనాయకుని క్షమించిరి.

ఈరాక్షసి చెప్పిన మాటలను ఈనాడు గూడ మన ము

పేక్షించినచో నేదో యొకకీడు రావచ్చును. దీనిని మనము స్వాముల వారి చెవులో వేయుట మంచిది, శ్రీకంఠుడు తన సంభాషణమును ముగించి నాఁడు.

'నేను గూడ నట్లేయను కొనుచున్నాను. ఈవిషయము న సర్వాధి కారులకు నమ్మకము లేదు. కాని వారి యుపేక్ష యితరుల శాంతికి భంగ కరమైనచో దాని నుపేక్షింపరాదు ఈవిషయమున నుదాసీనముగా నున్నచో నిరపరాధులైన ప్రజలు కష్టపడుదురు. కనుక స్వాముల కీవార్త తెలిపి వారి యభిప్రాయము ననుసరించుట మంచిది!" నారాయణశాస్త్రి యభిప్రాయము-శ్రీకంఠుని మాటలకు పకుృతి వలె నున్నది.

అన్నతమ్ము లిద్దరును—ఈవిషయమై సర్వాధి కారితో మరి యొకసారి మాటాడుట మంచిదను కొన్నారు. వారిర్వురును మధ్యాహ్నము కచ్చేరికి వచ్చిరి. వారి రాకనే యెదురు చూచు చున్న సర్వాధికారి నరసింహశాస్త్రి వారితో నిట్లనెను.

"నేను మీకొరకే కాచుకొన్నాను. మీరు తెల్పిన వార్త యబద్ధమని తేలిపోయినది. కాని ఆ భవిష్య ద్వాణిని విన్నవారెందరో మీవలెనే నాదగ్గరకువచ్చి యడిగి పోయిరి. ఈ సమాచారము సరిగా తెలిసి కొనుటకు నేను పూజారి సాంబయ్యకు చెప్పి పంపినాను, వాడింతలో రావచ్చును."

ఈ మాట లనుచుండగనే — యొక సేవకుడు వచ్చెను.

'నమస్కారము. పూజారి సాంబయ్య వచ్చినాడు"

"వాని నిక్కడ పిలుచుకొనిరా" నరసింహశాస్త్రి గర్జించెను.

పూజారి సాంబయ్య యెదుట నిలచినాడు. సర్వాధికారి తన్ను పిలుచుచున్నా డన్నంతనే వాని కెక్కడలేని భయమైన దను విషయమును – నిటలము పై గ్రమ్ముకొన్న చెమట బిందువులే చెప్పుచుండెను. ముఖమంతయు నెఱ్ఱగానైనది. వాడు పరుగెత్తికొని వచ్చినాడు. రొట్టలావు బుస వచ్చినది. అదింకను తగ్గలేదు. దగబోసికొనుచుండెను. తన్ను సర్వాధికారి ఎందుకు బిలిపించెనో తెలియనే తెలియదు. మళయాళ బ్రహ్మపిశాచి చెప్పిన భవిష్యత్తు విషయమై వారు ప్రశ్నింతురా?. తానేమి బదులు చెప్పవలెను? తనమాటలు సర్వాధికారి నమ్మునా? నమ్మకపోయినచో? తన్ను శిక్షింతురు.; ఇంతకుముందే సర్వాధికారికి తనపై ద్వేషమున్నది. ఈనాడు తనకూటిలో రాయిపడుట తప్పదనివాడు భయపడు చుండెను. తానుచెప్పిన మాటలు తనవి కావనియు, బ్రహ్మపిశాచి వనియు, సర్వాధికారి నమ్మునట్లు చేయుట యెట్లు? ఇదేవాని యాలోచన. వాడు తలగోకికొనుచు నిలబడినాడు.

నరసింహశాస్త్రి వానివైపు తీక్ష్ణముగా చూచెను. ఆ చూపునకు వాడు నఖశిఖ పర్యంత మదిరి పడినాడు. నరసింహశాస్త్రిదృష్టి వాని హృదయమును భేదించునంత పదునుగానున్నది. వాడాచూపునకు తట్టుకొనలేక పోయెను.

"సాంబయ్యా నిన్న నీయొడలి పైకి వచ్చిన మళయాళ

బ్రహ్మరాక్షసి యేమో పలికినదట! నిజమేనా?." సర్వాధికారి ప్రశ్న-ప్రశ్న కంఠెను గద్దింపు వలె నున్నది.

"స్వామీ! అది నిజమని జనులను చున్నారు" ఆయుత్తరమును విన్న శాస్త్రి చకితుడాయెను

"ఏమి పిశాచి వచ్చినది నీయొంటిపైకే గదా! అది చెప్పిన మాటలు నీకే తెలియ లేదా?",

"స్వామీ! నేనసత్యమాడుట లేదు. ఆదినము నేను-ప్రతి దినము చేయునట్లే పూజచేసి కొంటిని. నాకేదో యావేశము వచ్చినట్లయ్యెను, ఆతర్వాత నేమయినదో నాకు తెలియదు తెలివివచ్చు వేళకు నేలపై పడుకొని యున్నాను. కొందరు మనుష్యులు నాపై చల్లని నీరు పోయుచుండిరి. నాపైకి బ్రహ్మపిశాచి వచ్చినదట! అదియన్న మాటలు తర్వాత వారిని అడిగి తెలుసుకొన్నాను, ఆవిషయమును తెలిసికొన్నది-మొదలు నేను గూడ నితరుల వలెనే భయపడు చున్నాను".

"అయినచో నీవేమంటివో నీకు తెలియదన్న మాట"

"లేదు. తర్వాత తెలిసినది"

"పోనిమ్ము. భూతము నీనోటి నుండి యేమేమి పలికించినది. అదియైన చెప్పుము".

ఈ ప్రశ్నలో రాజకీయ మున్నది. ఈవక్రభాషణములు-ఛలోక్తులు, పూజారి సాంబయ్యకుఁ దెలియవు. వాఁడవి నేర్వ లేదు. వాడు తరతరాలుగా వచ్చిన, పూజ నేర్చెను. జీవించుటకు నేర్చెను. వానికి జీవనమున కాధారము పూజ. వానికిఁ

దెలిసినదంతే. వాడితరులనుండి విన్న మాటలన్నియు. సర్వాధికారులకు వల్లించి వేసెను.

"అట్లైనచో నీవు పలికిన మాటలు నిజమేనా".

"కావచ్చును. కాకపోవచ్చును".

వాడు నవ్వెను. వానియజ్ఞానములో మెరపువలె మెఱసిన యొక ప్రతిభా రేఖయది.

దానిప్రభ యచిరద్యుతి వలెనే యుండెను. ఆవెల్గునకు, సర్వాధికారియు — చకితుఁడుగాక తప్పలేదు.

"అయినచో నామాటలన్న దెవరు?"

"బ్రహ్మపిశాచి"

"అందులకు ప్రమాణము?"

"తమరిట్లడిగినచో నేనేమి చెప్పవలెను? తరతరాల విశ్వాసమే ప్రమాణము"

"ఇదిగో ఖండి తముగా చెప్పుచున్నాను. ఇదంతయు నీస్వార్థమును. సాధించుటకు కట్టిన వేషము. జనులను నీవైపీడ్చు కొనుటకు వేసినయెత్తు. వారు భయపడినచో, నీదేవునకు పూజా పునస్కారము లెక్కువగా జరుగును. నీకు చిల్లర కాసులెక్కువ గావచ్చును. అంతేనా?;

ఈమాటలు వానికి—దుర్గాకశాఘూతము వలెదగిలినవి. వాని, కాలీనిత నంతయు, నీవాకులు కెదికించి వేసెను. సాంబయ్యకు పట్టరాని కోపము వచ్చినది. కాని యాకోప మేమి చేయును? వాని మాటలోని నేడి వానిహృదయము నేగాల్చు

చున్నట్లుండెను. డిటనినాడు.

"స్వామీ! నేను పూజకు గూర్చుంటిని. నాతల తిరిగి నట్లైనది. వేడిరక్తము తలలోకెగ బ్రాకినది. ఆపై నేమైనదో నాకుఁ దెలియదు. తెలివి వచ్చు వేళకు—నేలపైఁబడియుంటిని. నాచుట్టును జనులుండిరి. ఈమాట లసత్యమైనచో నారాయణ శాస్త్రి గారి నడుగ వచ్చును. నామాటలసత్యమైనచో నా నాల్కను చీల్చివేసి కొందును.

వాని ప్రతిజ్ఞలో నాత్మ విశ్వాస ముండెను, ఆవిశ్వాస ము—రాక్షసులు—తపస్సు చేయునప్పటి వంటిది.

"అంతయు—నీకల్పనమని మాయూహ—నీవేమందువు?;

"కాదు, కాదనునుటకు మరియొక కారణమును గూడ చెప్పుదును. మూడు దినముల నుండి నాకొక కల వచ్చుచున్న ది. కలలో నెవరో వచ్చి "నేను వచ్చెదను" "నేను వచ్చెద" నని ముమ్మారు పలికి పోవుచుండిరి. రెవరో నాకు దెలియలేదు రమ్మంటిని. నాయెదుట నొకనల్లని యాకారము నిలచెను. ఆధ్వనిలోని క్రౌర్యము, ఆముఖములోని వికారము—రెండు దంష్ట్రలు—నేనా దృశ్యమును చూచి చావక బ్రతికినది గొప్ప విషయము. అది నాయెదుట నూరక నిలువబడి యుండెను. చావుధైర్యమును తెచ్చుకొని నీకేమి కావలయునని ప్రశ్నించితిని.

"చాల ఆకలిగా నున్నది. కడుపునిండ నన్నము గావలె నని యది పలికినది.

"నేను బీదవాడను. ఇంటిలోని తిండిగింజలు తెచ్చి పెట్టుచు "నన్నాను

"నీకిష్టమైనచో నేను రేపు నీమూలమున నాకు కావలసిన యాహారము సంపాదించుకొందు" నని దయ్యమనెను.

"వాని కుత్తర మిచ్చునంతలో నాకు మెలకువ వచ్చెను నా యీ స్వప్నమునపుడు వీధి వారందరకు చెప్పినాను. నేటి మధ్యాహ్నము నాయొడలి పైకి వచ్చెను. ఆమాటలే చెప్పి పోయినది.

దీనిని వినుచున్న నరసింహశాస్త్రి నవ్వెను. ఆనవ్వులో నవహేళన ముండెను. అనఁగా నెదుటివారి మాటలోని రహస్యమును — పసిపట్టినాను లెమ్మను భావమన్న మాట.

"సాంబయ్యా! కట్టు కథలేమో బాగనల్లినావు. అందుకే —పూరివారి నందరిని భ్రమింపఁ చేసితివి. కాని — నాయెదుట నీమాటలు సాగవు ఇదంతయు నీకల్పనయని నాకు — స్పష్టముగా దెలియును. పిచ్చివాఁడా! నీవు పగటి కలలు కనుచున్నావు. లేకనీవు చెప్పుమాటలు — మనస్ఫూర్తిగా ననుచున్నచో — నీకు బుద్ధియైనను - చెడియుండవలెను, పిత్తోద్రేకమునకు మందు దీసికొనుము. సాంబయ్యా! ఇన్నిమాటలెందుకు? సత్యమును చెప్పుము. ఇంకొక నాలుగు తవ్వలుగింజలెక్కువ — యిప్పింతును. ఈ మాటలతో నన్ను నీవు వంచింపలేవు".

"దీనికి నేనేమియు బదులు చెప్పలేను. మిమ్ము మోస

గింప వలసిన యక్కర నాకులేదు”

“లేకేమి? కావలసినంత యున్నది. నీకింటిలో నీనడుమ ఖర్చెక్కువైనది. తిండిగింజలు చాలుటలేదు. నీకొకపూట అన్నము గడచినను లాభమే. అవునా! కాదా!”.

సాంబయ్యకేమి చెప్పుటకును తోచలేదు సర్వాధికారి యాడెడు ప్రతిమాటయు వానితలపై సుత్తిపోటు పొడుచు చున్నది వాడుధ్వనిని – బొడ్డునుండి – కూడ దీసికొనెను,

వాడిట్లనెను” శృంగేరి వంటి పుణ్యక్షేత్రమున – నెవ్వడును అబద్ధమాడఁడు. నామాట – అసత్యమైనచో – చంద్రమౌళీశ్వరునిపై – యొట్టు.

“మఱి యిది పుష్యమాసము; పండుగలు, పబ్బములు లేవు. ఇట్టి సమయమున నీవన్నట్లు పదివేలమంది బ్రాహ్మణులకు – అన్నవస్త్ర దానము లొనర్చుటకు – అవసరమేమి యుండును?”

“దీనిని మీరు నమ్మినను నమ్మకున్నను నాకొకటే. దైవవాక్యమును నమ్ముటయో వదలుటయో మీవంతు. జరిగిన కథ చెప్పినాను”

“నీవు జనుల మనస్సులలో నింతటి భయోత్పాతము – సందేహము. మొదలగు వాటిని కలిగించి – యేమియు నెరుగని వానివలె తప్పించుకొనుటకు వీలులేదు. నీయపరాధము సామాన్యమైనది కాదు. నీస్వార్థమునకై దేవునిపేరు వాడుకొన్నావు. దీనికి శిక్ష తక్కువగా నుండదు.”

"నేను నిరపరాధిని, నాకేమియు తెలియదు"

"అయినచో స్త్రీ వేషమంతయు నెందుకు కట్టితివి'

"వేషము నేను కట్టినది కాదు"

"మరి యీమాట లన్న దెవరు"

"బ్రహ్మపిశాచి"

నీవే బ్రతికిన బ్రహ్మపిశాచివి ఇక చాలు. ఇంటికిపొమ్ము ఇకపై నిటువంటి యాటలాడినచో నీయుద్యోగమును దొలగింతుము జాగ్రత్త"

పూజారి సాంబయ్య బదులు పలుకలేదు. వాని కనుల నిండ చీకటి; మహానిష్ఠతో నొకడనుష్ఠాన మొనర్చి నపుడు-దైవము మోసగించి నపుడు - సాధకుని కన్నులలో గన్పించు చీకటివంటి చీకటి. సాంబయ్య, వెనుదిరిగి చూడలేదు; తోచిన దారిఁ బట్టిపోయినట్లు పోయెను. శ్రీకంఠ నారాయణ శాస్త్రి లోకరి మొగమొకరు చూచుకొనిరి.

నారాయణశాస్త్రి కొక్క విషయము స్పష్టమయినది పూజారి సాంబయ్యలో మోసము లేదు. అతడు తన పొట్టకై యట్టి వేషమును కట్టలేదు. పిశాచి భవిష్యద్వాణి వానిమూలమున స్పష్టమయ్యెను. అది కోరినట్లు చెయ్యకున్నచో శృంగేరి నివాసుల కెంతో విపత్తు కాచుకొని యున్నదని మాటి మాటికి నారాయణశాస్త్రి యంతరాత్మ చెప్పచుండినది. ఆ విపత్తు

యెట్టిది? ఎట్లువచ్చును? ఎవరినుండివచ్చును? ఎప్పుడు వచ్చును? ఈ ప్రశ్నల కాతనిలో సమాధానము లేదు కాని బ్రహ్మపిశాచిమాటలను తిరస్కరించినచో నాపద తప్పదను మాట వాస్తవము. ఆవ్యక్తికి భీతి కలిగెను. ఆభీతి వాని హృదయాంతరాళమును కలవర పరచినది. అన్నాహారములపై గూడ సరిగా మనసు పోలేదు. తాను పూజారి సాంబయ్యకు మాట యిచ్చి నందువల్ల నిట్లగుచున్నదా ఏమి?, ఇది వాని హేతువాదము. దీని కతీతముగ — నేదో యొకపార "కాద"ను చుండెను; మానవుని హేతువాదము—కఠోరమైనది. విశ్వాసమునది కాలదన్నును; కాని — మానవున కదియావశ్యకమును; మరి — సాంబయ్యకు — మాటనివ్వ కున్నచో నెట్లు? శృంగేరి కషాయము మూడునపుడు — దానిని తొలగింప వలసిన బాధ్యత తనకు లేదా? ఊరకున్నచో—తాను కర్తవ్యమును మఱచినట్లుగాదా? కర్తవ్యమును నిర్వహింపఁ బూని, తానుచేసిన దేమున్నది.? తనమాటలు — సర్వాధికారి — హాస్యమునకు విషయములయ్యెను. పూజారి సాంబయ్య సత్యము — సర్వాధికారి హేతువాదము నెదుట దూది పింజవలె నెగిరిపోయినది. ఓహో! మానవ స్వభావ మెంత సంశయాళువు! ఎదుటివారు—ప్రేగులు విప్పి చూపినను గారడి యందురు. శుద్ధ సత్యమునే వాఁడెక్కువ ప్రేమించును. నారాయణశాస్త్రి మనస్సేదో చీకటి గుహలో దూరి—వెలుగునకై వెదకు చున్నట్లుండెను. వాని మనస్సు నాటి దేశస్థితి వలెనే యుండెను. నాఁడు దేశమున

కేదేదోయ శాంతి మనస్సులలో—కలవర పాటు. ఇంగ్లీషు వారు టిప్పుసుల్తానునకు శత్రువులు; వారెప్పుడు తమపై బడుదురో యనుభయము. చాలని దానికి-యొకవైపు-కత్తి ఝుళిపించు చున్న మహారాష్ట్రులు. వారికండగా నిలచిన—హైదరాబాదు నవాబు. వీరేనిమేషమందైనను దమపై బడ వచ్చు నన్నభీతి కానీ-యాయింతలో నే మోహము; రానున్న సంవత్సరమున కెత్తి పెట్టు కొన్న-విత్తనాల గింజలు-పెండ్లామునకుక్రొత్తగా చేయించిన బంగారు కంటె యౌవన మెదురుపొంగుల వొవ్వు చు—అత్త గారింటికి బోవుచున్న కొమార్తె పైమరులు—ఆహా! మానవుని హృదయ పుస్తకములోని రసముల నేయాలంకారి కుడు వింగడింప గలడు. చాలని దానికి నిమునమున కొక సారి విచిత్రవార్తలు వచ్చుచుండెను. ఇదిగో! ఇంగ్లీషువారు దండెత్తి వచ్చుచున్నారని యొకవార్త. రాలేదని ప్రతివాదము; సగము దూరము వచ్చి – మరలి పోయిరని సవరింపు; దేశములోని వారికి – దిన మొక నూరేండ్లుగ నుండెను".

టిప్పుసుల్తానుపై పగ దీర్చుకొనవలెనను దృఢ శంక సంకల్పము గల యింగ్లీషు వారు మహారాష్ట్రులు దేశముపై బడి నానాయాతనల పాలొనర్చు చుండిరి. దొరికిన వారిని నిష్కారణముగ నరకుచుండిరి, ఆనరుకుటలోఇంగ్లీషువారికంటె మహారాష్ట్రులు నాలు గాకు లెక్కువ చదివిన వారు. పల్లెలు పల్లెలే స్మశానము లగు చుండెను. నగరములు—సైనికుల గుడారములుగ మారుచుండెను, రైతుల యిండ్లపై బడి—

సైనికులు దోచుచుండిరి. ఇంటి ఖామందు కండ్లయెదుటనే — యింటిలో నిస్త్రీల మాన భంగములు సాగుచుండెను. ఆ రైతు యెదుటనే వాని పశువుల వధించు చుండిరి: ఆచనిపోవు—నీపుత్రి నిర్వి శేషములగు పశువుల నీరునిండిన కన్నులను చూచి రైతు కుప్ప గూలెడివాడు; దేశమున కఱవు, కాటకములు, విజృంభించినవి. చాలనిదానికి టిప్పుసుల్తా నప్పుడప్పుడు దేశముపై బడి దోచికొను చుండెను; ఇంగ్లీషు వారితో వాడు చేసికొన్న సంధి ననుసరించి వారికి కొంత ఋణపడినాడు. యుద్ధమునకు వెచ్చ మెక్కువై నది. ఈ రెంటిని సరిదిద్దుకొనుటకు—వానికి తోచినమార్గ మొక్కటే దోపిడి, వానికీ విషయమున ధనిక దరిద్ర భేదము లేదు. కావలసినది కార్యసాధనము. ఆనాడు పదియూళ్ళ కొక పాళెగాడు. టిప్పుసుల్తాను — ఆసరాచూచి కొనివాడొక్కొక్క సారి ప్రజలపై విజృంభించును. కంటఁ బడినది దోచుకొనును. ఈ బాధలతో కొంత తెప్పరిల్లుకొను వేళకు—మహారాష్ట్రిలో నిజామా — యెవడో యొకడు నెత్తిన పడును. అందులోను 'శృంగేరి' మైసూరు రాజ్యపు జిల్లలో నున్నది. దానిపైకి శత్రువులు దూకుటంత పెద్ద కష్టముగాదు. పూజారి సాంబయ్య మాటలు - శత్రువుల రాకను సూచించుచున్నవా? యేమి? ఈ యాలోచన నారాయణశాస్త్రి మనస్సులోఁ దిరిగిపోయెను. హైదరాలీ కాలము నుండియు — మహారాష్ట్రిలకు — ఆంగ్లేయులకు - మైసూరు రాజ్యము నెట్లైనను గబళించ వలెనను నాశయున్నది. దక్షిణ దేశమున నాకాలమున నదియే — పెద్ద

రాజ్యము; ఇటునైపు దాని ప్రాబల్యము నణచినచో - యిక సేతువు వరకును దమకడ్డుండదు; వారిర్వురును - మైసూరు రాజుల యధికారము తగ్గించుటకు - శతవిధముల బ్రయత్నించుచుండిరి. హైదరాలీ కాలమున నది సాధ్యపడలేదు. అతఁడు గొప్ప రాజకీయ దురంధరుఁడు ఆ వ్యవహార దక్షత - యసామాన్యము - శత్రువులలో యుద్ధమున కంటెను-కూటనీతియే యుక్తమని వాఁడెంచెను. అతని యెత్తులకు - వైరులాగ లేకుండిరి. వారితో తగవుల నాతఁడు - వెన్నలో వెంట్రుకను దీసినట్లు - చాతుర్యముతో బరిష్కరించు కొనుచుండెను; యుద్ధమని వార్యమై నపుడు - ఆంగ్లేయులు - మహారాష్ట్రులు-వీరిర్వురి నడుమ - హైదరాలీ భేదోపాయము నుపయోగించెడి. వాఁడు. వానియెదుట శాత్రవులు-దిగ్భ్రాంతులు గావలసివదే అతని రహస్య గోపన మద్భుతమైనది. వాని మనస్సులోనే యొక పొరలోని మాట మరియొక పొరకు దెలియదు. మైసూరు హిందూ రాజ్యమనియు - దానిపై దండెత్తుట హిందువులైన మహారాష్ట్రులకు న్యాయము గాదనియు - వాఁడు వారితో ననెను. తాను మహమ్మదీయుఁడైనను - హిందువువలెనే యున్నాననియు - తన రాజ్యమున మతభేదములు - కలహములు లేవనియు వారివాదము. ఈ పన్నాగను -ఉత్కటమైన, మతావేశముగల మహారాష్ట్రులపై పనిచేసినది. పైగా వారు ధర్మభీరువులు. అంతమాత్రమేగాదు. హిందూ ధర్మ సంరక్షణము-తమ జవాబ్దారి యనుట *రికొక యహ

మహామిక. హైందవుల నంపరినొకచోట సంఘటిత మొనర్పవలెనను-ఉబలాటము; వేయియేండ్ల చరిత్రము వారికి గుణపాఠము నేర్పలేదు. హైదరాలీకి వారి దౌర్బల్యము తెలియును. పీష్వాలు బ్రాహ్మణులు. వారి స్నేహ సౌహార్దములను సంపాదించుకొనుటకు హైదరాలీ నాటి శృంగేరి పీఠాధీశ్వరులైన సచ్చిదానంద భారతీ స్వాములను వినియోగించుటకు ప్రయత్నించెను. పీష్వాల యాస్థానములలో భారతీస్వామికున్న గౌరవ మెంతయో హైదరాలీకి దెలియును. సచ్చిదానంద భారతుల సహకారముతో మహారాష్ట్రులతో సంఘర్షణ రాకుండు నట్లు హైదరాలీ యత్నించు చున్నాడు. మాటిమాటికి నిస్వామికి పత్రములువ్రాయుచు తమవైపున రాయబారులై పూనావరకును. పదార్పణ మొనర్పవలెనని వాడెన్నిసారులో యాచించి యుండెను. అతడు సచ్చిదానందులకు వ్రాసిన పత్రములు చూచినచో శృంగేరి-శ్రీమఠముపై రాజకీయ కారణములలో నైనను - వానికెంత గౌరవముండెనో- తెలియును.

తాను మరణించుటకు కొద్దిమాసములకు ముందు హాయిదరాలీ స్వామికి వ్రాసిన పత్రమిది.

శృంగేరి స్వామి పాదపద్మములకు,

హాకీకత్ మారిఫత్ మాంజీలక్ నవాబు హాయిదరల్లీ ఖాన్ బహదూర్ చేయుసల్లాములు;

చైత్ర బహాళ అష్టమి వరకు మేము క్షేమంగాఉన్నాము మా సామ్రాజ్య వైభవాతి శయాలు అభివృద్ధి నొందవలెనని

తామప్పుడప్పుడు. ఆశీర్వాదాలు పంపుచుండ వలెను.

ప్రికృతం.

బాలాజీ పంతులుగారు. వెంకట రమణయ్య ద్వారా చెప్పి పంపిన అభిప్రాయం దెలిసికొన్నాము అన్నింటికీ పెద్ద వారు మీరున్నారు. అందరికీ తమదర్శనం చేసుకొనవలెననే అపేక్ష ఉండడము సహజమే. సాహేబు రఘునాథు లుంగారు శృంగేరి స్వాముల వారిని దయచేసి పంపవలెనని మాకుచెప్పి పంపి యున్నందువల్ల తమరు దయచేసి వారికి దర్శనమిచ్చి రావలెనని మాప్రార్థన. తక్కిన వివరాలన్నీ బాలాజీపంతులు వెంకట రమణయ్య గార్లతో మాటాడి పరామర్శ చేయవలెను. తమ ప్రయాణము కోసం ఏనుగు ఒకటి, గుఱ్ఱాలు ఐదు, పాలకి ఒకటి, దేవర వారికి నారకట్టు యొకటి, వైభోగానికి మేళాలు రెండు, ఖర్చుకు పదివేల రూపాయలు. పంపించు కొన్నాను. వానిని పరామర్శించ వలసిందని మాప్రార్థన. దోవతుల జోళ్లు రెండు పంపించినాను. దయచేసి స్వీకరించ వలెను." అని యొక పత్రమునందు వ్రాసియుండిరి. మరియొక పత్రమిట్లుండెను." మఠానికి నడువ వలసిన ఇనాం, తక్కిన ఆదాయాలు సరిగా ముట్టచెప్ప వలయునని జాగ్రత్తచేసినాము చిత్తగింపవల యును ఏలోపము జరిగినా దయచేసి తెల్పవలసి నదని ప్రార్థి స్తున్నాము."

శృంగేరి శ్రీమఠమునకు సంబంధించినంతవరకు రాజ్యాధి కారులు గౌరవప్రపత్తులతో నడచుకొన వలెనని హాయిదరాలీ

ఖిల్లీ దార్లకు, పారు పత్యేదారులకు, తాకీదులు పంపియుండెను. శృంగేరి మఠమునకు చెందవలసిన శ్రీచరణ కానికలు, అగ్రి తాంబూలము, ఆచార వ్యవహారములు మొదలైనవి మొదటి నుండి వచ్చినట్లే నేడుగూడ జరుపవలెనని—హాయిదరాలీ చేసి నకట్టడ;

ఇట్టి యభిమాన గౌరవములనే "పైగంబర్ అని చెప్పు కొన్న టిప్పుసులతాను గూడ శృంగేరి మఠముపై నిల్పికొని యుండెను. ఈ విషయమున కీతఁడు తండ్రినే యనుసరించెను. ఆనాడొక ముఖ్యమైన జాబు టిప్పుసులతాను నుండి శ్రీమఠ మునకువచ్చి యుండెను. దానినే నరసింహశాస్త్రి చేతబట్టుకొని యుండెను. దానిలో టిప్పు తనకు స్వామిపై గలభక్తి గౌరవ ములను వ్యక్తీకరించి యుండెను.

శ్రీమత్పరమ హంస పరివ్రాజకాచార్యులైన శృంగేరి సచ్చిదానంద భారతీస్వాముల దివ్యసన్నిధికి,

టిప్పుసులతాను చేయుసలాములు. ఈ నడుమ శత్రుసై న్యాలు మాసీమలలో ప్రవేశించి ప్రజల మాన ధనములకు నుపద్రవం చేస్తూ వున్న దానివలన వారికి తగిన శిక్షవిధించే ప్రయత్నములో నున్నాము. మీరు పెద్దవారు, తపస్వులు. బహుజన క్షేమమును చింతింపవలసినది, మీకు విహితధర్మమైన దానివల్ల, శత్రువులు పరాజితులై —పలాయనము చిత్త గించే టట్లునూ మీరు, మీమఠములోని బ్రాహ్మణులు ఈశ్వర ప్రార్థనము చేసి అంతరూ సురక్షితముగా నుండు

నట్లు ఆశీర్వాదములు చేయవలెనని సలాములు.

'మైసూరు పులి' యని ప్రఖ్యాతిగాంచిన టిప్పుసులతానే స్వామి కిట్లు జాబు వ్రాసినపుడు ఆనాడు దేశమునకు రానున్న ఆపద యెంతటిదో యూహించుకొన వచ్చును. శత్రువులు తమపై దాడిపెట్టినప్పుడు – దాని నెదురించుటకు తామేకాక దేశమంతయు తయారుగా నుండవలెనని సులతాను భావించెను. ఈ విషయములనుబట్టి చూచినవుడు – బ్రహ్మరాక్షసి చెప్పినమాటలు నారాయణశాస్త్రికి అతి ముఖ్యమైనవిగా తోచెను; ఇంతటి విషయమును – సర్వాధికారికి దెలుపకుండుట – దోషముగ నాతడు భావించెను; వారి తీరికెలు గమనించికొని వచ్చెను. కాని తనమాట లాతని మనస్సుపై పని చేసినట్లులేదు శాస్త్రిమనస్సు – చివుక్కుమన్నది. కాని, యేమి చేయును?

సులతాను కడనుండి వచ్చిన జాబునకు – నరసింహ శాస్త్రి. యుత్తరమువ్రాసి ముగించెను. అతఁడు నారాయణ శాస్త్రివైపు జూచినాడు. శాస్త్రి వయస్సున చిన్నవాడైనను బుద్ధిమంతుఁడని – నరసింహశాస్త్రుల యూహ. సర్వాధికారి యిట్లనెను.

"టిప్పుసులతాను గారికి మనమెంతయో. కృతజ్ఞులముగా నుండవలెను. శత్రువుల దాడి నిరోధించి, వారు మనకుముందే, హెచ్చరిక నంపినారు. కాని. నారాయణా! ఈజనముచూడుము సుల్తాను గారికి, దురభిమానము హెచ్చని కొందరందురు. అతి

గర్వి యని యొక వాదము. హిందువుల జూచిన—సరిపోదనియు—ఆధర్మమును నాశము చేయ వలయునని వారి సంకల్పమనియు మరికొందరి విశ్వాసము. అతడు హిందూ స్త్రీలను—జనానాలో జేర్చు కొన్న సంగతిని వా రుదాహరింతురు. స్త్రీ పురుష సంసర్గము - వారి యైచ్ఛిక విషయము. పైగా వ్యక్తిగత విషయములను—రాష్ట్రి విషయములలో ముడి వెట్టుట న్యాయము కాదు గదా! ఎవరి చాపల్యములు వారికుండును. మన శ్రీమతము పై సులతానుల కెంత గౌరవమున్నది; వారు వ్రాయు—ప్రతిలేఖయు నెంతయో యుదారముగా నుండును, ప్రతి పంక్తి యందును పరమత సహనము—వస్త్రమున దాచిక కస్తూరి వలె పరిమళించుచునే యుండును. అతఁడొక మహాపురుషుడని నాభావము'

సర్వాధికారి — యుత్తరమునకై నారాయణశాస్త్రి మొగమువైపునకుఁ జూచెను. తనమాట కత "డవునన" వలెనని — యాతని యాశ. అధికారములో నున్న యొక విచిత్రరోగమది. కాని నారాయణశాస్త్రి పలుకలేదు. సర్వాధికారి మరల నిట్లందికొనెను.

"మహారాష్ట్రులుఁగాని, ఆంగ్లేయులుగాని—దండెత్తివచ్చినచో మొట్టమొదట మారణ హోమము మనమే యగుదుము మనది గడిదేశము. ఈ యపాయమునుండి తప్పించు కొనుట కేదైన నుపాయము నాలోచింప వలెను."

ఉపాయమేమున్నది? శస్త్రధారణ మవశ్యమగునేమో

యని యనుమానము. స్వదేశమును — స్వధర్మమును-రక్షించి కొనుటకు బ్రాహ్మణుఁడైనను – ఆయుధముబట్ట వలసినదే ఈ విషయమును స్పష్టముగా చాణుక్యుడు చెప్పనే చెప్పెను. విద్యారణ్యులాధర్మమును 'తామొనరించి చూపిరి.' బ్రాహ్మ. క్షత్రియ జాతిని ప్రచారమునకుఁ దెచ్చిరి. తామమాత్య పదవి నంగీకరించిరి: యోగదండమును వదలి—రాజకీయపు బెత్తులో బుద్ధిని జొనిపిరి. మహానుభావులు! వారి వలననే—శృంగేరి మఠము వర్ధిల్లు చున్నది. మనము గూడ—ఆయుధములను ధరించి మనము నిజమైన పురుషులమని చాటుకొన వలెను".

ఈమాటలతో సర్వాధి కారి పగులఁబడి నవ్వినాడు అతని శరీర మంతయు నుత్సాహ మయ మైనది. అప్పుడే యుద్ధ మైనట్లు -తాము గొందరిని నఱికినట్లు.

శాస్త్రి యాకారమున చలనమే లేదు. సర్వాధికారి మాటలు వదల లేదు. అట్టి సమయము రావలె ననియే నాయూహ గూడ; చలితేంధనమై యగ్ని జ్వలించును. ప్రకృత మైన పన్నగము-ఫణా మండలమును విప్పును క్షోభ కలిగినప్పుడే-మనుష్యుఁడు-తన స్వాశక్తి నావిష్కరించును. మన మీవిషయమును ప్రతి యొకరికిని బోధింప వలసినది లేదు ఆపరిస్థితియే-వానికా సాహసమును నేర్పును ఈత నేర్చి కొనుట కీదుటయే దారి. ఏమనుష్యుడు స్వాతంత్ర్యమును గోరడు? తన భార్యపుత్రాదులను రక్షించి కొనవలె నను నాశ యెవ్వరికుండదు? తప్పక యుండి తీరును.

అతని యీవాగ్ధాటి లౌకిక విషయములో గనుపరచున

ట్టిది సాధారణముగా దివానులట్టి ంరే యగుదురు. ఎదుటి వారికి మాటాడు నవకాశమివ్వక-సంబద్ధా సంబద్ధములను—అతి వేగముగా నల్లుకొనుచు బోవుట వారి యలవాటు

"ఇంతకును భార మంతయు చంద్రివాళీశ్వరునిది. అట్లని మనము చేతులు ముడిచికొని కూర్చుండ వచ్చునా?"

శాస్త్రి తన స్వరమును చేర్చినాడు

"కూర్చుండ రాదు. అది యధర్మము. అందుకే చెప్పు చున్నాను; ఈదృష్టితో చూచినప్పుడు-మళయాళ బ్రహ్మ పిశాచి మాటలు — మనము మరి కొంత గంభీరముగ నర్థము జేసికొన వలెను; నామాటలు మీరన్యథా భావింప రాదు ఆపిశాచి కోర్కెను—మనము తీర్చినచో—బాగుండు నేమొ యది నాయూహ. ఆపై తమ చిత్తము".

ఈకడపటి పూరణము—శాస్త్రిలోని సేవక భావమునకు సంబంధించినది. వారి మనస్సట్లుండును. తమ యసమ్మతము నెక్కడో ధ్వనింప (జేయుట-సందు దొరకినచో జారిపోవుటయు వారి కలవాటు.

నారాయణశాస్త్రి మాట యశ్రద్ధతో విన్న—సర్వాధి కారి పెదవులు వికసించినవి. శాస్త్రి యభిప్రాయము సరికాదని యానవ్వున కర్థము. తమకు దప్ప—బుద్ధిమరి యొకరి కున్న దని విశ్వసించుట—అధికారులు నేర్చని విద్య.

"నారాయణా! నీమాటలు నిజము కావచ్చును, కాని నాకు పూజారి సాంబయ్య స్వభావము బాగుగా దెలియును

వాడు తనస్వార్థ సాధనమునకై యీవేషము కట్టినాడని విశ్వాసము. ఇదిపుష్య మాసము కాదా! ఇంతకు ముందెన్నడును యీమాసమున-బ్రహ్మ పిచాచి యిట్లు గోరినది లేదు; మరి మీాయలవాటు క్రొత్తగా నేడేల వచ్చినది? ఈ తతంగ మంతయు -సాంబయ్య కాపట్య మనుటలో సందేహము లేదు.

"తమ యభిప్రాయము కాదను ధైర్యము నాకు లేదు. పూజారి సాంబయ్య తన కూటి కొరకై యీవేషమును గట్టి యున్నచో-యీసత్యము నేను గాకున్న రేపైన గడ్డకు వచ్చి తీరును. అప్పుడు వానికి ప్రజలు విధించు ప్రాయశ్చిత్తము-తక్కువదిగా నుండదు. ఆవిషయమట్లుండ నిండు. కాని యిప్పటి ప్రక్షుబ్ధ వాతావరణమును జూచినచో-సాంబయ్య మాటలను- అంత సులభముగా త్రోసి వేయరాదని నాయల్ప బుద్ధికిదోచు చున్నది. సుల్తాను గారు పంపిన యుత్తరము నింతకు ముందే గదా తమరు జదివితిరి. బ్రహ్మ పిశాచి మాటలు-గాబోవు నీపీడలకు సూచనముగా నుండు నేమో యని తమకేల తోచ లేదు? కనుక-బ్రహ్మ పిశాచి విషయమును-మనము స్వాముల వారికి నివేదించుట మంచిది. వారి యాజ్ఞానుసారము నడచు కొన్నచో మనకే బాధయు నుండదని తోచును ఆపై తమ చిత్తము"

"నీయల్ప విషయమున కింత ప్రాతి నిధ్య మొసగినచో స్వామితో నీవిషయమును బ్రస్తావించుటకు-నాకాక్షేపణము లేదు. కాని యొక విషయమును నీవు మరచిపోయినట్లున్నది.

భారతీ స్వాముల వారికాలముచాల అమూల్యమైనది. దానిని మనమిట్టి చిన్నవిషయములు వారిచెవినివేసి—వ్యర్థము చేయుట అంత మంచిది గాదని నాయూహ".

నరసింహశాస్త్రి అక్కడనుండి లేచిపోవు సన్నాహ మును గనుపరచెను. ఈ విషయమున వారికున్న యయిష్టమున కది గుఱుతు. అధికారులు, ధ్వనికవులు. తమ యభిప్రాయము లను—వ్యంగ్యవైభవముతో సూచింతురు.

వారి యభిప్రాయమును గమనించిన శాస్త్రి, తాను గూడ పోవుటకు సంసిద్ధతను దెల్పెను అదిమర్యాద. అయిష్ట మును బ్రకటించి చేయుటేమున్నది గనుక! సర్వాఽధికారి లేచిపోయెను.

అన్నదమ్ములు—పరస్పరము ఒకరిమొగమొకరు చూచు కొనిరి.

శ్రీకంఠశాస్త్రి పలికెను.

"ప్రయత్నము మనది. ఫలితము దైవేచ్ఛ"

## ౭

శ్రీమత్పరమ హంస పరివ్రాజ కాచార్య, పదవాక్య ప్రమాణ పారావార పారీణ, యమ నియమాసన ప్రాణా యామ ప్రత్యాహార ధ్యానధారణ. సమాధ్యష్టాంగ యోగాను ష్ఠాన నిష్ఠిత, శ్రీ శంకర గురుపరంపరాప్రాప్త షడ్దర్శన స్థాప నాచార్య, వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర, సర్వతంత్ర స్వతంత్ర; విద్యానగర రాజధానీ కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనా చార్య,

శ్రీ మద్రాజాధిరాజ, ఋష్యశృంగ పురవరాధీశ్వర, తుంగ భద్రాతీర వాస శ్రీ మద్విద్యా శంకర పాదపద్మారాధక, శ్రీమన్నృసింహ భారతీస్వామిగురు కమల సంజాత, శ్రీమత్స చ్చిదానంద భారతీస్వాములు తుంగానది. యొడ్డున నిర్మింపఁ బడిన యాశ్రమమున నివసించు చుండిరి.

వారు బ్రాహ్మముహూర్తమున నే లేచి—నిత్యకర్మా నుష్ఠానములను ముగింతురు. జనసంచార మారంభ మగుటకు ముందే తుంగానదిలో స్నానాహ్నికములను. తీర్చికొని, తమ కుటీరమునకు వచ్చి చంద్రమౌళీశ్వరుని ప్రాతఃకాల పూజకై కూర్చొనెడివారు.

ప్రాతః కాలపూజ సూర్యోదయమునకు సరిగా ముగి యును. ఆపై — విద్యాశంకర, శారదా దేవులకు — పూజసాఁ గెడిది; తరువాత మల్లికార్జునపూజ; ప్రసాద స్వీకరణము. ఫలహారా నంతరము—స్వామి కొంచెము సేపు విశ్రమించుట మామూలు. ఆసమయమున వారు — శిష్యులకు — పాఠము చెప్పెదరు. లేక, తామేదైనను గ్రంథము నవలోకింతురు. అవలోకన యనఁగా — తెలియనిది తెలిసికొనుట గాదు; మరి తెలిసిన దే — స్మృతికి దెచ్చికొనుట. సాయంకాలములలో తమ దర్శనమునకు — వచ్చువారితో సంభాషింతురు. ఆసమయము న నే శిష్యులలో పరస్పరము — శాస్త్రవాదము సాగెడిది. అది యొక వేడుక. శిష్యులకు వాగ్మిత్వమును — సమయస్ఫూర్తియు నేర్పడుటకిది యొకదారి. స్వామికి సంగీత సాహిత్యములన్న చో

ఆసక్తి మెండు. ఆకళలలో — నెవరితోనైనను - పాడించికొని వినెడివాడు. ఈ కాలక్షేపమొక రెండుమూడు గంటలు. స్వామికి వీణెలోవి - మెలకువలును దెలియునని ప్రసిద్ధి. ఒక సారి సర్వాధికారి వీణావాదనమును-నవరించిరట! సాయంకాల గోష్ఠి తరువాత — మరల పూజసాగును. అప్పుడుస్వామి యెవ రితోను పలుకరు. పూజ ముగిసినంత — వ్యాఘ్రాజినముపై శయనింతురు. అందరును నిదురించిన పిదప — వారి యోగా భ్యాసము — ప్రారంభమగును. యోగాభ్యాసములో రాత్రి యెంతయో నడచును. ఒక్కొక్క-సారి— రేయియంతయు యునట్లే గూర్చొనియుందురు కాని—వారి శరీరమున బడలిక యుండదు. యోగులకంతే నట!

సర్వాధి కారి మధ్యాహ్నమున దర్శనమునకైవచ్చెను. అతనితో నారాయణ శాస్త్రియు నుండెను. స్వామివా రప్పు డేదో గ్రంథ పఠనమున నుండిరి.

సచ్చిదానంద భారతులు వ్యాఘ్రాజినముపై గూర్చొ న్నారు. వారియెదుట నొక వ్యాసపీఠము. దానిపైనొకపురాతన తాళ పత్రి గ్రంథము. ఆపుస్తకము పేరు "భామతి" స్వామి దాని నేకాగ్రముగ (బఠికించు చుండెను. ఆగ్రంథ పఠనములో సంపూర్ణముగ మునిగి యుండెను—సచ్చి దానందులు పరిస రములను గమనించు చున్నట్లే లేదు. గాంభీర్యమే రూప మెత్తి నట్లుండెను. వారు కట్టిన దొక కావి పంచె అట్టిదే యొక కాషా యోత్తరీయము. దానినే తలపై చెరగు వలె కప్పుకొన్నారు

మెడలో రుద్రాక్షమాల; వారి సమీపమున నొక కమండల మున్నది, యోగ దండము వ్యాఘ్రాసనముపైననే యున్నది. పాదుకలు కొంత దూరమున నున్నవి. సచ్చిదానందుల వయసు సుమారేబదేండ్లకు దాటినది. కాని, వారి ముఖము కంద లేదు. గాజు వార లేదు. అది వారి తపఃఫలము నియమ బద్ధ జీవితమునకు గుఱుతు; ఆముఖమునిండ శాంతియే నిబడీకృత మైయున్నది. ఎట్టివారికైనను – వారియొక్క గంభీర మందహా సము – ధేలని బంటులనుగా – లోబరచికొను చుండెను, వారివాగ్ధాటి యపూర్వమైనది; మాటమాటలో వివేకము గర కట్టుకొని యుండెడిది; నెమ్మదిగా మాటాడుట వారికలవాటు. వారి మాటలు – అపయొక సాహితీ గ్రంథరచనమువలె నుండె డివి. టిప్పుసుల్తానువంటి వాడుగూడ – వారి సంభాషణమునకు దాసోహ మనెడివాడు. అతనికి, వారిపై నపారగౌరవా భిమానములు. తక్కినవారి దృష్టిలో స్వామిరూపాంతరము సనున్న – విద్యాశంకరులు.

సర్వాధికారి స్వామికంటెను – కొంచెము పెద్దవాడు, పీఠాధిపతుల యెదుట–వయస్తార తమ్యముపనికిరాదు. పైగా సచ్చిదానందులు మహాతపస్వి. సర్వాధికారి, వారినిసాక్షాచ్ఛం కరుని వలెనే – చూచికొను చుండెను. సర్వాధికారి స్వామికి సాష్టాంగ పడి. వారుచూపిన కృష్ణాజినముపై గూర్చుండెను. నారాయణశాస్త్రియు నమస్కరించెను, వారాసనమును జూపించిరి. కాని యతడు గూర్చొనలేదు దానినిసభ క్తికముగా

చేతితోఁ దాకి నేలపైననే గూర్చొనెను. తాను చెప్పవచ్చి నది — చాలతుల్లకమైన సంగతి. దీనిని స్వామికి నివేదించు టెట్లని సర్వాధికారి మధనపడు చుండెను. నారాయణశాస్త్రి ముఖముపై గూడ నాభావమే యున్నది; సచ్చిదానందులు వారి ర్వురి ముఖములనుజూచి, యేదొవిషయము జెప్పుటకు సంకో చించుచున్నారని — వారే సంభాషణము నారంభించిరి.

"సర్వాధికారు లేదో పనిపై వచ్చినట్లున్నది. అది తొం దరపనియేనా?" నరసింహశాస్త్రి మారు బలుక లేదు. అతడు నారాయణ శాస్త్రి వైపు జుచెను. నీవే ప్రస్తావింపు మని దాని యభి ప్రాయము.

నారాయణ శాస్త్రి

"గురుదేవా! పని యేమంత దొడ్డది గాదు. తమ దర్శనము ముఖ్యము. కార్య మానుషంగికము. వీలున్నచో మనవి.

పై మాటల నతడు భయపడుచునే యన్నాడు స్వామి ప్రసన్నముగా నవ్వుచుండెను.

"ఏమది?" వారు నరసింహ శాస్త్రి వైపు దిరిగిరి.

"ఈమాట విని? తామునవ్వుదు రేమో యని భయ ముగా నున్నది. కాని ఈవృత్తాంతము విన్నప్పటి నుండియు శృంగేరిలోని జనము కలవర పాటు జెందు చున్నారు. అందుచే తమ కాలము యొక్క — వెలను గమనించియు—తమ కేవిషయము మనవి సేయక తప్పుట లేదు"

"నిస్సంశయముగ తెలుప వచ్చును"

జరిగిన సంతి యంతయు నారాయణ శాస్త్రి విన్న వించెను. స్వామివారేమియు మాటాడుట లేదు; ఊరక వినుచుండిరి. ఒక సారి మాత్రము "ఏమీ?" అన్నారు ఆవాక్యములు నారాయణ శాస్త్రి మరలచెప్పెను. నారాయణ శాస్త్రి యంతయు జెప్పిన తర్వాత సచ్చిదానందు లిట్లన్నారు.

"నరసింహ శాస్త్రి గారూ! ఈవిషయమున మీ కేమనిపించు చున్నది.?"

"స్వామీ ఇదంతయు పొట్ట కూటి పూజారి సాంబయ్య కట్టిన నాటకమని సాయూహా, రాబోవు మహాపదకిది యేదో సూచకమని పలుకువారు కూడనున్నారు. నేను సాంబయ్యను పిలిచి విచారించితిని. తన కేసంగతియు తెలియదనియు తన యొంటిపై కివచ్చిన బ్రహ్మపిశాచియే పలికినదనియు వాడనెను. బెదరించి చూచితిని. వాడు సత్యము నంగీకరింపలేదు. వానికి పొట్టకు లేనపుడు — ఆకలిహెచ్చి, యావేశమువచ్చి యుండు నేమో: ఏవో నోటికి వచ్చిన నాల్గుమాటలని యూరి లోని జనులను భయభ్రాంతులనుగాఁ జేసివైచినాడు. ప్రజల యాలోచన యెంతటిది! ఇదిగో! నక్క—యన్న — తోకతొంబది వారలందురు. వారెప్పటికిఁగూడ నింతే ఏవిషయమును తీవ్రముగ నాలోచింపరు; చెప్పినది నమ్మెదరు. శృంగేరివారుగూడ నట్లేనమ్మిరి. మీయెదుటికి సాంబయ్యను బిలిచి, యొకసారి విచారించినచో బాగుండును.

"ఇంతకుముందు గూడ – యెవరో యీవిషయమును మాచెవిలో వేసిరి. ఇంతలో మరల మీరును బ్రస్తావించు చున్నారు. ఇది – కూటికొరకు–సాంబయ్య కట్టిన వేషమైనచో– జనులంతగా భయపడి యుండరు. జనులు – మీరనుకొనునంతటి. యమాయకులుగారు; వారుగూడ ఒకవిషయము ప్రసక్తమైనచో – మనవలెనే యాలోచింతురు; నేటి పొద్దుటనుండి– యెక్కడ జూచినను – ఈ విషయమే గుంపులుగట్టి – మాటాడుకొను చున్నారట! మరి మనమీ విషయమునంత సులభముగా – త్రోసిపుచ్చుట క్షేమకరముగాదు. కూలంకషముగా విచారించుట మంచిది"

"పూజారి సాంబయ్యను పిలిపింతునా?"

"నేనుగూడ నదేయనుకొను చున్నాను"

"సాంబయ్యను"గొని వచ్చుటకై సర్వాధికారి యొకరిని బంపెను. సాంబయ్య వచ్చెను. వాడు వణకుచు – స్వామియెదుట నిలుచుండెను. వాని మొగమున ప్రేతకళయున్నది; తన "భృతి" కేమిచేటు మూడునోయను విచారముతో – వాని యొడలంతయు చెమటపట్టు చుండెను. వాడు దైవమును నమ్మెను. సర్వాత్మనా నమ్మెడు. బాధలేనంత వరకు నమ్మును. ఇది సామాన్యుల స్వభావము; సాంబయ్య స్వామికి సాష్టాంగ పడెను. బెదరుచూపులతో సర్వాధికారికి సాష్టాంగ నమస్కారమొనర్చెను. నారాయణశాస్త్రికి నిల్చియే దండముపెట్టెను; వానినమస్కారము – ముప్పేరి విషయముననూ – మూడు

రకములుగా నున్నది. వానినిఁజూచి చిరునవ్వు నవ్వుచు స్వామి యిట్లనెను.

"సాంబయ్యా! నీవు భయపడ వలసినదిలేదు. నీపైకి బ్రహ్మపిశాచి వచ్చియుండెనట! ఆ విషయమేమో జరిగినది జరిగినట్లు చెప్పుము. మేమునిన్ను విచారించి శిక్షించుటకు పిలిపింపలేదు. సత్యమును దెలిసికొనుటకు మాత్రమే పిలిపించితిమి"

"స్వామీ! చంద్రమౌళీశ్వరుని తోడు నేనే కపటము నెఱుగను. అబద్ధమాడినచో నానాల్క — వేయిగా చీలిపోవును; నేను నిలిచియున్న భూమియచ్చే క్రిందికిక్రుంగి — నన్ను పాతాళమునకుఁ జేర్చికొనును" పూజారి సాంబయ్య నడచిన కథ యంతయు తు. చ. తప్పక వినిపించెను. అంతయువిని — స్వామి యొక్కసారి నవ్వెను.

"అయినచో నీయొడలిపైకి బ్రహ్మరాక్షసి వచ్చినది నిజమన్నమాట"

"ముమ్మాటికి నిజము"

"ఇకనీవు పోవచ్చును"

ఈమాట పూజారి సాంబయ్య కర్థముగాలేదు. తన మాట స్వామి నమ్మినట్లా? లేనట్లా?. ఏమో! వాడాపైన నాలోచింపలేదు. అక్కడనుండి దాటుకొని పోయినచో చాలను కొన్నాడు.

వాడు పోయిన తరువాత స్వామి యిట్లు పలికెను.

"నరసింహశాస్త్రీ! ఇంకను మీరా విషయమును నమ్ముట లేదా?"

ఈమాటలకు సర్వాధికారి వెంటనే సమాధాన మివ్వ లేదు, తార్కికులంత త్వరగా బదులుపల్కరు. నేరుగా బదు లివ్వరు.

"తమ కేమని పించుచున్నది?"

"వాడు సత్యమే చెప్పుచున్నాడు; ఇది మా యభిప్రాయము".

"అనగా తమరీ భవిష్యద్వాణిని నమ్ముచున్నారన్న మాట"

నరసింహశాస్త్రి కండ్లు రెండును పెద్దవైనవి. అవి యాశ్చర్యము దెల్పుచుండెను.

"అవును! ఒకడొకదానిని విశ్వసించును. మరియొకరు విశ్వసింపరు. అది వారి సంస్కారములోని భేదము ఇంతకును- విశ్వాసము - యీశ్వర సాక్షాత్కారమున కంగము."

"నా కేమో నమ్మకము గుదురుట లేదు. కానితమయాజ్ఞ కడ్డమాడుట నాకిష్టము లేదు. ఒకవేళ పూజారి మాటలు నిజమే యైనను - బ్రహ్మపిశాచి యొకక్షుద్ర దేవత; ఈవిషయము న నాయధికారము చాలస్వల్పము. "అదిక్షుద్ర దేవతయైనను- శంకర భగవత్పాదుల వంటి వారే - దానికి మరియాదలు జెల్లించిరి. దానినిక్కడ బ్రతిష్ఠించిరి. వారియభిమానమునకు పాత్రమైనదానిని - మేమును గౌరవముతో చూతుముగాక -

ఈ భవిష్యద్వాణిని విని శృంగేరి జనులు—తల్లడిల్లు చున్నారు. కాని వారిభయమున కిదియొకటియే కారణముగాదు. ఈనడుమ మైసూరు రాజ్యముపైకి – మహారాష్ట్రులు – ఇంగ్లీషువారు దండెత్తివత్తురన్న వార్తలు సవసవగా వ్యాపించినవి. వారిక్కడ శత్రురాజ్యములలో నొనర్చిన దారుణకృత్యములు – కొమ్మలు రెమ్మలుగా వ్యాపించి కొనియున్నవి. ఆరాబోవునా యాపదలను – తలంచికొని ప్రజలు కుప్పగూలి పోవుచున్నారు. ఈమానసిక స్థితులలో – నీభవిష్యద్వాణి—వారిపై తీవ్రముగ పనిచేసినది. వారి కలవరపాటును – సాధ్యమగునంత వరకు దొలంగింప వలసిన బాధ్యత మనపైనున్నది; పైగా రాష్ట్రోపప్లవము లేర్పడినపుడు – దేవతాపూజాదికములు చేయవలెను. చేయింపవలెనను వచనము లున్నవిగదా! టిప్పుసుల్తాను విజయముగూడ మనకు సమ్మతముగదా! ఆదృష్టితోం జూచినను – బ్రహ్మపిశాచిని తృప్తిపరచు నెపమున – భూతతృప్తి సేయుట మంచిదే. కనుక యీపుష్యమాసము గడచిన వెంటనే బ్రహ్మపిశాచి కోరినట్లు పదివేలమందికి గాకున్నను—సాధ్యమైనంతమందికి – అన్నతృప్తి చేసి, వాసోదానము లొనర్తము. దేవతలకు విశేషపూజలు – ఉత్సవములు యేర్పాటు చేయింతము; మేమున్నదియు ధర్మోద్ధారమునకే గదా? జనులు మనకు గానుకలర్పించు చున్నారు. సింహాసనాఽధిష్ఠాత్రి శారదాదేవి – మఠపు భూములలో బంగారు పండించు చున్నది; మేమామె యాదాయమును లోకకల్యాణమునకు—ధర్మశోధకు

వినియోగించు సేవకులము; ధనములు మిగిల్చికొని మేమేమి చేయవలెను? మాకు లోకమే కుటుంబము. అంతమాత్రమే గాదు. ప్రజల యభిప్రాయములకును మేమును కింకరులమే. అందుకే మేమీధర్మాసనముపై నున్నది. సన్యాసమును స్వీకరించి నదియు, కనుక మీరిప్పటినుండి—అన్న సంతర్పణమునకుఁ గావలసిన యేర్పాటులకు బూనుకొనవలసి యుండును. ఇది మాయంతిమ తీర్మానము.

సచ్చిదానందుల తీర్మానమును విన్నతర్వాత నరసింహ శాస్త్రి కేమనుటకును నోరాడలేదు. వారు "సరే" నని సెలవుగైకొనిరి. నారాయణశాస్త్రి హృదయమునందు - స్వామి మాటలు క్షీరమువర్షించి నటులుండెను. "పూజారిసాంబయ్యకు తానొసగినమాట చెల్లించుకొన్నానుగదా! "యని యాతడానందముతో మిన్నంటినాఁడు. ఆతఁడు దానికిఱువైపుల—చిఱునవ్వులు విసరుకొనుచు — నింటికి వచ్చెను. ఇంటిలో నంతకంటె యానందకరమైన విషయమొకటి కాచికొనియున్నది. ఈనాఁడు సంతోషదేవత — నారాయణశాస్త్రి యింటనిలచి — యాతని మెడలో జయమాల వేయుచున్నది.

శ్రీకంఠశాస్త్రి — తమ్మునకొక పత్రమందించెను. దాని నందుకొనుచునే నారాయణశాస్త్రి

"ఎవరు వ్రాసినారు?"

"చదివిచూడుము నీకే తెలియును."నవ్వులతో పరిమళితమైనమాట; నారాయణుడు తలనెత్తి చూచెను. ఎదుట నిలిచి

నది వదినె. ఆమె మూర్తిమంతమైన తృప్తి.

నారాయణశాస్త్రి త్వరత్వరగా దానిని చదువుకొన్నాడు వానిముఖము వానికి తెలియకయే వికసించినది, అది పార్వతి తనమామకు వ్రాసిన యుత్తరమునకు వచ్చిన జవాబు. ఇప్పుడు పుష్యమాసమనియు — శుభకార్యములకు మంచిదినములు లేవనియు — మాఘమాసము వచ్చిన వెంటనే అవశ్యము — తమ బిడ్డభారతిని తీసికొనివచ్చి చూపింతుననియు, పారొప్పుకొన్నచో మాఘమాసమునందే వివాహము, జేసియిత్తు ననియు — వధువుతండ్రి వ్రాసియుండెను.

"వదినా! ఈపని నాకేమియు నర్థమగుట లేదు."

అవునవును! ఇప్పుడేమియు నర్థము గాదులే. రేపు పెండ్లాము ప్రక్కన నిల్చి కొన్నపుడంతయు నర్థమగును. ఆమె నవ్వు—మరదిని దీవించు చున్నట్లే యుండెను.

"అన్నంతపనియు జేసినావన్నమాట. నేనొంటిగా — సుఖముగా బ్రతుకుటకు నీకిష్టము లేనట్లున్నది," ఈమాటలు వాడు నవ్వుచు నన్నాడు. అనగా నామాటలకు వ్యతిరేకధ్వని.

"అందరు నిట్లేయందురులే. మీయన్నగారు గూడ నిట్లేయన్నారట! ఇప్పుడు జూడుము! ఇంతకు నీగొడవయంతయు నాకెందుకు? నీయిష్టము. నీకుకాబోవు మామగారియిష్టము; మాయాశయంతయు నాలుకకు తీపుతగులు నంతవరకే."

సిగుతో నారాయణశాస్త్రి మొగమెఱ్ఱవారెను. మాఘ మువచ్చినది. భారతిని పిలుచుకొని — యామె తండ్రిగారు

వచ్చిరి. వధువును పార్వతి మఱదిముందు నిలిపెను. భారతీదేవి దంతపుబొమ్మనవలె నున్నది. మంగళగౌరి వంటి యందము, ఆమెను చూచినదే తడవు నారాయణుని మనసు — వివాహమునకై తొందరపడ సాగెను

వాడు తిన్నగ వదినెవైపు తిరిగి నవ్వెను. అదే వానిసమ్మతి ఒకవారము తిరుగులోపల వారితలపై నక్షతలుపడి నారాయణ శాస్త్రి, భారతికి భర్తయైనాడు. తానింతకు ముందు మేనమామ కిచ్చిన మాటను నిలిపి కొన్నానని పార్వతి పకపక నవ్వినది.

నారాయణశాస్త్రి మన లోకములో లేడు. తన వివాహమంత త్వరగా నగునని వాడను కొన లేదు. భారతి విచ్చిన తామర వలె నుండెను, ఆమె స్వప్న లోకము నందలి మత్స్య గంధిని రూప సంపదతో నవ హేళన మొనర్చు చున్నది. వాని హృదయము—ఒక్కని మేష మైన నాగక భారతి చుట్టును పరి భ్రమించు చున్నది, వాని హృదయమున నేడు—భారతీదేవి కాని దొక యణువు లేదు. వాని స్వప్నముల నిండ భారతీదేవి; జాగ్రదవస్థలో భారతి, వాని కప్పుడప్పుడు—బాహ్య స్మృతి వచ్చునది—వదినె తన్ను హాస్యము చేసినప్పుడు; భారతి యత్త వారింటికెప్పుడు వచ్చును? తానామెతో మాటాడున దెప్పుడు ఇవే వానిని చుట్టుకొన్న చింతా తంతువులు; వాని శరీరము రోమాంచక కంచు కితమై నప్పుడు—వదినె చూచునేమో యని సంకోచము. కాని, యామె చూడనే చూచెడిది. భారతి యింకను వ్యక్తురాలు గాలేదు. అగుటకు కొంత కాలము పట్టును.

ఈదినము లెట్లు గడుప వలెననియే నారాయణశాస్త్రి చింత. క్రీస్తు శకము 1791 ఏప్రిల్ 23వ తేది శృంగేరి యితిహాసమం దొకదుర్దినము. ఆదినమున శృంగేరిలో, ఘోరమైన సంఘట నము జరిగినది. దీనికి మళయాళ బ్రహ్మరాక్షసిశాపమే కారణ మని—చాల మంది యను కొన్నారు. అది టిప్పు సుల్తాను ముం దటి గాథ. మజల నట్టి సన్నివేశమొకటి జరుగ నుండెను ఆదురదృష్ట మేర్పడ గూడ దని శృంగేరి స్వాముల వారు సర్వాధి కారి, నారాయణశాస్త్రి యెంతయో వాంఛించిరి, కాని యది జరుగనే జరిగెను.

ఇంగ్లీషు వారితో హైదరాలి కాలము నుండియు ద్వేషముండనే యున్నది ఇంగ్లీషువారితో ద్వేషము రాకుండు టకై—హైదరాలీ తన రాజ కీయ చాతుర్యము నంతయు వెచ్చించెను. కాని ద్వేషము తప్పలేదు. టిప్పు — ఆ వైమనస్య మును ముందుకు సాగించెను అతనిది కొంతతీవ్ర ప్రకృతి; ఫ్రెంచివారు సుల్తానుకు బాసటగా నిలచిరి. వారివత్తాసిలో టిప్పు - ఆంగ్లేయులను జయించెను. ఇంతలో నొక దురదృష్ట కరమైన సంఘటనము జరిగినది. యూరోపులో — ఫ్రెంచివా రును ఆంగ్లేయులును – రాజీపడిరి. ఆ షరతుల ననుసరించి — భారత దేశము నందును — రాజీపడవలెను. ధర్మము, సత్యము, అనునవి, రాజకీయములలో – పొడిమాటలు. ఇండియాలో — ఆంగ్లేయులును – ఫ్రెంచివారును సంధిచేసి కొన్నారు. ఈ సంధి సుల్తానునకు వెనుకపోటయ్యెను. విధిలేక యాతడు-మంగళూరు'

సంధి కంగీకరించెను. ఆ సంధిననుసరించి - కొంత భూభాగము- వాని చేతినుండి వదలి పోయినది. దానిని మరల సాధించు కొనవలెనని టిప్పు ఆశ. అందుచే నాతఁడాంగ్లేయులపై యుద్ధము ప్రకటింపలేదు గాని, యుద్ధసన్నాహములను మాత్రము జేసికొనుచునే యుండెను; అప్పటి యాంగ్లగవర్నరు జనరలు లార్డ్ కారన్ వాలిస్సు: అతడు సులతాను ప్రయత్నములను గమనించెను; టిప్పు ప్రబలుఁడగుటకుముందే లొంగదీసి కొనవలెనని - యాతడు నిశ్చయించి కొన్నాఁడు. అతడు సులతానుపై యుద్ధము ప్రకటించెను. వారికి తోడుగా మహారాష్ట్రులు నడచిరి. సులతానుపై వారికి ప్రబలద్వేషము; హిందువులదైన మైసూరు సింహాసనమును. వాఁడాక్రమించు కొనుటచే-టిప్పు హిందూమత విధ్వంసియని వారెంచిరి ; కారాగారమున నున్న హిందువులను - క్రిష్టియనులను - వాఁడతి క్రూరముగ హింసించెడు వాడు. ఇది యాంగ్లేయులకును - మహారాష్ట్రులకును- సమానమైన కోపకారణము; మహారాష్ట్రులకు కోపమువచ్చుటకు - మరియొక హేతువుగూడనుండినది; బీజాపురమును తన కొప్పించవలెనని - టిప్పు- నిజామును నిర్బంధించెను అదియొకప్పుడు మైసూరు రాజ్యమునకుఁ జెందినది; బీజాపురమును. వెన్కకిచ్చుటకు - నైజామంగీకరింపలేదు. సులతాను యుద్ధమునకు కాలుదవ్వెను. నిజాముడు మహారాష్ట్రులను సాయము వేడినాఁడు.; బీజాపురముపైన మహారాష్ట్రులకును - కన్నుండినది. అందుచే - యీయుద్ధమున సాయమొనర్చినచో - తర్వాత

దానిని రాబట్టుకొనుట కానుకూల్యమేర్పడ వచ్చునన్న యభి ప్రాయము — వారికి గూఢముగ నుండెను. ఇట్లు — టిప్పుసుల తానుకు మహారాష్ట్రులతో యుద్ధముతప్పని సరియైనది; టిప్పు పిడుగునకు తమ్మునివంటి వాడు. వాడొక నిర్ణయమునకు వచ్చుటయేజాగు; నిర్ణయించికొనెనా — యిక వెనుకముందుఁ జూచుటయుండదు. వాడు. సైన్యములతో — మహారాష్ట్రు లపైఁబడెను. కానిజయేందిర పరాఙ్ముఖయైనది. ఓటమికి ఫలిత ముగ—'బాదామి' 'నెరసంద' మొదలైనవి, వానిచేయి వదలి పోయినవి; వానిని వెనుకకిచ్చుటకు—మహారాష్ట్రులతో టిప్పు బేరములాడెను. నలువదియైదు లక్షలు పరిహార ధనమొసఁగి నచో — వానిని వదలుకొందుమని పీష్వాలనిరి. టిప్పు పైకమును చెల్లించెను.మహారాష్ట్రులతోడి తన యోటమికి"హర్పణహళ్లి" పాళెగాడు కారణమని, యెవరో చెవిలోనూదిరి. సులతాను వానిపై నెత్తెను. వానిని చంపి పగదీర్చికొన్నాడు.

ఇంతలో నాగినచో నాంగ్లేయులు టిప్పుపైకి వచ్చెడు వారు కారు. వాడు మైసూరురాణియైన లక్ష్మీదేవిని, ప్రబల దారిద్ర్యావస్థకు' దింపెను. మైసూరుకోటను. నాశమొనర్చెను అంతఃపురమునుగూడ విడువక — దాడివెట్టి సంపత్తు నంతయు దోచికొనెను. ఆమె యాంగ్లేయులను సాయము యాచించినది. ఆమెకైన యవమానమున కాంగ్లేయులు ప్రతీకారము చేయ నెంచిరి. ఈసారి యింగ్లీషువారిని — భారత దేశము నుంచియే తరిమి వేయవలెనని సుల్తాను పట్టుపట్టినాడు. వాడు "కాన్

స్టాంటి నోవుల్” పారిస్సులకు “రాయబారములంపి వారిసాయ
ము నర్థించెను. వారిసాయమునే నమ్మి యింగ్లీషువారలకు
మిత్రుడైన—తిరువాన్కూర్ రాజుపై దండెత్తినాడు; అక్కడ
వానిని పరాజయమే యెదురుకొన్నది. ప్రాణములు దక్కించు
కొనుటయే కష్టమైనది. రెండువేల రౌతులు మరణించిరి.
ముద్రాంగుళీయకము శత్రువశమయ్యెను. మరి కొన్ని వెలగల
పదార్థములును — తిరువాన్కూరు రాజునకుఁ జిక్కినవి.
స్వాభిమానమున కింతటిదెబ్బ, వాని కింతకుముందెన్నడును దగు
లలేదు, నేడు చావుదెబ్బ తగిలినది; తానింక—బ్రతికి ప్రయో
జనము లేదని వాడెంచెను; ముందు వెన్కాలరయని మీరాయావే
శమున జనించిన దే-యాంగ్లేయులపై దండెత్తునూహ.

“కారన్ వాలీస్” టిప్పుసులతానుపై దండెత్తవలసి
నదని జనరల్ ‘మెడోస్’న కాజ్ఞయొసగిరి. అతడు పదునెదు
వేలసైన్యముతో తిరువాన్కూర్ రాజునకు తోడువచ్చెను.
పూనాలో రెసిడెంటుగ నున్న ‘వాకెట్టు’ దొరకును, పీష్వా
యైన నానాఫర్న్మ వీసునకు సంధికుదిరినది. వారిలో నిజాము
సైన్యములును జేరెను.

మహారాష్ట్ర సైన్యములు” పరశురామ భావే, పట్టవర్ధ
నుల నేతృత్వమున బయలుదేరి, కృష్ణానదిని దాటి, యింగ్లీషు
వారి సైన్యముతో చేరికొనెను. మరియొకవైపునుండి ‘కాప్టన్
లిటిల్ అనువాడు’ సంపద్భరితమైన ‘బిదునూరు’ గెల్చికొను
టకు, శివమొగ్గ’పై బడెను.మద్రాసులోని సైన్యము.”కరూరు,”

"ధర్మవరము" 'దిండిగల్లు' మొదలైనవానిని వశపరచుకొని బెంగుళూరు వైపు నడచినది. ఇట్లు శత్రుసైన్యములు అన్నివైపులనుండియు ముసరుకొన్నవి; ఇట్టి సమయమున మళయాళ బ్రహ్మపిశాచి శృంగేరి జనుల హృదయములలో నేదో మహా భీతిని విత్తెను. అది మహారాష్ట్రులదాడి మూలమున ఫలించునని యెవ్వరు నూహింపలేదు, ఆరాత్రి స్వామికొక చిత్రమైన కలవచ్చినది.

తెల్లవారుట కొక జాముండెను. అప్పుడు నడచిన దాకల. స్వామి యెప్పటి వలె శారదా పూజకు తొడగిరి. కాని ఆశ్చర్యము! జగజ్జనని యైన యామె మొగము ముడిచికొని యుండెను. ఆమె పెడ మొగముగ గూర్చుండియున్నది. ఆదృశ్యము స్వామికి భయమయ్యెను.

"ఏమి తల్లీ! నానుండి యేయపరాధమైనది? నీవెందుకు మూతిముడుచుకొన్నావు?" అని పసిబిడ్డ వలె నాతడు దీనముగ ప్రార్థించెను.

ఆమాటలకు తల్లి యిట్లనెను.

"వత్సా నీపై నాకాగ్రహము లేదు. కాని నాపైననే నాకు వేసరిక కల్గినది. నాసంతానము ఎంత భయంకర కార్యములకు తొడగినదని దుఃఖమగుచున్నది. ఇట్టి వారినా నేను రక్షించ వలసినది?"

తల్లీ! అంతటి మహాపచారము నీసంతాన మేమి చేసినది?"

"ఇంకేమి కావలయును? నాసంతాన మనిపించు కొన్న వారి చేష్టలు చూడుము. నాసమస్త సంపద లను చూర గొన్నారు. వారికి తృప్తి లేదు. బంగారుపై పిచ్చితో నామాంగల్యము కూడ చేయి చేసి కొను చున్నారు. నీవైన నన్ను రక్షింప లేవా? వారికి బుద్ధి చెప్పలేవా? అయ్యో! ఈదురదృష్టము. నన్ను గూడ వదలుట లేదు. నాసంతానమేనా నన్నింత యవమాన పరుప వలసినది? నేనిక—యిక్కడేల నుండ వలయును? నాకిక్కడ చోటు లేదు. నేనిక పోవలెను." ఆమె తుంగానది. వైపు నడచెను.

"వలదు తల్లీ! నీసంతాన మొనర్చిన యపరాధములను క్షమింపుము. ఇక మీద నట్టి యప రాధము జరుగ కుండ చూచి కొందును, తెలియక చేసిన తప్పును దయతో మన్నింపుము. కాపాడుము. నీవే చేయివదలినచో ఇక వారి నెవరు రక్షింతురు? మమ్ము విడిచి పోవలదు. నిన్ను వదలి నేనొక నిమేషమైన జీవింప లేను." స్వామి గట్టిగా నఱచు కొనుచు నామె వెంట బడినాడు; స్వామి వెను వెంటు నంతలోనే భారతీదేవి తుంగలో కురికినది. ఆమె మరల అగపడలేదు. ఈభయంకర స్వప్నముతో సచ్చిదానందులు మేల్కొనిరి. అప్పుడప్పుడే సూర్యుడుదయించు చున్నాడు. తమకగుపించినది కలయో నిజమో, యూహించుకొనుస్థితిలోలేదు స్వామి. తల్లినిగోల్పోయిన కొడుకువలె నేడ్చుచున్నాడు. తిన్నగా లేచి – స్నానాహ్నికముల – నఱమనస్సుతోనే దీర్చికొనెను. సర్వాధికారికి

చెప్పి పంపినాడు. నరసింహశాస్త్రి భయపడి పరుగెత్తుకొని వచ్చెను. స్వామి యాతనికి—జరిగిన కథయంతయు వినిపించెను. సర్వాధికారి యిట్లనెను.

"అట్లైనచో మనపీఠమున కేదియో యాపద కాచియున్న దన్నమాట"

సచ్చిదానందులు మూగగా నున్నారు.

సర్వాధికారి మరల ననెను.

"ఈదినమే వార్తలువచ్చినవి; మైసూరిపై దండెత్తిన పరశురామభావే సైన్యము — లీవైపుగ వచ్చుచున్నవట! శృంగేరిని దోచుకొనవలెనని వారి యూహయైనట్లు వార్తలు వచ్చినవి."

ఈవార్తనిని స్వామికంపించెను.

"దేవిపలికిన యాపద యిదియేనని వారియూహ. వారికి పిచ్చిపట్టినట్లుండెను. ఏపనిపై గూడ మనసు నిలుచుటలేదు పూజా, ధ్యానాదులలోగూడ—హృదయమునకు శాంతి చిక్క నదిగాదు. "జగన్మాత శారద మూతిముడిచికొని కూర్చున్నది. గురుపీఠమునకు హానితప్పదు." ఏదో అవ్యక్తవాణిమాటిమాటికిని పలుకుచుండెను.

"మేమేమి యపచార మొనర్చితిమి? తల్లి మొగమేల చిన్నబోయినది? ఈమె యెట్లు ప్రసన్నురాలగును? ఏమిచేసి నచో—రానున్న యాపద తప్పిపోవును? ఈవిషయములే యాలో చించుకొనుచున్న స్వామికి; సాయంకాల మెప్పుడైనదియు

దెలియనేలేదు; ఎవరో సాయంకాలానుష్ఠానమున కెచ్చరించిరి. హృదయములోని కల్లోలము తగ్గుటకు స్వామి, శారదముందు పద్మాసనమునఁ గూర్చొనిరి.

"తల్లీ! నీవుజగన్మాతవు; నీవేమాపై కోపగించుకొన్నచో నికమాకు దిక్కెవరు? "వారికంఠము గద్గదమైనది. కన్నులలో ధారావాహికముగ నీరు దూకుచుండెను. వారు శిశువువలె నేడ్చుటకు మొదలుపెట్టిరి. కొంతసేపైన తరువాత-హృదయ భారమేమో – కాసంత తగ్గినటులైనది. జగదీశ్వరి మాయ విచిత్రమైనది. ఆమె మాయాజాలము ముందు మూర్ఖుడొకటే పండితుడొకటే. జ్ఞానమొకటే. అజ్ఞానియొకటే. స్వామి సమీపముననే ధ్యానములో మునిగిరి. రాత్రియంతయు సమాధిలోనే గడిచినది. తెల్లవాఱు వేళకు – వారిమనస్సు ప్రసన్నముగ నుండెను. అంతకుముం దేవి శేషమును జరుగనట్లు స్వామి పరమశాంతులుగ నున్నారు. యథాప్రకారము నిత్యానుష్ఠానముసాగెను, ఇంతలో నేమనుకొన్నారో – తుంగానది గట్టున నున్న – చెన్నమల్లి కార్జునుని గుడికి బయలుదేరిరి. వెంటవచ్చువార మేదియులేదు. వారెవ్వరికిని దెలుపలేదు.సచ్చిదానందులు ఆలయము జేరుసరికి బాగుగాఁ దెల్లవారినది. భూమియంతయు-బంగారునీరు చాపినటులు – రక్తస్నాత మైనట్లున్నది. ఆలయములోని ప్రశాంత వాతావరణము–స్వామి హృదయమునకు మరికొంత నెమ్మదినిచ్చెను, చాలసేపువారు – మల్లికార్జునుని యెదుట – మౌనముగఁ గూర్చొని యుండిరి. కనులు తెరచు

వప్పటికెదుట — సర్వాధికారి, నారాయణశాస్త్రి, నిలిచికొన్నారు.

వారి మొగములు మ్లానములై యుండెను. స్వామి వారివైపు తదేకముగాఁజూచి.

"ఏమి వచ్చితి? "రన్నారు.

"గురుదేవా! తాము హఠాత్తుగా మాయమైన విషయమువిని మాగుండెలు బగిలినవి. వెదకికొని వచ్చితిమి. ఇక్కడ చూచుటతో మనస్సునకు సమాధానమైనది. మానుండి తమకు ధ్యానము భగ్నమైనచో క్షమింపవలెను. ఇకమీదట మీరు మాకు తెలుపక యిట్లుఒంటిగా తిరుగరాదని మనవి"

"ఎందుకు" స్వామి నవ్విరి.

"మనకు పైపైన దుశ్శకునములగు చున్నవి. ఒకవైపున బ్రాహ్మణపిశాచి భవిష్యత్తు; మరియొకవైపు తమకువచ్చినకల; వీనినాలోచించినచో - శ్రీమఠమున కేదియోయాపద మూడనున్నదని యనుమానము; ఇట్టిసమయమున తమరొంటిగ తిరుగనారంభించినచో యపాయము కలుగవచ్చును, కనుక తామిక మీదట, మఠమువిడచి యెక్కడికి పోరాదు"

"నావిషయమున మీరంత వ్యాకులత చెందరాదు దైవేచ్ఛలేనిది — ఏపనికూడ జరుగనేరదు. కనుక మనభారమంతయు భగవంతునిపైవేసి నిర్విచారముగ నుందము. దైవము మనలను పరీక్షించు చున్నాడు; మనము భయపడరాదు. ఏవిపత్తు వచ్చినను ధైర్యమున నెదురింతము మనక్షేమమును

చూచుకొనుటకు జగన్మాత యున్నది”

“శారదాదేవి గూడ మనపై కోపగించుకొన్నట్లున్నది. తల్లియే సంతానమును దండింప బూనుకొన్నచో నిక రక్షించువారెవరు?

“శారదాదేవి, నాకలలో కోపగించుకొన్నట్లు కన్పించినది నిజమే. కాని, యామెది. హారము పట్టిన బిడ్డపై-తన తల్లి చేసికొన్న కోపము. శిశువు దోష మొనర్చినచో క్షమారూపిణి యగు మాతృదేవత యొక దెబ్బ వేయ వచ్చును కాని బిడ్డ ఏడ్చినపుడు మరల దేవియే యెత్తికొని లాలించును జగజ్జనని మన యవివేకమునకు కోపగించుకొని యుండవచ్చును. మనలను శిక్షించుట రణచండివలె రావచ్చును. నేడు శస్త్రాయుధమును ధరించిన హస్తమే, రేపు—అభయ హస్తమగును. మన మందుకై చింతింప వలసినది లేదు తల్లి తన బిడ్డల క్షేమమును చూచుకొనును. నిశ్చింతగ నుండుడు”

ఇంతలో నక్కడి రాతి కంబమున కానుకొని యున్న నారాయణశాస్త్రి “గురుదేవా! ఇదే మాశ్చర్యము; ఈకంబమున గణపతి విగ్రహము బయటికి చొచ్చికొని వచ్చినది” అన్నాడు.

“ఏదీ! ఏదీ!” అని స్వామి దృష్టియావైపు మరల్పెను.

నారాయణ శాస్త్రి యాదృశ్యమును జూచినాడు స్వామి నిశ్చేష్టులై చూచిరి అది యొక పెద్ద రాతి కంబము,

దానిపై భాగమంతయు గట్టిగా నుండెను. నడిమి భాగము మాత్రము బోలు. గణపతి విగ్రహ మొబ్బుకొని వచ్చినది. ఆవిగ్రహము, స్తంభము పైభాగమున నొక శిల్పి మలచి నట్లున్నది. దానిని చూచినంతనే స్వామికన్నులు బైరులు గ్రమ్మెను. తలచుట్టు కొని వచ్చి నట్లైనది. వారు నేలపై నొరగిరి. నారాయణశాస్త్రి పరుగెత్తికొని పోయి నీరు తెచ్చి వారి ముఖముపై జల్లెను. స్వామి కెచ్చరిక అయ్యెను. వారట్లేమాన ముగ గణపతి విగ్రహము వంక చూచుచు కూర్చొనియున్నారు.

ఆ కంబములోని గణపతిదొకకథ. ఆవిగ్రహము క్రీ॥శ॥ 1599లో గురుపీఠము నలంకరించిన యభినవ నృసింహ భారతీ స్వాములు చిత్రించి యుండిరి. వారొకసారి మల్లికార్జున దేవాలయమునకు వచ్చిరి. ఈవిచిత్రస్తంభమును చూచినారు. వారపుడు దానిపై బోలుగానున్న భాగమున బొగ్గుతో నొక గణపతి ప్రతిరూపమును వ్రాసిరి. శిష్యులతో నన్నారు.

"ఈగణపతి. చైతన్యమునంది కంబమునుండి గడ్డకువచ్చినపుడు ప్రళయము వంటి యాపద మూడును" ఇది భవిష్యద్వాణి. ఈ విషయము పరంపరాగతముగ నందరు స్వాములకును తెలిసినదే. అభినవ నృసింహ భారతీస్వాములు చెప్పినట్లే ఆ యాకారము క్రమముగా పైకుబుకుచు వచ్చినది. నేటికాయుబుకుట పూర్తియైనది. బొగ్గుతో చిత్రింపబడినం యాకృతి, యొక విగ్రహము వలెనైనది. ఆగణపతి కన్నులలో నగ్నిశిఖలు వెల్గుచున్నట్లుండెను. తనకేదో యాకలి యగుచు

చున్నట్లు — ఆహారమాహార 'మన్నించి నోరు దెఱచు. చున్నట్లు
శృంగేరి కిక ప్రళయము దప్పదని సచ్చిదానందులు శోకించుచు
కొనిరి. ఈవిషయమును స్వామి వివరించినపుడు — నరసింహ,
నారాయణశాస్త్రిలు నిశ్చేష్టులైనారు. వారి మానసి కావస్థను
గమనించిన స్వామి యిట్లనిరి.

"నరసింహశాస్త్రీ! శృంగేరి యనాదికాలమునుండి పుణ్య
క్షేత్రము. ఇది శంకర భగవత్పాదుల పదార్పణ మొనర్చిన నేల
ఇక్కడ నద్వైత సింహాసనమున్నది. విభండకముని, ఋష్యశృం
గుడు, విద్యారణ్యులు, మొదలగు మహర్షుల ప్రభావమీ క్షేత్ర
మునకురక్ష; ఈ స్థలమున నేయపాయమును కలుగకుండుటకై
నాల్గుదిక్కులయందును. భద్రకాళి; కాలభైరవుడు, దుర్గ,
ఆంజనేయులు నిల్చికొన్నారు, నమ్మినభక్తుల నుద్ధరించుటకు —
కైదండనొసంగి కాపాడుటకు — చంద్రమౌళీశ్వరుడు. సన్నిధి
చేసినాడు. ఇంతయైనను, మనయజ్ఞానము, అవివేకము మొదలగు
వానితో ధర్మక్షయ. మేర్పడినపుడు. దుష్టశిక్షణార్థము, శిష్ట
రక్షణార్థము, పరమశివు డేరూపమున నవతరించునో చెప్పుట
కష్టము. విధిలిఖితము నెవ్వరును తప్పించుకొనలేరు. ఉన్న రక్ష
ణోపాయ మొకటే. జగదంబకు శరణాగతుల మగుట. రాబో
వునాపత్తు నెదురించుటకు సాధ్యమైన ప్రయత్నమొనర్తము.
ఫలాఫలములను దైవేచ్ఛకువదలి నిశ్చింతముగా నుందము.
చింతింపవలసినదిలేదు. ధర్మశ్రద్ధను. భక్తిని పరీక్షించుటకు
చంద్రమౌళీశ్వరు డొనర్చుచున్న యగ్నిపరీక్షయిది. దీనిలో

మనమోడిపోరాదు. దానిని ధైర్యముతో నెదిరింతము"

స్వామి వారినోదార్చెను.

"అదేదినము స్వామి శృంగేరి సంస్థానమునందలి యన్ని దేవాలయములందును. విశేషపూజలు నడపుట కాజ్ఞ పెట్టెను. అహోరాత్రిములు, అన్నదాన వస్త్రదానములు నడుపవలెనని వారియానతి; ఒకవేళ శత్రువుల నెదురించునవసరము గలిగిన చో — జనము సిద్ధముగ నుండవలెనని తప్పెట వేయించిరి. శృంగేరి పీఠమున; కపాయము గల్గినచో దానిని తక్షించుటకు సైన్యము నంపవలెనని — సులతానునకు శ్రీముఖ మానాఁడే వెళ్లినది.

౮

మరాటాదండు పరశురామభావే నేతృత్వమున మైసూరు పైకెత్తి వచ్చెను. తోవ పొడగు నను, జరిగిన దోపిడు లకు లెక్క లేదు. సంపద్భరితమైన మైసూరు సీమ-పాండవ బీడైనది. మైసూరు కొల్ల గొట్టినాడు. అంతలో నూరకుండ లేదు. బిదనూరుపై ఎత్తెను. ఒకప్పుడది "బిజాపురము" నకుఁ జేరి యుండెను. నేఁడు బిజాపురము-మహా రాష్ట్రిల దైనది. అగుటచే బిదనూరు గూడ వారికే కావలెనని పట్టుదల. ఈ యుద్ధమునకు గల కారణములలో నదియు నొకటి.

మహా రాష్ట్రిల ప్రధానోద్దేశము—టిప్పు నోడించుట గాదు. మైసూరు రాజ్యము యొక్క—ప్రాశస్త్యమును దగ్గిం చుటయు గాదు. మిత్రులగు నాంగ్లేయులకు దోడుపడు చున్నా

మనుట—వారు కట్టిన వేషము. ఒకప్పుడు—చేయి విడచి పోయిన హిందూ రాజ్యములను మగిడి రాబట్టు కొనుటయును గాదు. ఇవన్నియు నాను షంగికము లైన కారణములు. వారి ప్రిదానోద్దేశము దోపిడి. ఈప్రియత్నముతో వారికి—అయిన వారు కాని వారను—వింగ డింపు లేదు. చేతికి దొరకిన దంతయు దోచి కొందురు. ఈవిషయమున వార ద్వైతులు. మైసూరు పైకి వచ్చు నప్పుడు వారు త్రోవలో కంటబడిన పల్లె నంత యు—నాశము చేసినారు ఇష్టము వచ్చి నట్లు దోచిరి. సాధ్య ముకాని వారికి నిప్పంటించిరి. “ఇది యేమి, యన్న వారి నెల్ల చంపిరి. వారి యమానుష వర్తనము లను కథలుగా విన్న జనులు మహా రాష్ట్రిలు —దైత్యులనియే భావించు చుండిరి. వారిని జూచిన వెంటనే,—వారికి చెల్లింప వలసిన దంతయు నొసగి తమ్ము రక్షింపుడని బ్రితి మాలు చుండిరి. మహా రాష్ట్రిలొక్కొక్కప్పుడు వారి ఖడ్గము లకు రక్త దాహ మెత్తి కొన్నప్పుడు—వీరి బ్రితి మాలుట లను లెక్క చేయరు. అట్టి యెడ జనులు పరుగెత్తి కొని పోవు చుండిరి. తప్పించు కొన్న వారు తప్పించు కొందురు. సాధ్యము కాని వారు— మృత్యుదేవి యంక పాళిపై నిదురింతురు.

అప్పటి పరిస్థితియు నట్లే యుండెను. మహా రాష్ట్రిలు హిందూ రాజ్య స్థాపనకై —హిందూ ధర్మ సంరక్షణకై యొకటిగా గూడు కొనిరి. తమ రక్షణకై శస్త్రమును పట్టిరి కాని కాల క్రిమమున నాభావము పోయినది. ఇప్పుడు వారి

పరిపాలకు లధికారోన్మతులు. దురాచారమే వారి ధర్మము. కామోపభోగమే వారి యాశలకు పరాకాష్ఠ. శివాజీ మహారాజు పట్టిన యాధర్మము కథీకృతమైనది. అధికారము లకై వారొకరితో నొకరు కలహించికొను చుండిరి. మదిరాపానము నిత్యకృత్యమైనది; దుర్వ్యసనముల కలవాటుపడిన వారికి—దండిగా డబ్బుకావలెను. అందులో రాచవులాయెను! డబ్బెట్లు వచ్చును? ధనమును వారేమార్గముచేతనైనను—సంపాదింప జూచుచుండిరి. ఈరీతిగ వారి యంతస్సత్వమెన్నడో మంటఁగలసినది.

శివరాజు కాలమున, హిందూధర్మ సంరక్షణమునకై కంకణమును కట్టుకొని స్వారాజ్య, స్వధర్మములని కలవరించుచు మహాత్యాగముల నొనర్చినజాతి — నేడు హింసావాదమునకు లాలసతకు — స్వేచ్ఛాచారమునకు ప్రతీకమైనది. వారిసైన్యములలో ననేకులు పర్వతభూములలో నివసించుచుండిరి. మావళేలు — పిండారీలు—ధగ్గులు—సామాన్యులుగారు. వారు చిచ్చఱపిడుగులు. కాని లాభమేమి? వారిశౌర్యము లపమార్గమును బట్టినవి. వీరికి నాయకుడు — రఘునాధరావ్ కరండవాడ్కర్, నికిస్త్రీలయంగాంగ సౌందర్యమే ధ్యేయము. కామసంతృప్తియే యనుపానము. •డనుసరింపని నీచమార్గము లేదు. ఆదరింపని దురాచారములేదు వానికంటెను—వాని యనుయాయులావిద్యలలో నింకను ఘనులు. వారూర్లపై బడి కొల్లగొట్టుచుండిరి. ఆధనముతో — దళపతులను-దండనాయకులకు భాగ

ములు. పీష్వాలును భాగస్వాములే. ఇఁక వీరిని దండించుటకు వారికి నోరేదీ? అంతమాత్రమేగాదు. యీ నీచకార్యములకు పరోక్షముగ – పీష్వాల యంగీకారమే కనచము.

ఇప్పుడు వీరి దృష్టిని "శృంగేరి" యాకర్షించినది. శృంగేరిపైకి శతృవులు దాడివత్తురని యెవ్వరును భావింపలేము; మహారాష్ట్రులు హిందువులు గదా! శృంగేరి హిందువులకు ధార్మిక క్షేత్రము. సాంస్కృతిక క్షేత్రముగూడ. దానికి "దక్షిణ కాశీ"యని పేరు. ఆ శారదా పీఠమునకు–మైసూరులోనే కాక–మహారాష్ట్ర దేశమునను–శిష్యులుండిరి. శిష్యుల ధార్మిక జీవనముపై–స్వామి కధికారముండెను. బ్రాహ్మణులలో తక్కిన రెండు మతములవారును – శారదా పీఠమును గౌరవించుచుండిరి, ఆదిశంకరులు స్థాపించిన పీఠములోఁజేరినది యగుటచే–దానికి భారత దేశమంతయు గౌరవముండెను. ఆమఠమునకు భూములు–దక్షిణ దేశమంతయుఁ గలవు. మహారాష్ట్ర దేశమునగూడ నుండెను. ఆ పొలములను సంరక్షించి–వాని యాదాయమును మఠమునకు వచ్చునట్లు జేయుట–మహారాష్ట్రుల ధార్మికమైన బాధ్యత. ఇన్నిరీతుల – హిమాలయము నుండి–రామసేతువు వఱకును–పేరుప్రతిష్ఠలు కలిగిన మఠముపైని హిందువులేయైన మహారాష్ట్రులు దండెత్తి వత్తురని కలలోగూడ నెవ్వరు భావింపలేదు.

ఆనాడు స్వామి చంద్రమౌళీశ్వరుని పూజకు సిద్ధమగుచుండెను. శిష్యుడొకడు పరుగెత్తికొనివచ్చియిట్లనెను.

"గురుదేవా! అన్యాయమైనది. అనాహతమైనది. మరాటాదండు నదినిదాటి శృంగేరిపైబడ వచ్చుచున్నది. పిండారులు, థగ్గులుగూడ శారదాపీఠమును దోచుటకు తయారై యున్నారట! ఇప్పుడు మనలను—ఆ చంద్రమౌళీశ్వరుడే కాపాడవలెను."

"ఎవరు చెప్పిరి?"

"కిగ్గ"నుండి వచ్చిన జనులు చెప్పిరి. దానిని మహారాష్ట్రులు నాశమొనర్చిరట! కంటబడిన వానిని దోచికొన్నారట. ఎదురించినవారిని ఘోరముగ జంపినారట! శారదాపీఠముపై బడవలెనని యుఆకలు వేసికొనుచు వచ్చుచున్నారట"

"ఈమాటలువిని స్వామి యాలోచనా నిమగ్నుడయ్యెను." కొంతసేపైన తర్వాత నరసింహశాస్త్రిలను పిలిచి కొని రమ్మన్నాడు.

సర్వాధికారి నారాయణశాస్త్రితోపాటు వచ్చెను. "కిగ్గ"లో నడచిన దురాగతమును వారుగూడ విన్నారు. ఆవిషయములనే మరల స్వామి తెలుపుట—చర్విత చర్వణమై యుండెను. ఇంతలో "విద్యారణ్యపురము" నాశమైనదన్న వార్తయు వచ్చెను. మహారాష్ట్రులు శృంగేరి దరిదాపులకు వచ్చినట్లే...

"ఇపుడేమి చేయవలెను?" అనుప్రశ్న యందరి హృదయముల నాక్రమించినది. ఎంతయోచించినను వారికే పరిహార

ముచు తోచలేదు. తమ యసహాయతకు లోలోన దుఃఖించుచు మౌనముగ గూర్చున్నారు. స్వామి యున్నట్లుండి యిట్లనెను.

"శివా! ఇదంతయు నీలీల. నీవీశిక్షయొసగుటకు మే మొనర్చిన యపరాధమేమి? తల్లీ! శాంకరీ! నీ సంతానము చేసిన తప్పునకు వారిని రక్షింపవలసిన నీవే శిక్షించుటకు బూనుకొన్నావా? భవతారిణీ! ఇదియు నీలీలయే. జగత్తున ధర్మక్షయమైనదా? గ్లానియేర్పడినదా? నీయవతారమునకిదే సమయమా! తల్లీ! భారతీ! యెవరో కడు జాల్మురైన రాక్షసులపై బ్రియోగింప వలసిన యీ యుధములను—మాపై నేల యెత్తితివి తల్లీ! మానవుడు నీ సృష్టిలోనియణువు. వానిశక్తి యెంత? వాడు నీ సృష్టికొనర్చు—నీకుగావించు నుపకారాప్యాపకారము లేపాటివి? నలుగురు స్త్రీలను జెఱచును; నాలుగుకాసు లెక్కువ సంపాదించి కొనును. ఆపాటికే నీకింతకోపమా? అవి చలితమైన నీ భక్తినిమ్ము. సుఖమునందు దుఃఖమందు నిన్ను మఱువని నీతలపునకు భిన్నమైన తలపు లేని—మనస్సునిమ్ము. నీవు భక్తవశంవదవు. మమ్మునీభక్తులుగా నొనర్చి కొనుము. ఇంతకు తీవ్రముగ విచారించికొన్నచో నే నెవ్వడను? నేనునీవే! జననీ! నాకు పాపపుణ్యముల సంబంధము లేదు. దుఃఖములేదు. అసుఖములేదు. ప్రకృతిలేదు. జీవభావము లేదు. ఈ సత్యమును వ్యాఖ్యానించుటకే యీ పన్నివేశమును గల్పించి యున్నచో—నేనందుకు సిద్ధమే. ఆత్మబలదానమునకు జంకను. జగన్మాతా! నీయిచ్ఛయేమి? అందుకు నేను—సర్వాత్మనా సిద్ధము.

సచ్చిదానందుల కన్నులనిండ—ప్రాతర్వికసిత తామరస సంసక్త హిమసుందరములు నీరునిల్చినవి. ఇదంతయుఁజూచు చున్న సర్వాధికారియిట్లన్నారు. "గురుదేవా! ఇది శోకించుచు గూర్చుండుటకు సమయముగాదు. కార్యోన్ముఖులము గావ లెను. ఇదంతయు జగన్మాతయొక్క దివ్యలీలయేయైనను—మాన వునకు ప్రత్యేకమగు నహంతమున్నది. పురుషకారమున్నది. అయినచో నేనిప్పుడేమి చేయవలెను."

"భైరవనాయకుని శిక్షించుటకు పూజ్యులైన నృసింహ భారతులు దండ కమండలుమాత్రధారులై తపస్సు బాసటగా వారి శిబిరమునకే వెళ్లిరి." నేనట్లు పరశురామ భావేకడకు పోవుదునా? ధర్మద్రోహియైన యీ మహారాష్ట్రుని ముఖమును జూచునంతటిశాంతి నాకులేదు. నృసింహభారతులు మహనీ యులు. నాతపఃఫలమును ధారబోసి యీ పీఠమును రక్షిం తునా? అమాయకులైన ప్రజలను—శత్రు ముఖమునుండి రక్షిం చుటకై తపస్సును వెచ్చింతునా? ఎన్నిపనులు చేయుదును?"

"స్వామీ! నేను మీకేమికర్తవ్య ముపదేశింపగలను? మీరు మహాతపస్వులు. ఆశక్తితో నేమైనను చేయగలరు. కాని ఈ యల్ప కార్యమునకై మీ తపస్సును వ్యయించుట న్యాయముగాదు. పూజ్యులైన నృసింహభారతులు గూడ "యిక్కేరి" సదాశివనాయకునితోఁ జెప్పి దుష్టులైన భైరవ నాయకుని తమకు పాదాక్రాంతునిగాఁ జేసికొన్నారు. అట్లే

మీరును సుల్తాను సాయముతో మహారాష్ట్రులకు బుద్ధివచ్చు నట్లు జేయవలెను.”

“అంతలో మహారాష్ట్రులదండు శృంగేరిని ముట్టడించి యున్న సంపదయంతయు దోచి క్షేత్రము నపవిత్రమొనర్చి నచో నేమిచేయవలెను?” నారాయణశాస్త్రి యడిగెను.

“అవును; అతడన్నదియునిజమే. సులతాను సైన్యములు వచ్చునంతవరకు మనలను మనము రక్షించుకొనవలయును?”

“ఏమిచేయుదము! వారు శస్త్రధారులు. మనము వారి నెదురించుటెట్లు? మనదగ్గర-ఆయుధములేవీ? ఉన్నను-మనకు శస్త్రధారణ సమర్థతయేదీ? ఒకవేళ మొండిగా నెదురించినను మనలనందరిని వారు గడియలపైన జంపివేయుదురు.” నారాయణశాస్త్రి, సర్వాధికారికిచ్చిన యుత్తరమిది.

“ఈ విచిత్ర పరిస్థితులలో నేమి చేయవలెనో తోచక, స్వామి యోచించుచుండిరి. సర్వాధికారి యిట్లు పలికెను.”

“స్వామీ! నామాటలు మీరన్యథా భావింపరాదు. ఇప్పటిలో మనము శత్రువుల నెదిరించి ప్రయోజనము లేదు. వారు శస్త్రప్రాణులు. అనేకులు ధర్మమునకును, దైవమునకును భయపడనివారు; ఇక్కడనుండి మనము తప్పించుకొనిపోయి టిప్పుసులతానుసాయమున వారిని జయింపవలెను, అదొక్కటే సరియైన మార్గముగా దోచుచున్నది.”

“ఆపత్కాలమున నింతమందిని నిరాశ్రయులనుగావదలి

మనము మాత్రము తప్పించుకొని పోవుటలో నాకు ధర్మము కనిపించుటలేదు."

"గురుదేవా! ఈ సమయమున ధర్మాధర్మ మీమాంస కాల హరణము; శత్రువులకు మనముజిక్కినచో వృథా మాన హానికి పాల్పడ వలసి వచ్చును. ఇచట నుండి తప్పించు కొని నచో బయట నుండి కొంతకార్యమును. సాధించ వచ్చును శ్రీమఠ క్షేమమునకై, లోక క్షేమమునకై, మనమిప్పుడు తప్పించుకొనుటయే నీతి. పరిస్థితు లనుకూలముగ నున్నపుడు—మరలరావచ్చును."

స్వామి యోచించు చుండెను.

గురుదేవా! సర్వాధి కారులన్న మాట నిజము, మీరొక్కరు సజీవులుగ నున్నచో మేమందరము మరణించినను బాధ లేదు. మీరు వారి చేతికి చిక్కి యవమాన మొందరాదు. ఇప్పుడు తామదృశ్యులగుటయే కర్తవ్యము."

"నారాయణ శాస్త్రియు నామాటకు బల మొసగెను

ఈమటలతో స్వామికి బాధకలిగినది.వారనిరి "మీసూచన మంచిదే. కాని ఈపరిస్థితులలో నన్నునమ్మిన మిమ్మందరి నివదలి నేనొక్కడనే బయటపడుటధర్మముగా గన్పించుటలేదు. మీకైనగతియే నాకునుగలుగుగాక; ఆశిక్ష నేనుగూడ యనుభవింతును. "ఈమాటలనుచు, వారుమఠములోనుండి బయటకు వచ్చిరి. నరసింహశాస్త్రి నారాయణతోనననెను.

"నారాయణా! స్వామి యీవిషయమున హఠముబట్టి

నట్లున్నది. వారికి నేనునచ్చజెప్పి వారిరక్షణకుదగినయేర్పాటులు జేయింతును. నీవు వెంట నేపోయిపరిస్థితినివివరించుచు, సుల్తానుల కుజాబువ్రాయుము. తరువాత వెలగల వస్తువులనన్నిటిని—ఒక సురక్షితమైన రహస్యస్థలమునకుఁ జేర్పుము. వచ్చినవిపత్తును దెలిపి—జాగ్రత్తగనుండవలెనని యూరిలోఁ జాటింపుము. శృంగేరి గురు పీఠమునకు—అధూర్తులతో నేమియునపచారము గల్గ కుండునట్లు—ఊరిలోనున్న బలిష్ఠమైన యువకులనందరినిఁ జేర్చి మఠమున కావలిపెట్టుము. ఇంతలో నేను స్వామిని సురక్షితస్థల మున వదలి, మరలనిన్ను గలిసికొందును."

ఈ మాటలకు నారాయణశాస్త్రి సమ్మతించెను. ఎవరి పనులలోవారు నిమగ్నులైరి — ఇంతలో నూరిలో గద్దలము మొదలైనది. జనులు చిక్కినదిక్కు పట్టుకొని పరువెత్తిరి. నారాయణశాస్త్రి "సమాచారమేమ"ని విచారించెను. శత్రు సైన్యములు శృంగేరిని ముట్టడించెనని తెలిసినది. ఊరిలో దోపిడులు సాఁగుచుండెను కనపడినవారిని — కత్తికి కండగా నఱకుచుండిరి. నారాయణశాస్త్రికి భయమైనది. అతడు శ్రీము ఠమువైపు బర్వెత్తెను; అది నిర్మానుష్యమైనది. స్వామిగాని వారి పరివారముగాని కన్పింపలేదు. సర్వాధికారి యింటివైపు బరువిడెను. అతడులేడు. వీరందరేమైనట్లు? ఈ పశ్నకు తర మెవ్వరు చెప్పెదరు?

ఊరిలో నొకటే హాహాకారము. రోదనధ్వానము. "చంపు" "నఱకు", "దోచుకో" అనుధ్వను లాకసము నంటు

చుండెను. ఒక్కొక్క సైనికుడొక పిశాచివలెనుండెను. స్త్రీలు వీధులఁబడినారు. తోచినట్లు పరుగెత్తుచుండిరి; మహారాష్ట్రులా స్త్రీలను వెన్నాడుచుండిరి.: కొప్పులు పట్టుకొనియీడ్చి నఱకుచుండిరి. అందమైన స్త్రీల నెత్తుకొని పోవుచుండిరి. ఈదృశ్యమును నారాయణశాస్త్రి చూడలేకపోయెను. ఆతఁడు — ఖడ్గమునుగైకొని, దేవాలయమువైపు పరువిడెను అప్పటికే యాలయము చుట్టును, క్రిమ్ముకొన్న సైనికులు వారు లోపల దూరి దేవునికి ధరింపఁజేసిన యాభరణములను దోచుచుండిరి. దేవికట్టిన పుట్టములనుగూడ మిగుల్పలేదు. గుడిలోనున్న పురాతనమైన విగ్రహము నెత్తి నదిలోఁ బారవైచిరి.

మహారాష్ట్ర సైన్యమునకు — యొక నాయకుడుగూడ నుండెను. అతనిపేరు దాదాసాహేబు, అతని యధికారమున సైన్యములు ప్రతియింటిని — గుడిసెనుగూడ వదలక — ముట్టడించుచుండిరి. ఇంటిలోని వారినందరిని—బయటికీడ్చుకొని వచ్చి—వరుసగా నఱకుచుండిరి. చిన్న శిశువులనుగూడ వదలుటలేదు; జనులు ప్రాణభీతితో — యింటిలోని వస్తువులను వదలి—ఉన్నదున్నట్లే పరుగెత్తుచుండిరి. వస్తువులేమి? తల్లిలేదు పిల్లలేదు; భర్తలేదు. ఎవరిరక్షణము వారిదై యుండెను. మానహాని నోర్వని వనితాజనములు — తుంగానదిలోఁబడి ప్రాణములను వదలుచుండిరి. నీచులైన మహారాష్ట్రులొక యాలయమును గూడ వదలలేదు. అన్నిటిని నిష్కరుణముగ దోచిరి. మఠము పైబడి - వెండి బంగారు. 'దోచికొన్నారు. వెంటదీసికొని

పోవుటకు - సాధ్యముగాని పదార్థముల కగ్గిపెట్టిరి. శృంగేరి పీఠాధిపతుల యింటిపై దాడిచేసినారు. స్వామి యక్కడ లేరు పిట్టయెగిరి పోయినది. మహారాష్ట్రుల కోపమునకు మితిలేదు. వారాయింటిని నేలమట్టమొనర్చిరి.; కంటబడిన కాషాయము లను చించిరి దండ కమండలములను విఱిచిరి. శారదాదేవి కిరీటము, కర్ణకుండలములు, ముక్కుఱ, మాంగల్యము, దోచినది గాక యామె జలతారు పీతాంబరమునుగూడ కొల్లగొన్నారు గుఱ్ఱములను, యేన్గులను, వెంట - తోలుకొని పోయిరి. భారతీస్వాములకడ నొక బంగారుపల్లకి యుండెను. దానికి రత్న ములు జెక్కియుండిరి. ఉత్సవములలో మాత్రమే దానినివాడె దరు. ఆపల్లకిని వశపరచుకొనిరి. ఎక్కడఁ జూచినను పాశవిక నటనములు పాఱుచున్నరక్తములు. పేరుకొన్న మాంసములు.

సర్వాధికారిని వెదకికొని వారియింటికి వచ్చినప్పుడు, నారాయణశాస్త్రికొక - హృదయవిదారకమైన దృశ్యము గను పించినది.

మహా రాష్ట్రులు సర్వాధి కారి యింటిపై బడి సంపద నంతయు గొల్ల కొని, యాయింటి కగ్గి పెట్టినారు. ఆయింటి కోడలిపై నత్యాచారమొనర్పఁ బూనుకొనిరి. వారినడ్డగించు టకు వచ్చిన - చంద్రశేఖరుడు - విచ్చుకత్తికి బలియైనాఁడు. ఆసాధ్వి-యాదృశ్యమును జూడలేక గుండెగుద్దుకొని చచ్చెను. నారాయణశాస్త్రి కీసన్నివేశమును గాంచి, కండ్లుతిరిగినవి, అతఁడుతన యింటిదారిఁబట్టిపరువిడెను.

అక్కడ-అంతకంటెను భయంకరదృశ్యము వానికొఱకు గాచికొనియున్నది. తనయన్న శ్రీకంఠశాస్త్రి-కత్తిపోటులతో నేలపైఁబడి పొరలుచుండెను. అతనిచుట్టును-రక్తపుకాలువ. శ్రీకంఠుని కన్నులయెదుటనే వానిభార్యనుచెఱచిరి. మాన భంగవ్యసన విదీర్ణహృదయమైనయామె-నదిలోఁబడి ప్రాణము లు వదలెను. ఆదృశ్యము నారాయణశాస్త్రివచ్చుటకుముందే జరిగినది. వానికన్నులయెదుటనే-యీఘట్టము జరిగియున్న వా డేమైయుండునో!కొఱప్రాణముతోనున్న శ్రీకంఠుడు-తమ్మునకీకథయంతయు నతికష్టముతో నెరిగించెను. కడకువాడిట్లనెను.

"నారాయణా!నీవుమహారాష్ట్రులపైపగదీర్చికొనవలెను. మనకష్టములకన్నిటికిని కారణమైనదాదాసాహెబు, పరశురామభావేశరీరములు-యిటురక్తసిక్తములై-నేలపై పొరలాడిననాడు నాయాత్మకుతృప్తి"

శ్రీకంఠుడుమరణ-బాధతో గిలగిలలాడుచుండెను.

"అన్నా! నామేన నూపిరి యున్నంతవఱకు నీకుచేసిన ప్రతిజ్ఞ తప్పను. వారిని నాశముచేసి తీరెదను. ఇఁకమీఁద నాకిదే పని. శారదాదేవితోడు-యీమాటసత్యము."

శ్రీకంఠుడు,తృప్తిగా నిటూర్చెను. ఆనిట్టూర్పులోనే ప్రాణములుపోయినవి.

౯

అతనిముందొక పెద్దసమస్యనిలచికొన్నది. శృంగేరిపై దాడి జరిగినపుడు,స్వామియేమైరి?సర్వాధికారి యెటుబోయెను?

వారికొఱకాతఁడూరంతయు వెదకెను. వారియాచూకియే తెలి
య లేదు. భారతీస్వామిబ్రతికియున్నదియు—చచ్చినదియు దెలి
యదు. కాని,తనమనస్సుమాత్రము — వారు జీవించియున్నార
నుచున్నది. ఒక్కొక్కప్పుడు మనస్సు—నిక్కచ్చిగా—సత్యమును
పలుకును. సర్వాధికారి యెచ్చటనైనను రహస్యముగా దాగి
కొనియుండవచ్చునని—అతని పోలకువల నారయుచు—నారాయ
ణ శాస్త్రి 'శృగేరి'లోనే యొకటిరెండుదినములుండెను. అత
ని ప్రయత్నము వ్యర్థమైనది. సర్వాధికారిగూడ మరణించినాడా?
బ్రతికియున్నాడని మనస్సు బదులొసగు చుండెను. అతడు స
చ్చిదానందస్వాముల నే—నీడవలె ననుసరించి యుండును;
వారి యదృశ్యము గూడ—హఠాత్తుగా జరిగినది. ఎక్కడికి
వెళ్ళి యుందురు? ఎంత యోచించి నను దీని కుత్తరమే
దొరక లేదు. మహారాష్ట్రులు శృంగేరి నుండి—సుమారు అరు
వది లక్షల రూపాయల వెలచేయు సామానులను దోచికొని
పోయిరి. వారు పోయిన తర్వాత నైనను స్వామి యూరికి
రాలేదు. మరి యిట్టిచో—తాను శృంగేరిలో నుండి యేమి
చేయ వలెను? మొదట భారతీస్వాములను గూర్చి—విచారింప
వలెను. అటుపైని—తన యన్న కొసంగినప్రతిజ్ఞ నెర వేర్ప
వలెను. మానభంగ శతధా విశీర్ణ హృదయ మైన తన
వదినె—హృదయమున భాసించి నపుడంతయు నారాయణ
శాస్త్రి—కన్నీటి ముద్దయగు చుండెను. దాదాసాహేబు పరుశు
రామభావేలను — పేయిరీతుల శపించు చుండెను. వారిర్వురికి—

బుద్ధిగఱపవలెను. మహారాష్ట్రులను నాశము చేయునిది – తన యున్నకు శాంతిలేదు. ఇంతలో. వానిహృదయాకాశమున తళుక్కున నొక మెఱుపు మెరసినది, ఆమె భారతీదేవి. ఆవిడ బ్రిగకియున్నదా? ఆయూరిపై గూడ – మహారాష్ట్రులు దాడి వెట్టిరి. ఊరంతయు నాశమైనదట! తనమామగారి కథయేమై నదో? వారి యింటినిగూడ దోచుకొన్నారా? నారాయణ శాస్త్రి – యింతటి దుఃఖములోగూడ యొకసారి నవ్వుకొన్నాడు, తనపిచ్చిగాక – ఊరంతటిని దోచుకొన్నప్పుడు తనమామగారి యింటిని మాత్రము వారేల వదలియుందురు? మరి తన భారతి యేమైనది? నారాయణశాస్త్రి "కిగ్గ" గ్రామపు దారి బట్టినాడు. ఆయూరిపేరనుకొన్నంతనే అంతటి ఆవేదనలోగూడ వాని వొడలు పులకరించెను. ఆపేరు వాని మధురస్మృతులను, రెచ్చగొట్టువసంతము; భారతి తనభార్య ఇక కొన్నిమాసముల కామె తనయింటికి వచ్చును. అనాఘ్రాతకుసుమమైన దాని యౌవనమును, తాను యొకసారను భవించును. ఆమధుర సమాగమమునకై వాడు రేబవళ్లెదురు చూచుచుండెను. చాతక పక్షివలెఁ గాచికొని యున్నాడు. ఇక నేమున్నది? రెండు సంవత్సరములు చూచుచుండగనే గడచిపోవును. ఆతరువాత తనజీవనమున నవవసంతోదయము.

వానిమధుర స్వప్నము చెల్లాచెదరయ్యెను. గ్రామము నుండి దారుణవార్తలు వినవచ్చెను.

నారాయణశాస్త్రి 'కిగ్గ'కు వచ్చి చూచినపుడు అదిస్మశా

నష్టమై యుండెను. ఇండ్లన్నియు నేలమట్టమైనవి. కొన్ని పూర్తిగా పాడువడకున్నను — నివాసమునకనర్హములై యుండెను ఊరిలోనొకపిట్టలేదు; కొందరు మరణించినారు, తక్కినవారు పరువెత్తినారు. పడియున్న శవములను గ్రద్దలుపీకికొని తినుచున్నవి. మానవుని యహంకారము నవి సవాలు చేయుచున్నట్లుండెను. పడినవారిలో కొన్ని స్త్రీశవములు. అవి మహారాష్ట్రసైనికుల యత్యాచారములకు బలియైనవి. ఆశవములకు మానము లేదు. అభిమానము లేదు. అవి — అనేక విశ్వాసములను సాలీనిగూటిని వలె నల్లుకొన్న మానవజీవితమునే వెక్కిరించు చుండెను. కొన్ని స్త్రీశవములు నదిలో తేలియాడు చున్నవి; వారందరును మానహానికి భయపడి, నదిపాలైనారు; చచ్చినతరువాత వానికి మానము లేకుండెను.

'శాస్త్రి' తనమామ యజ్ఞనారాయణ దీక్షితుని యింటి ముందు నిల్చికొన్నాడు. ఇల్లు సంపూర్తిగ నాశమైనది. పనికి రాని వస్తువులన్నియు. చెల్లాచెదరుగఁ బడియున్నవి. వీధియంతయు దుర్గంధ భూయిష్ఠము. దారుణముగ నఱచుచున్న కుక్కలు శవములను భక్షించుటకై యవి పరస్పరము పోట్లాడుకొను చుండెను. వానికి చచ్చిన శవముల చింతయేమి గాఁబట్టినది? తాము చావలేదుగదా? అందుకై యవి! చచ్చినవారి శవములలో నెక్కువభాగమును. సంపాదించి కొనుటకు — తెగించి పోరుచుండెను? ఓహో! ఎంత చిత్రమైనదీసృష్టి! ఎంత కరుణాజనకము! వారిలో కొందరు ముదుసళ్లు. కొందరు శిశువులు.

శాత్రవులు వారినెందుకు చంపిరి? వారు తమకే యాపదయును గలిగింపలేదు గదా! ఈప్రశ్న కుత్తరమెవ్వరిత్తురు? ఎవరికిఁ గాబట్టినది గనుక! వారు చంపుటకొఱకై చంపిరి. అది నిష్కామకర్మ. మానవుఁడు పిశాచియైనపుడు — హేతువాదమేముండును? నారాయణుఁడు — తనమామ యింటిముందు నిలిచెను. తన్ను పలుకరించుట కందులో నెవరున్నారు? తనభారతి యేమైనట్లు? ఆమె బ్రతికినచోఁ దనకడకు వచ్చియుండెడిది. ఆమె సైనికుల యత్యాచారములకు బలియైయుండును. ఈయూహ నంగీకరించుటకు వాని మనసొప్పలేదు. అసహాయస్థితిలోఁగూడ మానవుని యహంకారము "నేనున్నానను, భారతి తనది; అందుచేనామె కట్టిస్థితి రాఁగూడదని వానియాశ. రానివ్వరాదన్న ధర్మదృష్టి, రానివ్వనను సంకల్పము. ఈత్రిపుటియే యహంకారము. వాడాయూరిలో నాలుగువీధులును జుట్టెను. ఎంతసేపని చుట్టఁగలఁడు; వచ్చినదారిఁ బట్టి మరలెఁ నాఁడు. కొంతదూరమేఁగు నప్పటి కెవఁడో యెదురుపడెను. శాస్త్రి యిట నెను.

"యజ్ఞనారాయణ దీక్షితులేమైనాడు?"

"ఏమైనాడు? అందరేమైనారు? చచ్చినారు. అతఁడు గూడచచ్చెను." ...నికెవ్వరేమాట యడిగినను — కోపము ...చ్చునట్లున్నది.

"అతనిబిడ్డ?"

"అదియే చెప్పుచున్నాను. అతనిబిడ్డ భారతిపై సైనికులు

బడిరి. అతడు వారినెదిర్చెను. ఇంకేమున్నది? సైనికులతనిని నఱికిరి”

“భారతి బ్రతికిలేదా?” నారాయణశాస్త్రి యేడ్చుచునే యడిగెను.

ఆకొత్తవాడేమ్చుట లేదు. వానికన్నీరింకి పోయినది. వానిది నిండు సంసారము; చేతి కెదిగిన నలుగురు కొడుకులు. ఆకల్లోలమున నల్వురును జచ్చినారు. నాలుగవ కొడుకుకు పెండ్లి కాలేదు. ముగ్వురు కోడండ్ర మానములు తన యెదుటనే తీయ బడినవి. వానికి ఇర్వురు కూతుండ్రు. వారిలో నొకతె తల చెడినది. దానిని తన యెదుటనే నఱికిరి. ఇన్ని దృశ్యములను వాడు తన కన్నులతో చూచెను. తన్ను నఱుక వచ్చునంతలో పరువు పెట్టినాడు అప్పుడు ప్రాణములపై తీపి; అప్పుడు మరణ మన్న భయము. సైనికుల నుండి తప్పించు కొని, జరిగిన దృశ్యము లను తలచి యేడ్చి కొన్నాడు. తాను బ్రతికి నందులకు—తన్ను తాను నింద్రించు కొన్నాడు. తన కిప్పుడు మరణము కావలెను. కాని, చంపు వా రేరీ? మరణము గావలసినచో— మరల పోయి సైనికుల కంట యేల పడ రాదు? తన్ను చంపుమని యేలబ్రతి మాల రాదు?అంతటి నైరాశ్యము లేదు. ఓహో జీవుని గతియే విచిత్ర మైనది.

ఆకొత్త వాడ నెను. “భారతి తప్పించు కొని పోయినదను కొన్నారు. ఆమె వారి చేతిలో చచ్చినదని యొక వార్త. ఇంతకు ‘భారతి’ చచ్చినదియు – బ్రతికినదియు— తెలియదు”

నారాయణ శాస్త్రి యేమి చేయును, అతడు హాయని యేడ్చె. ఆకొత్త వాడు గూడ నేడ్వ నారంభించెను వాడెందు కేడ్చు చున్నాడు? నాశమైన తన కొంపను దలచు కొన్నాడా? భారతీదేవిపై దయతో నేడ్చు చున్నాడా? నారాయణశాస్త్రి దుఃఖము నకై దుఃఖము వచ్చినదా! ఈమూటిలో దేనికైనను గావచ్చును. మూడింటికైనను గావచ్చును. లేక మూడింటికిని సంబంధము లేని కన్నీరైనను గావచ్చును.

ఆవృద్ధుఁడ నెను.

"బిడ్డా ఎందు కేడ్చు చున్నావు? యజ్ఞ నారాయణ దీక్షితులు నీకేమి గావలెను?"

"వారు నామామ గారు"

ఓహో భారతి నీభార్యయే యన్న మాట. నీవామెపై నాశ వదలు కొనుట మంచిది. ఈజన్మమున నీకామె చిక్కదు. ఆమె వారి యత్యాచారములకు బలియై యుండునని నావిశ్వాసము. ఇక నీవెంత యేడ్చినను—నీవామెను వెనుకకు దెచ్చి కొనలేవు; నీలో పౌరుషమున్నచో—ఆదుర్మార్గులపై పగతీర్చి కొమ్ము! ఆదాదానాహెబును జంపి వారి మాంసమును కుక్కలకును,నక్కలకును వేయవలెను. ఆపరశు రాముని బ్రతికి యుండగనే వేట కుక్కల చేత కఱపింప వలెను. ఇది సాధ్యము గాదందువా? నీవాడుదానివి.ఇట్లే రవ్వంత నేపేడ్చికొని యూరికి బొమ్ము నాకు మహారాష్ట్రులపై కసి తీర్చి కొన వలెనని యున్నది. కాని, నేను వృద్ధుడను."

ఆవృద్ధుని ఒక్కొక్క మాటయు—ఒక్కొక్క నిప్పురవ వలె నున్నది. నారాయణశాస్త్రి తనలో తానిట్లను కొనెను "నేను వాడను కాను, నావారి కన్యాయ మొనరించి నందులకై ఆమహా రాష్ట్రుల రక్తముతో—చేతులు కడుగు కొన వలెనని యేనాదీక్ష; ఆపరశు రామ భావేను—నిలువున జీల్చి వేసెదను దాదాసాహేబు రక్తము నంజలులతో దార్చెదను" నారాయణశాస్త్రి యావేశ పరవశుడై—కాలితో నేలను దన్నినాడు. కొంత మట్టినెత్తి జల్లుకొన్నాడు

ఇప్పుడెక్కడికి పోవుచున్నావు?

"ఎక్కడికి బోవలెను? కాని, యెక్కడికో యొక చోటికి బోవలెను." వానికాళ్లు వానికి దెలియకయే శ్రీరంగ పట్టణమువైపు నడచినవి; వాడు పిచ్చివానివలె బరువెత్తి పోవుచుండెను.

ముడినీడిన జుట్టు—క్షౌరముకాని ముఖము; మలినవస్త్రములు; నిద్రాహారములు, లేక కాంతిహీనమైన శరీరము—వాడొక పిశాచివలె నున్నాడు. వానికన్నులు చింతనిప్పులవలె నున్నవి. ఎద దడదడ గొట్టుకొనుచుండెను. అయ్యో! యేమి మతము! ఏమిజాతి! ఇది యొక హిందువు, మరియొకహిందువున కొనర్చిన మహాపచారము. శృంగేరి, హిందువులకు 'మక్కా' వంటిది; దానినే వారు నాశమొనర్చిరి. ఇక ధర్మమేమున్నది? మతమేమున్నది? మహమ్మదీయులైనను—స్వార్థమున నిట్లు బ్రవర్తింతురా? ఎందుకు బ్రవర్తింపరు? ఔరంగజేబు మహా

మ్మదీయుఁడు. తానీషా మహమ్మదీయుఁడు. కాని ఔరంగజేబు, తానీషాను చంపెను హైదరాబాదు నాక్రమించెను. మతమా? ధర్మమా? వీరెక్కడున్నారు; మానవుని స్వార్థమునుబట్టి వీరు మారుచున్నారు. తనవారికైన యవమానమున కెట్లు ప్రతీకార మొనర్పవలెను? భారతియేమైనది? జగద్గురువు లెక్కడికి వెళ్లినట్లు? నేనిప్పుడెవరిని వెదుకవలెను? నారాయణశాస్త్రికి తన కార్యము నేవైపునుండి యారంభింపవలసినదియుఁ దెలియలేదు. కనపడిన యూళ్లలోనెల్లఁ దనవారిని గూర్చి యడుగుచుండెను. జగద్గురువులను గూర్చి ప్రశ్నించెడువాఁడు. కాని యెవరికేమి తెలియును? వాఁడట్లడుగుకొనుచునే — శ్రీరంగపట్టణమునకు వచ్చెను. ఆపట్టణమును చూచినంత వానికి తన కార్యము సిద్ధించినంత సంతోషమైనది. ఆయూరిలో నాతనికిఁ దెలిసిన వారెవ్వరును లేరు. ఇఁక టిప్పూ దరిసెనము—తనకెట్లు లభించును? తనమాటల కాతఁడు వెలనిచ్చునా? మరి నారాయణశాస్త్రికి గలిగిన యానందమున కర్థమేమి? అది వాని యాశయొక్క ప్రతిరూపము. ఆయూరిపై వాఁడాశలు పెట్టుకొన్నాఁడు. ఆయూరే తనకేమో సాధించి యిచ్చునట్లు వాఁడాపట్టణమున ప్రవేశించెను. ఊరికి ప్రధానముగ మూఁడు కోటలు. మూఁడవకోటలో మూలబలము. వాఁడు రెండవకోటలోనికిఁ జొచ్చినాఁడు. ఎక్కడికిఁబోవును? కనపడిన వీధినంతయుఁ చుట్టెను. చుట్టిచుట్టి కావేరీ తీరమునకు వచ్చెను. పరమశివుని జటాభారమును దివిజగంగవలె—కావేరి యాపట్టణమును జుట్టు

కొన్నది. వాఁడొక స్నానఘట్టమునకు వచ్చెను. అదినిర్జనమై యున్నది. మరల—వానికాలోచనలు.

ఎదుట కావేరి మందమనోహరముగ బాఱుచున్నది.ఆమెకు లోకపుజింత కాబట్టినట్లే లేదు. తనయందములే తనవిగా—తన నడపులే తనవిగా—నడచుచున్నది. సుఖదుఃఖములామెకు లేవు. రాగద్వేషములు లేవు. అప్పటికి మధ్యాహ్నమైనది. ప్రాతః కాలమున కిటకిట లాడుచున్న స్నానఘట్టము పతి పరిత్యక్తమైన స్త్రీవలెనైనది. దూరమున నెవ్వరో యొకరిద్దరు స్నాన మొనర్చు చున్నారు. సూర్యుఁడు ప్రచండ పరాక్రముఁడుగ నుండెను. ఆనదిలోని స్వచ్ఛజలమును జూచి నారాయణ శాస్త్రికిగూడ స్నానము చేయ బుద్ధిపుట్టినది. మనుష్య స్వభావములు పరమ విచిత్రము లంటిమిగదా! ఆ నీటిని జూచినంతనే వానికి పరిశుభ్రత స్ఫురించెను. ఉత్తరీయమును బిండి గట్టుపై నారవేసి నదిలోనికి దిగినాఁడు. ఆచల్లని నీటిలో బ్రవేశించినంతనే అంతటి దుఃఖములో కూడ—వానిహృదయమున కేదోయానందమైనది. ఎన్నాళ్ళకనో వేరుచేయబడిన మాతృహృదయమును—శిశువొక్కడుదాకినట్లు. ఇంతలో. నల్లంతదూరమునుండి యెవరో యిర్వురు యింటికి బోవుచు నా దారినే వచ్చిరి.

వారినిజూచి శాస్త్రి నీటిలోనుండి బయటకు వచ్చెను. వారినడిగి కొంత విభూతి పుచ్చుకొని నొసట బెట్టుకొన్నాఁడు. మడిపంచె గట్టుకొనెను. ఆగంతుకులు నిలిచిరి. నారాయణ

శాస్త్రి మరల నాలోచించుచు – నాగట్టుపై గూర్చొనెను. అతడాయూరికిగ్రొత్తవాడని వారికర్థమైనది.ఒకడు ప్రశ్నించెను.

"స్వామీ! మీరెవరు?ఈయూరికి క్రొత్తవారుగా గనుపించుచున్నారు." ఆప్రశ్నకు శాస్త్రి తలనాడించెను. అప్పుడతనికి మాటాడుట కిష్టములేదు. వృశ్చికు డంతటితో వదలలేదు.

"మీకిచ్చట పరిచితులును, బంధువులును లేకున్నచో పూర్ణయ్య సత్రమునకు బోవచ్చును. ఇది భోజన సమయము; అక్కడ క్రొత్త వారి మూడుదినములన్నము పెట్టెదరు."

దానికికూడ శాస్త్రి బదులుచెప్పలేదు. వారిరువురును డలిపోయిరి. నారాయణశాస్త్రి కడుపులో నాకలిమంట యారంభమైనది. అతడు వెంటనే లేచి పూర్ణయ్యసత్రమును వెదకికొనుచు బోవుచుండెను. వారిని—వీరినడిగి శాస్త్రి సత్రమునకు వచ్చినాడు. ఆ సత్రపు టధికారి యొకడు శాస్త్రి వేషమును జూచి కులగోత్రము లడుగకయే భోజనమునకు జీటి యిచ్చెను. శాస్త్రి భుజించి యాసత్రమందే యొకమూల విశ్రాంతి తీసికొను చున్నాడు. ఆసత్రపుటధికారి యిట్లనెను

"మీరు క్రొత్తవారుగ నున్నారు."

"ఔను."

"ఏమిపనిపై యీ యూరికి వచ్చితిరి?'

'దివాను పూర్ణయ్యగారిని చూడవలెను."

ఈ మాటలతో వాని దేహమున జెఱ్ఱులు ప్రాకినవి.

ఎవరిచావు వారిది; వాడు భయపడుచు నిట్లడిగెను.

"ఏమి భోజనమున నేమైన లోపమున్నదా? మా యాదరమున నేమైన కొఱత యున్నదా?"

ఆమాటకు నారాయణశాస్త్రి ఫక్కుమని నవ్వినాడు. ఆస్థితిలో నాతడు నవ్వుటయే వింత.

"పూర్ణయ్యగారి దగ్గఱకు మీపై కొండెములు చెప్పుటకు గాదు. మీరు భయపడవలసినది లేదు. మీరొనర్చిన యుపకారమునకు నేను చాలకృతజ్ఞుడను."

"మరిపూర్ణయ్యగారితో నేమిపని?"

"ఏదో ముఖ్యమైన విషయమున మాటాడుటకె వచ్చినాను. అది మాకు సంబంధించినదే.'

అట్లైనచో మీరువారిని, వారిగృహముననే చూడవచ్చును.'

గుర్తులు తెలిసికొని నారాయణశాస్త్రి పూర్ణయ్య యింటికి బోయెను. వారి దర్శనమునకై ముందటి వసారాలో కాచికొనికూర్చున్నాడు; పూర్ణయ్యగారి మూలమున సుల్తాను ను దర్శింపవలెనని వాని యాశ. మహామంత్రిగూడ దనకు సాయమొనర్చునని వాడునమ్మెను. పూర్ణయ్యగారు తలంచి కొన్నచో కార్యమైనట్లే. సులతానుకు పూర్ణయ్యమాట వేద వాక్యము. ఆవిషయము దేశమునకంతయు దెలియును. పూర్ణ య్యగారి యనుగ్రహమునకే శాస్త్రి వారియింటికి వెళ్ళుట.

దివాను కచేరీ యధికారి యొకడు వచ్చి "మీ రెవ్వరు?

ఏమికావలెన”ని యడిగెను.

“పూర్ణయ్యగారి దర్శనమునకై వచ్చితిని,”

“వారిప్పుడు విశ్రమించుచున్నారు. సాయంకాలము వరకును వారినిచూచు టకు వీలులేదు.”

“అయినచో అంతవరకిచట నేయుందును.”

“సాయంకాలముననుగూడ మీకు వారు దర్శనమిత్తురో లేదో చెప్పలేను. వారి కతిముఖ్యమైన పనులున్నవి. సుల్తానుగారిని చూచుటకై పోయెదరు.”

“రేపైనను దర్శనము సాధ్యమగునా?”

“ఏమి వారిని తప్పక చూడవలెనా? వచ్చిన విషయ మేమో తెలిపినచో నేనే వారికి మనవి సేయుదును. మీరు వృధా కాచికొను టెందులకు?

ఈమాటలలో నావిషయము తనతోనేల చెప్పరాదను యహంకార ముండెను.

“అదిచాల ముఖ్యవిషయము. మేమే నేరుగామనవి సే యవలెను”

నారాయణశాస్త్రికి కొంత లౌకికము కొఱవడినది. శాస్త్రియ న్నమాటతో నధికారిమొగ మెర్రబారినది. అట్లయినచో తా నువినుచున్న విషయములన్నియు నముఖ్యములా?

“కావచ్చును. ఆపక్షమునమీరు రేపటివరకును కాచి కొనవలెను”

“నాపని సాధించుకొనుటకు మూడుదినములైనను కా చుకొందును”

"ఈమాటవిని యాతడు శాస్త్రిముఖమును తదేకదృష్టితో జూచెను"

"మీరు బ్రాహ్మణులవలె గన్పించుచున్నారు"

"అవును"

"ఏయూరినుండి వచ్చితిరి"

"మాది శృంగేరి"

"భారతీస్వాముల కడనుండి వచ్చినారా"?

"అవును"

ఈమాటవిని యాయధికారి ముఖమున రంగుమారినది.

"ఈవిషయమును తమరుముందే తెలుపవలసి యుండెను. ఇటుకూర్చొని యుండుడు. నేనుపూర్ణయ్య గారికి విన్నవింతును. వారుసమ్మతించినచో తమకు దెలిపెదను."

లోపలి వసారాలో నారాయణశాస్త్రి కూర్చుండుటకు కొంతయవకాశ మేర్పడినది. అతడాభవనపు టందచందములు చూచుచుండెను. అదియొక ప్రాతకట్టడము, గోడలకుథక్కాంమజ్జినుతెరలు వ్రేలాడుచుండెను. ఎక్కడజూచినను వెలగల యాసనములు, ఆనుకొనుట కొరగుదిండ్లు. ఒకవెలగలతివాసిపై పుష్పకరండకముండెను. వచ్చినయాగంతుకుడు, శృంగేరి వాడని తెలిపిన తోడనే–పూర్ణయ్యగారు లోనికిఁదీసికొని రావలసినదిగా నాజ్ఞవెట్టిరి; నారాయణశాస్త్రి లోన బ్రవేశించెను. మహామంత్రి యాతని నాపాదమస్తక మొక్కసారి విలకించి–"కూర్చొను"డని సైగచేసినాడు.

"శృంగేరినుండి వచ్చినారా?"

"చిత్తము."

"భారతీ స్వాములవారికి క్షేమమేనా?"

"ఆసంగతి తెలిసికొనుటకే నేనిక్కడకు వచ్చితిని."

"ఏమి? వారికేమైనది?"

"ఇంకేమి కావలెను? సర్వనాశమైనది."

"అనగా?"

మహారాష్ట్రులు దండెత్తివచ్చి శృంగేరిపైబడి కొల్లగొట్టిరి. శ్రీమఠమును దోచుకొనిరి."

"అయ్యో! పాపము!"

శృంగేరిపై — మహారాష్ట్రులు జరిపిన హత్యాకాండను శాస్త్రి వివరముగా వర్ణించినాడు.

"ఈవిషయము మాకింతకుముందే కొంత తెలియును. అది విన్నప్పటినుండియు మామనసు చాల వ్యాకులముగానున్నది."

పూర్ణయ్యగారి కీవిషయము ముందె తెలియునన్నమాట! మరి తెలిసియు—గురుపీఠమును రక్షించుటకై యెందుకు ప్రయత్నింపలేదు? శాస్త్రి తనలోనే యనుకొనెను.

"భారతీస్వాములు అదృశ్యులైనారు."

"ఆవార్తయు మాకు వచ్చినది"

"ఈసంగతిగూడ దెలియునా? నారాయణశాస్త్రి యాశ్చర్యముగ నడిగెను.

అంతమాత్రమేగాదు, వారు 'కార్కళము'న రహస్యముగ నివసించుచున్నారనియు వార్త.

స్వామి జీవించి యున్నారన్నమాట నారాయణశాస్త్రి సంతోషముతో కిలకిలనవ్వెను.

జీవించుటయేకాదు. సురక్షితముగ నున్నారు. వారిని రాజధానికి దీసికొని రావలెనని దూతలను బంపినాము.

అయినచో పూర్ణయ్యకు శృంగేరి వృత్తాంతము తెలియును. తనకు తెలియని విషయములుగూడ తెలియును. వారికేమి? మహారాజులు. చేతిలో వేలకొలదిగూఢచారులుందురు. నారాయణశాస్త్రి యింక తాను వచ్చినపని-సులభమైనదనుకొన్నాడు.

"మీరు స్వాముల కాప్తులైనట్లున్నారు. శృంగేరి వదలిన తర్వాత మీరు వారిని జూడనేలేదా?"

"స్వామి శృంగేరినుండి హఠాత్తుగ నిర్గమించినారు. వారి స్థితుగతులేమో మాకింతవఱకును దెలియదు."

"వారు క్షేమముగనున్నారు కాని, వారిచ్చటికి వచ్చువఱకును వారివిషయమేమియు స్పష్టముగ జెప్పలేము."

నారాయణశాస్త్రి యొకనిమిషమాలోచించుకొనుచు నిట్లనెను.

"మేమొక మహాకార్యమునకై తమచెంతకేతెంచితిమి. టిప్పుసుల్తానుగారి సాయముతో మహారాష్ట్రులపై పగతీర్చుకొనవలెనని మాయాశయము. శృంగేరిపై నత్యాచారమొన

ర్చిన వారిని క్షమింపరాదు." పూర్ణయ్య చిన్నగా నవ్వెను.

"తమరేమో నవ్వుచున్నారు."

"మీమాటలువిని."

"మీనగవును స్పష్టముగ గ్రహించలేకున్నాను. ద్రోహులైన మహారాష్ట్రులను . . . .

"ఈవిషయము నిదానముగ నాలోచింతము. ఇప్పుడు మీరు ప్రయాణముతో జాల బడలికచెందియున్నారు. విశ్రాంతి తీసికొనుడు."

సంభాషణమిక చాలింతమనుటకిది సూచన. కాని నారాయణశాస్త్రి లేవలేదు. అతనికి పూర్ణయ్యవర్తన — ఆ మాటలు విని నిరాశమైనది. వారి యభిప్రాయమును పూర్తిగా కనుగొనువరకు వెళ్లరాదని నిశ్చయించెను.

"ఇకనేమైన పనియున్నదా?"

"నేనిచటికి వచ్చినది మహారాష్ట్రులపై పగదీర్చుకొనుటకు; నేను జీవించిన దిందుకొరకే. ఇదియొకటే నాకర్తవ్యము."

"ఇప్పటి రాజకీయ పరిస్థితిలో నివి సాధ్యముగాదు."

"అనగా?"

"తమకీ మైసూరురాష్ట్రమును గూర్చి పూర్తిగ తెలిసియున్నట్లులేదు. ఇప్పటికే యుద్ధములతో–సుల్తానులు మెత్తబడి యున్నారు. అందుండి తేరుకొనుటకు యింక గొంత కాలము పట్టును. ఇంతలో మరియొక యుద్ధమునకు ప్రయత్నించుట యాత్మనాశమునకు దారి."

"అయినచో నీనకుమ నెవరో సులతానులకు పిరికిమందు పోసినారన్న మాట."

"పౌరుషముగూడ దేశకాలములబట్టి ఫలించును. మూర్ఖత్వమున (బనులు నెరవేరవు. ఇప్పుడు యుద్ధముతో కొంత దుర్బలులమై యున్నాము. ఇప్పుడు మాబలమును సేకరించుకొనవలెను. కర్యమునకు కాలుదువ్వుట తగనిపని."

"మీరింతకుముందు యుద్ధమొనర్చినది ఆంగ్లేయులతో. నేననుచున్నది మహారాష్ట్రుల విషయము." పూర్ణయ్యగారు నవ్విరి. "యుద్ధమెవ్వరితోనైనను కష్టనష్టములొక్కటే. మహారాష్ట్రు లాంగ్లేయులకు మిత్రులు. అందుచే శత్రుని మిత్రుడు మాకు మిత్రుడెట్లగును? ఆంగ్లేయులును—మహారాష్ట్రులును సంధిచేసికొని—మాపై (బడుటకు(దయారైనారు. వారికూటనీతి ప్రచండమైనది. గడచినసారి యా నీతివలననే మేము మోసగింప (బడితిమి. వేఱు యత్నములేక—మా తలలు వంచుకొని సంధికంగీకరించితిమి. అదిగూడ గౌరవకరమైన సంధిగాదు. ఇంగ్లీషువారి కర్ధరాజ్య మొసగినాము. వారికి బాకీపడిన ధనమునకై మనరాజ భాండారము నింగ్లీషువారు కొల్లగొట్టిరి. ఇంకను కొంతబాకీ మిగిలినది. దానిని తీర్చుటకై సులతాను గారి కొడుకును వారికడ (గుదవ యుంచినాము. ఇంతకన్న మరేమి యవమానము కావలెను. ఈస్థితిలో మరొక యుద్ధమునకు (జేయివేసినచో నాశమును మనమైకోరి తెచ్చుకొన్నటులుండును. కనుకనిపుడు ఇంగ్లీషువారికి మిత్రులైన మహా

ష్ట్రుల పైకెత్తిగట్టు స్థితిలో లేము."

"అయినచో గురు పీఠము నకు కల్గిన యవమానమును మింగి కొని పిఱికి వారి వలె మెలగుదురా?"

నేనట్లన లేదు. ఇపుడు మాత్రము యుద్ధము నకు సిద్ధముగ లేమని యను చున్నాను. మనము దుర్బలులమై నపుడు బలిష్ఠులతోడి పగ వివేకము గాదు. ఇపుడు మనకైన యవమానమును చేదు వలె బల వంతముగ మింగి కొనవలెను దీనిని తీర్చు కొనవలసిన సమయము మరి యొక సారి వచ్చును అంత వరకును క్షమయే పరమ సాధనము"

"మహారాష్ట్రుల పైకి యుద్ధము నకు దమరు సిద్ధముగ లేరన్న మాట"

"లేము"

"ఇది మీయంత్య నిర్ణయమా?"

"అవును"

"అయినచో నేను సులతాను గారినే దర్శింతును"

"ఎందుకు"

"వారి యభిప్రాయమును తెలిసి కొనుటకు"

"మాయభిప్రాయమే వారి యభిప్రాయము"

"కావచ్చును. నేను వారిని చూడ వలెను. తాము దయ యుంచి వారి దర్శనము చేయించ వలెను"

"మీరు సులతానుగారితో రాజ కీయములను చర్చించ దలచు కొన్నచో—వారి దర్శనము మీకు గలుగదు"

"ఎందుకు"

"అది వృథా కాల హరణము. సులతానులుదుఃఖమున నున్నారుప్పుడ్వారు చూచుట సాధ్యము గాదు దర్శనము నకు వారు సమ్మతించుట లేదు"

"నేను వారిని జూచియే తీరవలెను."

"సాధ్యమేగాదు."

"ప్రయత్నింతును."

"నేను బ్రతికి యున్నంతవరకు మైసూరు అకారణముగ యుద్ధమున ప్రవేశింపదు. మీరు వెళ్లవచ్చును.'

ఈ మాటలనుచునే-పూర్ణయ్యగారక్కడనుండి లేచిరి. నారాయణశాస్త్రిగూడ లేచి నమస్కరించి వెళ్లిపోయెను.

నారాయణశాస్త్రి యొక్క విషయమున నిశ్చయమునకు వచ్చెను. ఏమైనను తాను టిప్పు సులతానుతో గలియవలెను. మహారాష్ట్రులనుండి తమకైన యన్యాయము నాతనికి దెలిపి-యతని సాయముతో వారికి శిక్ష విధించ వలెను. ఈకార్యమును తన ధన మాన ప్రాణములను కుదువ బెట్టి యైనను సాధింప వలెనను కొన్నాడు. కాని కార్యమున కెట్లుపక్రమింప వలయుననుటయే దెలియ లేదు. సాయము సేయునను కొన్న పూర్ణయ్య-విరుద్ధముగ దయారైనాడు

దానికి తగినట్లు మైసూరు పరిస్థితి గూడ నిరాశా జనకముగ నుండెను. 'మైసూరుపులి' యని ప్రసిద్ధి నందిన టిప్పు సులతాను యింగ్లీషు వారి కోడి పోయి యుండెను. తన కవమానకరమైన సంధి కంగీకరించెను. తన దేశకోశము లను వారి

కొప్పించినాడు. అంత మాత్రమే గాదు. తన కుమారు లను వారితో నంపి యుండెను. రెండు మారులు దనకు సంభ వించిన పరాభవము లతో నాతనికి మనస్సు జర్జరితమైనది. అతడు మంచము బట్టి యుండెను.

ఇది వరకుఁ దన్నెంతయో భక్తితో సేవించిన 'అంచీ రామయ్య' దివాన్ మహమ్మదాలీ, తోషీఖాన్, కృష్ణ రాయ లు మొదలైన వారిని సులతాను శిక్షించి యుండెను. తన యభి వృద్ధికి వారే కారకులు. స్వార్థపరుల మాట లను చెవి బెట్టి అతడు వారి యుప కారమును మరచి వారి ప్రాణముల కెసరు బెట్టదలచెను. అది తన మహాపరాధ మని యంతర్వాణి ప్రబో ధించు చున్నది. కృష్ణరాయుని భార్య కమలాబాయి యొసంగి న శాపము—వాని చెవులలో మారు మ్రోగు చున్నది. దాని ఫలమో యన్నట్లు వాని యర్ధరాజ్యము నింగ్లీషువారు పెఱికి కొని పోయిరి. యుద్ధఖర్చులకని తన కోశమును దోచిరి. అన్ని టికన్న బాధాకరమైన విషయము తన కుమారులను వారి కొప్పించుట; ఎంతటి యవమానము? ఇదంతయు దేనికి? స్వా ర్థ పరుడైన 'మీర్ సాదక్' మాటలు విన్నందుల కిదిఫలము కృష్ణరాయునివంటి స్వామిభక్తులను శిక్షించినందుల కిదిఫలము.

వానికిప్పుడు దన యకృత్యములకై పశ్చాత్తాపము మొదలైనది. ఆయగ్ని వానిని కాల్చుచున్నది. పూర్ణయ్యా వానిమనస్సునకు శాంతి యొసగుట కెంతయో యత్నించెను. తక్కిన యనుయాయులుకూడ గడచినదానికిచింతించి ప్రమో

జనము లేదని యెన్నోరీతుల వచించిరి. కాని యాతని మనసు శాంతింపలేదు. కాలమొక్కటే దీనిని మాన్పగల దివ్యౌషధమని పూర్ణయ్య గ్రహించినాడు. అతడప్పుడప్పు డుపశమన వాక్యములు మాత్రము చెప్పుచుండెను. ఇట్టి సమయమున నారాయణశాస్త్రి టిప్పూను చూడ నెంచెను.

నారాయణశాస్త్రి ప్రతీకారవాంఛతో పిచ్చివాడైనాడు. ఆతడు పిచ్చివానివలెనే వీధులు చుట్టెను. ఎవ్వరుగూడ నాతనిని గురుతింపలేదు. ఆదరింపలేదు. పూర్ణయ్యను ధిక్కరించి వచ్చినవార్త త్రిములో దెలిసినది. తర్వాత నాతని కక్కడ నన్నముగూడ బుట్టలేదు. చిక్కినప్పుడు నన్నము దినును; లేనిచో కావేరీ నీరు త్రాగును. ఒక్కొక్కనాడు రంగనాథుని గుడిలో బ్రసాదమును సేవించును. ఒకనాడదియు లేదు. రాత్రివేళల నెవరియింటిముందో యరుగుపై బండుకొనును. లేక యంగడివీధుల నిద్రించును. అక్కడివారు గూడ దరిమినప్పుడే చెట్టుక్రిందనో బడిపోయెడువాడు.

ఆనాడతని కాయాసమెక్కువగా నుండెను. పెద్దమసీదు దగ్గర నొక శ్రీమంతుని యింటియరుగుపై బండుకొన్నాడు. ఇంటియజమానివచ్చి క్రొత్తవానిని జూచెను. గుడ్డలు నల్లగా నున్నవి. అన్నపానములు లేమింజేసి ముఖము వికారముగ నుండెను. వీడెవడో దొంగయైయుండును. ఆయజమాని వానిని 'లేచిపొమ్మనెను.' శాస్త్రి యంగడి వీధికి వచ్చెను. అప్పటికే యూరిలోని భిక్షుకులాచోటుల నాక్రమించికొని

యుండెను. వానికక్కడ చోటుచిక్కలేదు. రాత్రి యొంటిగంట మీరినది. జనముల సద్దు బొత్తిగా తగ్గినది. ఆ భయంకర సమయమున వాడు పిశాచివలె యూరు జుట్టుచుండెను.

వాఁడున్నస్థితి—వానిరూపము జూచిన యూరి కుక్కలు మొరుగుచు వెంటఁబడినవి. అవి వానిని దొంగయను కొన్నవి గాబోలు!. వానికి దిక్కుతోచలేదు. పరువెత్తనారంభించెను. వాఁడు పరువెత్తినకొలఁదియు కుక్కల సందేహము బలమైనది. అవి వెంటబడి తరుముకొని వచ్చినవి. వాడింకను వేగముగా బరువెత్తెను. ముందు శాస్త్రి వెనుక కుక్కలగుంపు. వాఁడు పెద్దమసీదు దారిబట్టి పరువెత్తినాఁడు. త్రోవలో నొకపెద్ద రాయి యడ్డువచ్చెను. చీకటిలో వాడు జూడలేదు. అదివాని పరుగు నడ్డినది. దానిని త్రొట్రిల్లి కొని వాడుపడెను. ఆరాతి మొన నొసట గ్రుచ్చుకొన్నది. రక్తము తెరలు తెరలుగా బారుచున్నది. శాస్త్రికి బాహ్యజ్ఞానము దప్పినది. వానికెచ్చరిక వచ్చునప్పటికి సూర్యోదయమై చాలపొద్దయినది. వాని నెవ్వరో యుపచరించుచున్నట్లున్నది. ఆశ్చర్యపడిన నారాయణ శాస్త్రి కన్నుదెఱచి చుట్టును జూచినాడు. యెదుట నొక మహమ్మదీయుఁడు తన్నే చూచుచున్నాఁడు. వయస్సు సుమారేబది వర్షములుండును. తా నీమహమ్మదీయుని యింటికెట్లు వచ్చెను? వాడు కుతూహలముతో నింటి నలువైపుల చూచెను. అదియొక చిన్నయిల్లు. ఇంటి నడువలో నొకమంచమున దన్ను బడుకొనబెట్టినారు. దానిసమీపముననే యొకహుక్కా

నిప్పారిపోయి నిద్రించుచున్నట్లున్నది. ఆయింటికి రెండుమూడు కిటికీ లున్నవి. దానికడ్డముగ చలువచేసిన రంగు గుడ్డలును కట్టి యుండిరి. ఖురానులోనుండి చక్కని వాక్యములను చిత్రించిన చిత్రములు గోడలపై వ్రేలాడదీయబడి యుండెను. వేరొక వైపు పెట్టెపై పెద్దఖురాను గ్రంథమున్నది. శాస్త్రి కన్ను దెఱచిన వెంటనే యావృద్ధుడిట్లన్నాఁడు.

"బేటా! గాయము నొప్పి కొంచెము తగ్గినదా చాల పెద్ద దెబ్బ తగిలినది. పాపము"

అతని విచారణలో నెంతయో మృదుత్వ మున్నది. మానవత్వ మున్నది. తాను కుక్కలకు భయపడి పరువెత్తినపు డీమనుష్యుఁడు తన్ను రక్షించెనను కొనెను. సత్యము గూడ నంతే. శాస్త్రి భయముతో పెద్ద మసీదు వైపు బరువెత్తెను మౌల్వీ మహమ్మదుల్లా సాహేబు యింటి ముందు రాయి యడ్డు వచ్చి—పడి పోయినాడు. కుక్కల శబ్దమును విని మహమ్మదుల్లా బయటికి వచ్చెను. ఎవరో తమ యింటి ముందు తెలివి దప్పి పడినాఁడు.నొసట—గాయము తగిలినది. వీడెవ్వఁడు ఏజాతివాడు? అనుతర్కములు మౌల్వీకి గాబట్టి లేదు. అతని హృదయము దయతోఁ దొణికిస లాడినది. మౌల్వీ శాస్త్రిని గృహములోనికి గొంపోయి యాపధోపచారము లొనరించెను. తత్ఫలముగనే—శాస్త్రి కన్ను దెఱచినది. అతఁడు కన్నులు దెఱచి నపుడా వృద్ధునకు గలిగిన సంతోష మింతంత గాదు. దయామయుఁడైన అల్లా దయ వలన బ్రతికి నాడన్న

సంతోషమాతని కన్నులనిండ గన్పడుచున్నది.” బేటా ఇప్పుడు నొప్పి యెట్లున్నది? రాత్రి యంతయు నొప్పితో బాధపడితివి? జ్వరముకూడ వచ్చినది. ఆతడు శాస్త్రి శరీరమును దడివినాఁడు, నారాయణశాస్త్రి యేమో చెప్పదలంచెను. కాని నాలుక యాడలేదు. మాటలాడుటకు గింజుకొనుచున్న శాస్త్రి ముఖమునుచూచి మాల్వీ “ఆపరవర్దిగార్” అల్లాదయవలన యిప్పుడు జ్వరము నిలిచినది. నిన్న నీవున్న స్థితినిబట్టి బ్రిదుకవనుకొన్నాను. ముఖమునిండ రక్తము నిండుకొన్నది. దానినిజూచి చాల భయపడినాను. నీపైకనికరించి—లోనికిదెచ్చి యుపచరించితిని. అల్లాదయ దొడ్డది. నీవు బ్రిదికితివి. మాల్వీ సంతోషముతో బలికెను. శాస్త్రికామాటలు వినవచ్చుటయే లేదు. ఆతని శరీరమలఁతతో నీరసించి యుండెను. ఆతడు మాల్వీ వైపు కృతజ్ఞతా పూర్వకముగ ఁజూచినాఁడు. కొంతసేపట్లే చూచి ప్రాణశక్తినంతయు నొక్క-చోటికి తెచ్చుకొని యిట్లనెను. “దాదా! మృత్యుముఖమునుండి తప్పించి నన్ను బ్రిదికించినందుకు కృతజ్ఞుఁడను. గాయముతో తెలివిదప్పిన నన్ను బ్రిదికించితిరి. మిమ్ముచూచినచో—దయాహృదయులైన ముసల్మానులనిపించుచున్నది. నేను బ్రాహ్మణుఁడను. మిమ్ముచూచినపుడు నాతండ్రిని జూచుచున్నట్లున్నది. మీవచనములు నా హృదయము నమృతస్నానము జేయించినట్లున్నవి. మీరెవ్వరైనను—దీనదరిద్రులను రక్షించుటకు వచ్చిన మహాత్ములు. మీ కరుణతో నేను బ్రిదికి

నాను. మీశిశువువంటి వాఁడను, మీబుఋణమెట్లు తీర్చ వలెనో తెలియదు.

"బేటా! యీ విషయమున నేను జేసినది స్వల్పము. దేవుఁడీపని నాచేత జేయించినాడు. వాడులేని చోటులేదు. ఆతడు దయామయుడు. మనమందరమును వాని సంతానము. రక్తములో మునిగిన నిన్నువదలిపెట్టినచో — నాపాపమునకు నిష్కృతి యుండదని తోచినది. నేను దైవకింకరుడనై—వాని యిచ్ఛతో నిన్నిక్కడికి దెచ్చి యుపచారమొనర్చితిని. నే నొనర్చిన పని—ఒకమనుష్యుఁడింకొకనికి దీరవలసిన యల్ప కర్తవ్యము మాత్రమే. దీనికొక గొప్పయుపకారమనుట దేనికి?."

"మీ యుపకారమును నేనీజన్మలో దీర్చికొనలేను."

పై జన్మము వఱకును గాచికొనవలసిని పనిలేదు. ఈ జన్మమున నే దీర్చికొంటివి. నీవునన్ను తండ్రిగా నెంచి 'దాదా' యని పిలిచితివి. అప్పుడే నీవు ఋణవిముక్తుడవైనావు. ఇక నీ విషయము యోచింపవలసిన పనిలేదు. ఎక్కువగా మాటలాడి శ్రమపెట్టుకొనవలదు. ఇప్పుడింక మాటాడుటచాలును. తక్కినది నీ వుపాహారమును ముగించినతర్వాత మాటలాడు కొందాము."

మౌల్వీసాహేబు లోపలి గదివైపునకు తలద్రిప్పి "అయేషా" మన యతిథికి పాలు పండ్లు తీసికొనిరా! అని యన్నాడు.

అయేషాకిఱువది వర్షముల కన్న ప్రాయమెక్కువ

యుండదు. లజ్జామధురితముగ నావిడ నడచినది. ఆమె యొక తట్టలో పాలు పండ్లు పెట్టుకొని వచ్చి మాల్వీ చేతికిచ్చి వెను దిరిగెను' 'శాస్త్రి' యామెను గమినించి నట్లు లేదు. అతడు వృద్ధుని వైపే జూచు చుండెను.

"బేటా! నీకు చాల ఆకలియై యున్నది. ఈపాలు పండ్లు దీసికొనుము" అన్నాడు.

శాస్త్రి యాహార పదార్థములను బ్రిక్కన బెట్టి యేదో యాలోచించు కొను చుండెను. దానిని చూచి మాల్వీ సాహేబునకు నిరాశ యయ్యెను.

"బేటా! నీవు హిందువవు; వారిలోను బ్రాహ్మణుడవు. ముసల్మానుల చేతినుండి పాలు పండ్లను గ్రహించుటెట్లని నీవు సందేహ పడు చున్నటు లున్నది. కాని, నన్ను "తండ్రీ!" యని సంబోధించిన నీవు—నేనొసగిన పాలను బుచ్చుకొనుటకు సంశ యింప రాదను కొందును"

ఆవృద్ధుని ముఖమున నేదో బాధ గోచరించెను.

"దాదా నీవొసగిన యమృతమును నేను సంతోష ముతో స్వీకరింతును. మహమ్మదీయుడవని శంకించుట లేదు. మీరే జాతివారైనను నాకుచింత లేదు. నీవు నాపాలిట కన్న తండ్రివగుటయే యెక్కువ."

"మరెందులకు యోచించుచున్నావు?"

"నాకు ప్రాణదాన మొనర్చిన నీతో సత్యమును దాచుట కిష్టములేదు. నీవునాకొరకై పడుచున్న బాధను చూచి నా

యనుభవము జ్ఞాపకము వచ్చినది. నన్ను—నా ...రెన హిందువులు—బ్రాహ్మణుడు పిచ్చివాడని తలచి హాస్యమాడిరి; వెళ్లగొట్టిరి. నా వేషమును చూచి దొంగయని కొట్టవచ్చిరి. గూఢచారియని బెదరిరి. నాకు మంచినీరొసగుటకు వారంగీకరింపలేదు. తినుటకు తిండిలేక ఉండుటకు చోటులేక పరదేశివలె తిరుగుచున్న నన్ను—భిన్నజాతివాడవైననీవు కన్న తండ్రివలె నాదరించితివి. నావారేనన్ను తిరస్కరించినపుడు నీదయ నాపై శీతలవాయువువలె వీచినది. ఈవిషయమునే యాలోచించు కొనుచున్నాను." శాస్త్రి కంఠము గద్గదమైనది.

"బేటా! నామాటలు జాగ్రత్తగ వినుము. హిందువులైనను; మహమ్మదీయులైనను మనమందర మాభగవంతుని సంతానము. నీవు హిందువైనంత మాత్రమున కష్టములో నున్ననీకు సహాయము చేయరాదని మాఖురాను చెప్పలేదు. దీనులకు, దళితులకు కష్టములలోతోడ్పడుట మానుషధర్మము. దీని నేమత ధర్మమును తిరస్కరింపలేదు. నీవు గాయముతో తెలివితప్పి పడినపుడు హిందువని నిన్ను నేను వదలినచో దయామయుడైన భగవంతుడు నన్ను క్షమించి యుండెడివాడు గాదు. అల్లా దృష్టిలో మనమందరమతని సంతానమైనపుడు యీ చిన్నభావములను మనము కల్పించి ఒకరినొకరు దూషించుకొనుట శ్రేయస్కరముగాదు. అజ్ఞానులు తమవారు పరులని, భేదబుద్ధిని గల్పించికొందురు. జగద్రక్షకుడైన అల్లాకు మనమందర మొక్కటే."

ఈమాటలన్న యీ వృద్ధుడెందుకో నిట్టూర్చినాడు.

"దాదా! ఎందుకు నిట్టూర్చుచున్నావు?"

"బేటా! నీదగ్గర సంకోచమేమున్నది? అల్లా యీ ధర్మమునకు నాజీవితమందే యొరపిడి బెట్టుకొనవలసిన పరిస్థితిని దెచ్చి పెట్టినాడు; వాని పరీక్షకు దాళుదునో—లేదో చూడవలెను."

నారాయణశాస్త్రి ఆవిషయమేమని ప్రశ్నించబోవు చుండెను. ఇంతలో బయటనుండి యొకయువకుడు ప్రవేశించెను. వాడు సైనిక వేషముతో నున్నాడు. వయస్సు సుమారు ముప్పది వర్షములుండును. వాడొక నిమేషము మంచమువైపు చూచెను. ఏదో పలుకబోయెను. అంతలో నేమయ్యెనో! మౌనముగ లోనికేగెను. మౌలానాసాహెబు కుమారుని వాలకము గమనించి మరల శాస్త్రివైపు జూచెను. మౌలానా వదనము—వాడియున్నది. ఉత్పలశ్యామలమైన నిట్టూర్పొకటి వాని యెదదన్ని గడ్డకు వచ్చినది. అది నాభినాళమునుండి వచ్చినటు లుండెను.

"దాదా! ఇప్పుడువచ్చిన యువకుడెవ్వడు?"

"వాడు నాకొడుకు ఉస్మాన్. సైన్యమున కొలువులో నున్నాడు. కోటకావలి వానిపని. రాత్రి పహరాను ముగించుకొని యింటికి వచ్చినాడు."

"ఉస్మాన్‌ఖాన్ గుడ్డలు మార్చుకొని కాళ్లు చేతులు కడుగుకొనినాడు. ఒకగుడ్డతో ముఖమును దుడుచుకొనినాడు.

అతడు ముఖమును దుడుచుకొనుచునే (దండి) వైపు జూచెను ఆచూపులు కించిత్కాఠినముగ శాస్త్రి యెడను గ్రమ్ము చుండెను.

"దాదా! ఇతడెవ్వరు; హిందువువలె నున్నాడు." వాని మాటలోని తిరస్కార ముద్ర కన్నులలోఁ గూడ వ్యక్తమైనది. మౌలానా కొడుకు నకు నారాయణశాస్త్రి విషయమును విశదీకరించెను.

వాడేమియు మాటాడ లేదు. అక్కడే చాపపై కూర్చొని పాలు త్రాగినాడు. వాని ముఖముపై ప్రతి దినము నున్న సంతోష ముద్ర నేడు లేదు. ఆగంతుకుని విషయమున నేదో యతృప్తి వాని మనస్సు నాక్రమించినది. ఈ భావమును గ్రహించి మౌలానాసాహెబు పలికెను.

"బేటా! హిందువైననేమి? మహమ్మదీయులైననేమి? కష్టములతో బాధపడుచున్న వారందరొక్కజాతి. మనచేత నైన సహాయమును జేయవలసినది ఇది అల్లాకు ప్రీతి."

"ఈయూరికితడు క్రొత్తవాడుగ నున్నాడు. ఎక్కడ నుండి వచ్చినాడు?"

ఈమాటకు నారాయణశాస్త్రియే యుత్తర మిచ్చెను. "అవును. నేనీయూరికి క్రొత్త. శృంగేరినుండి వచ్చినాను. నా పేరు నారాయణశాస్త్రి."

"ఇక్కడ మీకెవ్వరును దెలిసినవారు లేరా? బ్రాహ్మణుల కంతయు ముప్పూట భోజనములు పంచుచున్న పూర్ణ

య్యసత్రిమున్నదే! అక్కడ మీవంటివారు ఆరునెలలున్నను నెవ్వరును వలదనరు.'' ఉస్మాన్ యీమాటలనుచునే తనలో తాను నవ్వుకొన్నాడు. వాడు మరల నారాయణశాస్త్రివైపు తిరస్కారముగ చూచెను.

"నేనిక్కడికి వచ్చిన దన్నముకొరకు గాదు. ఒక మహా కార్య సాధనకు——"

"అదేమో తెలిసికొనవచ్చునా?''

సులతానుగారిని దర్శించి — మావారికైన యన్యాయమునకు నీచులైన మహారాష్ట్రులపై పగదీర్చుకొందమని వచ్చినాను.

ఈమాటవిని తండ్రి, కొడుకు లొక్కసారిగా నాశ్చర్యమొందిరి. శాస్త్రి జరిగిన కథనంతయు వారికి తెలిపెను.

"అయినచో దివాను పూర్ణయ్యగారు మీకు సాయము చేయలేదా? వారు బ్రాహ్మణులేకదా? ఆశ్చర్యము! ఈ బ్రాహ్మణులది చాలవిచిత్రమైనజాతి. వారి మనస్సులలో నేముండునో అల్లాకే ఎఱుక." ఈమాటలని

"దాదా! దిలావర్ ఖాన్‌తో మాటలాడి వత్తును. వానిగుఱ్ఱమునకేదో జబ్బుచేసినది. మూడుదినములనుండి గడ్డి తినదు. నీరు త్రాగదు. వానికాగుఱ్ఱము ప్రాణముతో సమానమైనది. వాఁడుగూడ మూడు దినములనుండి — కూడు, నీరు వదలి కూర్చొన్నాడట! ఆ గుఱ్ఱమున కేమైనదో తెలిసికొని వత్తును." ఈ మాటలని వాడు వెడలిపోయెను. వాడు పోవు

వరకు వానివైపే జూచుచున్న మాల్వీసాహేబు, చల్లగా శాస్త్రితో ననెను.

"బేటా! నీవు మాఉస్మాన్ అన్నమాటలకు వేసరిక పడ రాదు. వాని మాటకొంచెము కఠినముగ నుండును. వాని హృదయము మాత్రము మామసీదు వనములోని దిల్ కుష్ పూవులంత మృదువైనది. వానికి హిందువులపై ద్వేషము లేదు. కాని పూర్ణయ్య గారన్నచో మావానికి గిట్టదు. సుల్తాను గారి కీనడుమ ఏర్పడిన పరాజయముల కన్నిటికిని—పూర్ణయ్యయే కారణమని వాని భావము. పొరపాటని దిద్దుట కెన్నియో సారులు ప్రయత్నించితిని. నావాదము లన్నియు వాని ముందు న్యర్థము లైనవి; ఎన్ని రీతుల జెప్పినను నమ్మడు వాడు. వివేకముతో నేమైన యన్నచో నీవు వేసరిక పడరాదు," మాలానా క్షణ కాల మాగెను. ఇంతలో కొడుకుపై నాతనికి ప్రేమ తరుముకొని వచ్చెను. సంభాషణ యిట్లు మార్చెను.

"అదిమావాని తప్పుగాదు. వానికున్న సహవాసమట్టిది వాడు నాకొడుకే యయినను వానియాలోచనలే వేరు. వాడు చెడ్డవాడని చెప్పలేను. దురభిమాని యనలేము. కాని వాడొక తీవ్రమతాభిమాని. మాధర్మముపై వానికున్న యంధ భక్తి యితర మతములపై తిరస్కార దృష్టిని గల్గించినది. మేమా విషయము నెన్నియోసారులు వాదించుకొన్నాము. దినముల తరబడి పరస్పరము మాటాడుకొనుటయే లేదు. నేను కాఫరుల స్నేహితుడనని వాని యూహ; వాని హిందూ

ద్వేషమును తలచుకొన్నచో నాకు భయమగును. ఎదలో శూలము నాటినట్లగును. కాని ఏమి చేయనగును? ఆదిలావర్ ఖానుని బోధనలు మావాని మనస్సున సూటిగ నాటుకొని పోవుచున్నవి. వానిస్నేహముతో వీడు రోజురోజు జెడుచున్నాడు. వానిదారి నాదారి వేర్వేరని తెలియుచున్నది. ఇదే అల్లా నాకు తెచ్చిన యగ్నిపరీక్ష."

"దిలావర్ ఖానెవరు?" నారాయణశాస్త్రియడిగెను.

"వాడుస్మాన్ బాల్యస్నేహితుడు. వారిరువురి కొకతే ప్రాణమనుట తప్పుగాదు. దిలావర్ ఖాన్ తండ్రి సైన్యములో దొడ్డసర్దార్ మావానికి కొలువిప్పించినవాడాతడే. ఉస్మాన్‌ను తమయింటి యల్లునిగా జేసికొనవలెనని వానియాశ. చెల్లెలి పెండ్లియైన తర్వాత తాను వివాహము జేసికొందునని మావాడన్నాడు. మా "అయేషా"ను దిలావర్ ఖానున కివ్వవలెనని మావాని కోరిక. అది నాకిష్టములేదు. వాడు దుర్మార్గుడు. ఈ విషయమును నేను తేల్చి చెప్పలేక ఆమె వివాహ ప్రస్తావన వచ్చునరికి కాలయాపన చేయుచున్నాను. అల్లాయిచ్ఛ యెట్లున్నదో ఎవరికి తెలియును."

ఆవృద్ధుని ముఖమున రక్తము మందగించినది. అపరిచితుడైన తాను వృద్ధుని యంతరంగమును దాకు ప్రశ్న వేయుట తప్పయ్యెనని శాస్త్రి తలచెను.

"దాదా! నానుండి దోషమేమైన గల్గియున్న క్షమింపవలెను. నేనాగంతుకుడను. మీ కుటుంబవిషయముల నింత

లోతుగ విచారింపగూడదు. తెలియకపొరపాటైనది. "నారాయణశాస్త్రి తన విషాదమును వ్యక్తపరచెను.

"నీదోషమేమియును లేదు బేటా! నాకుమారుని వర్తనమును దలచికొన్నచో మనస్సునకు బాధగల్గినది. ఒక ధర్మముపై యభిమానమున్నంత మాత్రమున నితర మతమును ద్వేషింప వలెనని యెవరు చెప్పినారు? మనము పరధర్మమేల నిందింపవలెను? నేనెన్నడట్లు చేయలేదు. కాని, నాయీధర్మమునకు నేడగ్ని పరీక్ష వచ్చినది. దానిని నిల్పుకొన్నచో నా కుమారు నెదురింపవలెను. వాడుచాల మొండివాడు. నాకేకైక పుత్రుడు వానిపై నాకత్యంత ప్రేమ. వానిని మెప్పింపవలెనన్నచో నాయభిప్రాయమును జంపికొనవలెను. అది ఆత్మద్రోహము. దానికన్నను నేను మరణించుట మంచిది. ఈ సందిగ్ధావస్థలో నన్ను భగవంతుడే రక్షింపవలెను."

"దాదా! మీ యుదాత్త విచారములను విన్నచో నాకు శ్రీ సచ్చిదానంద భారతీస్వాములు జ్ఞాపకమునకు వచ్చుచున్నారు. వారును సర్వధర్మములను సమాన దృష్టితో చూచుచు గౌరవించుచుండిరి. సర్వధర్మ సమన్వయమునకై యత్నించు చుండిరి. అంతటి యుదారులకు హిందువులవలననే యెంత బాధగల్గినది! వారి మఠమును దోచిరి. దేవియాభరణములను దోచిరి. కనపడిన స్త్రీని మానభంగ మొనర్చిరి. ఛీ! ఛీ! ఏమి హిందూజాతి!"

"బిడ్డా! ప్రతి ధర్మము నను యిటువంటి దుర్మార్గులుం

డనే యుందురు. వారికి స్వార్థ సాధనమే ప్రధాన ధర్మము. దైవమును నమ్మినట్లుండి—నమ్మరు. కొందరు నమ్మినను—మార్గ మెరుఁగరు. కరుణాహీనులు వెఱ్ఱియావేశమునకు లోఁబడి— కాలమును రక్తపంకిల మొనర్చి పోవుదురు. వారి చూపు చాల సంకుచితము. వర్తమానమున దమ కార్యములు సాధిం చుకొనుట వరకే వారి బుద్ధి పనిచేయును. దానికైన యుప మార్గములనే వారను సరింతురు. ఒకా నొక మతమునకు— విధర్ములచేఁ గల్గిన యపకారముల కంటె' యిట్టివారి చేగల్గు నపకారములే ఎక్కువ. అట్టి వారిలో నాకుమారుడొక్కడగు నేమో యని నా దుఃఖము"

ఇంతలో నయేషా అక్కడకు వచ్చినది. ఆమె ముఖ ము లజ్జావినమ్రమై ద్విగుణీకృత సౌందర్యముఁగ నుం డెను.

"దాదా! స్నానమునకు నీరు కాచినాను. వారు స్నాన ము చేయుదురో ముఖము మాత్రము కడుగు కొందురో యడుగుడు"

మాలానా సాహేబు బిడ్డవైపును, శాస్త్రి ముఖము వైపును చూపులు మార్చి మార్చి చూచెను.

"దాదా! మీాకు వృథాగా కష్ట మెందుకు నదిలో స్నానము చేతును."

"వలదు నీరు కాగినది. ఇక్కడే స్నానము చేయుము. నీవిచ్చట దేనికిని సంకోచపడవలసినది లేదు. ఇది మీాయిలు

నీగాయము పూర్తిగ నయమై నీవు మరల మొదటి మనుష్యు డవగు వరకు. తర్వాత నీయిష్టము వచ్చినన్ని దినములు మా యింటిలో నుండవచ్చును. ఆవిడ నాబిడ్డ. అయేషా” వృద్ధుడు సంతోషముతో నవ్వినాడు.

అయేషా తండ్రిమాటలువిని నారాయణశాస్త్రి స్నానమునకు తయారుచేయుటకు పోయినది. ఆమె కనుమరుగగు వరకు నావైపే జూచుచున్న మౌలానాసాహెబు యిట్లు పల్కెను.

“బేటా! నాకు “ఉస్మాన్” ఒకకన్ను “అయేషా” ఒక కన్ను. కాని వీరిరువురిలో నెంత వ్యత్యాస మున్నది! ఒకేతల్లి సంతానము. కాని గుణస్వభావాదులలో వీరికి పోలికయేలేదు; ఒకొక్కసారి యీవిషయమును తలచినచో నాకే యాశ్చర్యమగును. దయామయుడైన భగవంతుడు ఒకకంటి యొక్క కాంతిని మరియొక్క కంటికివ్వలేదు. అణువణువునను సృష్టిలో నెంత వైచిత్రియున్నది! ఉస్మాన్ తల్లిని బోలినాడు. “అయేషా‘ నన్ను బోలినది.”

“అయినచో నన్నా చెల్లెండ్ర కంతప్రీతి లేదన్నమాట”

“లేకేమి. వారిరువురి ప్రకృతిలో నెంతభిన్నత యున్నదో, వారి ప్రేమలలో నంత యైక్యతగలదు. చెల్లెలన్నచో నా కుమారునికి ప్రాణము. ఆమె ముఖముపై నేదైన చింతచూచినచో నాదినము వాడన్నమే దినడు. చిఱునవ్వు పారాడినచో వానియానందమునకు మేరయేలేదు. వారిద్దరి సౌహార్దమే

నా జీవనమున కూతకోల. భగవంతుడు వీరిరువురిని చక్కగా రక్షించిన జాలును. నేనింతకన్న వాని నేమియు కోరుట లేదు."

ఈమాటలు పలికిన 'మౌలానా' యేదియో యోచించుచు గూర్చొనెను. మరల నయేషావచ్చి పిలిచినంత వరకా తని కెచ్చరికయే లేదు.

౧౦

మౌలానాసాహేబు, అయేషా చేయుచున్న యుపచారములచే నారాయణశాస్త్రికి జబ్బుకొంత గుణముగా నున్నది; కాని యీతడు ముందటివలె లేచిపోగాడుటకు మరి కొన్ని దినములు గావలసి యున్నది. మౌలానా నారాయణ శాస్త్రిని కన్నకొడుకువలె జూచుకొనుచున్నాడు. అయేషాకు గూడ శాస్త్రిపై నేదో గొప్ప యాత్మీయత యుండెను. ఇపుడామె ముఖముపై ముందటి సంకోచము లేదు. ఇంటి కథలు మొదలుకొనినాటి రాష్ట్రీయ రాజకీయముల వరకును విమర్శించుకొను చుండిరి. వేదాంతము మొదలుకొని, పాకశాస్త్రము వరకును మాటలాడుకొనుచుండిరి. ధర్మవిషయములు చర్చకు వచ్చినచో జాలును. మౌలానాసాహేబునకు ఱెక్కలు మొలచుకొని వచ్చెడివి. అతడు గంటలకొలది ధర్మోపన్యాసములొ నగు చుండెను. మాటలలో భోజనముకూడ కొబట్టదాయెను. "అయేషా" భోజనమునకు రమ్మనును. అతడు లేవడు. ఆమె శాస్త్రికి సైగచేయును. అతడు మాటలు చాలించును. అప్పటికిగాని మౌలానా లేవడు. ఒక్కొక్కసారి చర్చలలో నయేషా

పాల్గొనెడివి. ఆవయస్సు నకును—ఆమాటలకును సంబంధమే లేదు. ఆమె తండ్రి యొద్ద నెన్నియో విషయములు విన్నది. ఆమె వాదనము లపుడపుడు నారాయణశాస్త్రినే నిరుత్తరుని గావించెడివి.

ఈమాటలనుజూచి మండి పడు వాడొక్కడే ఉస్మాన్ తన తండ్రి, చెల్లెలు యెవరో కుల గోత్రములు తెలియని యొక కాఫర్‌తో చనువుగా మాటలాడుట సహింప రాని దయ్యెను. వాని దృష్టిలో దాను కల్మి లేని మహమ్మదీయుడు తండ్రి కీర్తి వాని గర్వమునకే తోడుపడినది. అట్టి తన యింటికొక హిందువు—అందులో బ్రాహ్మణుడుండుట—వానికి కంటకముగా నున్నది. అందులో దన చెల్లెలికింకను పెండ్లి కాలేదు నలువు రేమను కొందురు? నారాయణశాస్త్రి తలపై పుండు కొంతమాగు వారినది మొదలు వాడాతని నింటి నుండి వెడల గొట్టుటకు శతథా ప్రయత్నించెను.

"దాదాజీ! మీ రీకాఫర్‌లను నమ్మరాదు. అందులోను బ్రాహ్మణులు. వీరిని దగ్గరకు చేర్చరాదు. వీరితోనే టిప్పూసుల్తాను చెడెను 'మైసూరుపులి' యనిపించు కొన్న యాతడు రెండు సారులు యుద్ధమున నోడెను. ఒకసారి అంచె రామయ్య చేసిన యుపాయము సుల్తాను గారి పరాజయమునకుం గారణము. ఈసారి తోషీ ఖానా కృష్ణరాయలు మన వీపున గత్తిపోటు పొడిచెను. ఆముసలి గువ్వ—మహారాణి లక్ష్మమ్మకు వీరందరును గావలసిన వారు. ఇంతయైనను

మన సులాను ఆ మైసూరు మహారాణిని ప్రాణములతో నెందుకుండ నిచ్చినాడో తెలియదు. నాకాజ్ఞ యొసఁగినచో నిమిషములపై నామెను పరలోకమున కంపెదను. శత్రుశేషము నుపేక్షించుట మంచిది గాదు. కాని యేమిచేయవచ్చును? సుల్తానుగొప్పయుదారుఁడు.ఆతనియౌదార్యమే యింత చేటునకుఁ గారణము. గడచిన యుద్ధమునటిప్పూ యోడుటకుఁగారణముపూర్ణయ్య.అతడింగ్లీషువారితో లాలూచి పడినట్లున్నది. ఇంతకును పూర్ణయ్య మంత్రిత్వము—మైసూరు రాజ్యమును నాశము చేయుననియేనాయనుమానము. జనులు గూడ నామాటయే యనుచున్నారు. ఈకష్టములతో సుల్తాను నల్లాయే కాపాడవలెనుఇట్టి పరిస్థితులలో మనము చాల జాగ్రత్తగ నుండవలెనుమనము సుల్తానుగారి యన్నముతిని బ్రతుకుచున్నాము. వారికి విద్రోహుల నుండియే కష్టమును రాకుండ చూచుకొనుట మనకర్తవ్యముఇటువంటిసమయమునమన మొక కాఫర్ ను దగ్గర చేర్చుకొన్నామన్న విషయము బయటికి పొక్కినచో మనలను జనులేమందురో మీరూహించుచున్నట్లు లేదు”

‘మౌల్వీ సాహేబునకు పిచ్చి పట్టినదని యందురు. అంతేగదా!’

“అంతమాత్రముతో పోనివ్వరు. మనబంధువులు మనలను బహిష్కరింతురు. సులతానున కీవిషయము తెలిసినచో నాకొలువు పోవును. మనము వీధిలో బడవలసి వచ్చును.

అప్పుడు మనల నెవరు రక్షింతురు?

"అందరిని రక్షించు దేవుడే మనలను రక్షించును."

"ఈమాటలకేమిలే! రేపుమన 'అయేషా' నెవ్వరు పెండ్లి చేసికొందురు.? మీ పిచ్చికోసరము అయేషాను బలి పెట్ట దలచితిరా?"

"అయినచో నీవిప్పుడేమందువు?"

"నారాయణశాస్త్రి మనయింటిలోనుండుట నాకిష్టము లేదు. అతనినుండి మనకు బాలకష్టములు వచ్చును. జనులలో నీవార్త వ్యాపించుటకు ముందే మనమాతనిని పంపివేయుట మంచిది."

"కానిమ్ము! అతనికారోగ్యము కుదురనిమ్ము. తరువాత పంపించివేయు సంగతినిగూర్చి యాలోచింతము. ఇప్పుడాత డున్న స్థితిలో మనము పంపించి వేసినచో మనుష్యులేమనుకొన్న ను దేవుడు మనలను మెచ్చడు."

"అట్లేకానిండు. ఇకనొక నాలుగు దినములు మాత్ర ము. అంతలోపల మీరాతనిని పంపించివేయవలెను. లేకున్న చో నేనే బయటికి పోయెదను. మీకు కోపము వచ్చిననూ సరే. నన్ను దండించినను సరే. ఈవిషయమున నేనెవ్వరిని లక్ష్యపెట్టను?"

ఈమాటలనుచునే వాడక్కడనుండి వెడలిపోయెను. మౌలానా కేమిచేయుటకును పాలుపోక కూర్చొన్నాడు. ఈమాటలువిన్న నారాయణశాస్త్రి—

"దాదా! నాదొకకోర్కె యున్నది. దయచేసి మీరది నెరవేర్చవలెను."

దీనముగ ప్రార్థించెను.

"బిడ్డా! ఏమది?"

"నాకొరకై మీ కుమారునితో మీరు వాదించుకొనుట నాకిష్టములేదు. నేను వెడలిపోవుట కనుజ్ఞయిండు. ఏదో నాగతి యెట్లున్న నట్లేయగును. అతడు మిమ్మాడుచున్న మాటలు నేను వినలేను. మీరు నాకొనర్చిన సాయమును మాత్రము యీ జన్మమున మరువలేను. మూడుకాలములందును భావించుకొనుచుందును."

"ఏమనుచున్నావు?"

"అవును. దాదాజీ! సుఖసంతోషములు నిండిన మీ కుటుంబమునందు నేనొక యరిష్టమువలె బ్రవేశింపరాదు; తండ్రి; కొడుకు లయిష్టమునకు మూలముగారాదు. మీరిదివరకు నాకుఁజేసిన యుపకారమే,నామూడుజన్మముల కృతజ్ఞతకు జాలును. మీవంటి దేవతాపురుషుల యింటకాలిడి,యాతిథ్యమునుస్వీకరించి మీకు కళంకమును తెచ్చినచో దేవుడునన్ను మెచ్చడు నేనికపోయివత్తును. సెలవిండు."

నారాయణశాస్త్రి లేచుటకుఁబ్రయత్నించెను. కాని యాతనికాళ్ళలోను, వ్రేళ్లలోను తగినబలములేదు. అతడతి కష్టముతో లేచికూర్చొన్నాడు. ఈశ్రమచూచి మౌలానా సాహేబునకు గుండెబగిలినట్లుండెను.

• "బేటా! నీవు 'ఉస్మాన్' అన్నమాటలకు చాల వెల యిచ్చుకొనుచున్నావు. వానిని నీవు లెక్క చేయవలసినది లేదు. ఈ యింటికి యజమానిని నేను. నాయిచ్ఛకు విరుద్ధముగ నిన్నెవరును బయటికి పంపలేరు. అంతపనియైనచో నేనే యీ యింటినుం  ిడలి పోయెదను.'

"నాకొరకై మీరు కుమారులతో ద్వేషము కట్టుకొనుటయా? ఇది యెంతమాత్రమును దగనిపని."

"బేటా! ఉస్మానును మెప్పించుటకై నేను నీకాశ్రయ మొసగలేదు. వాని స్నేహితుల మెప్పునకుగాదు. సమాజములో గౌరవము వచ్చుననియుగాదు. అల్లాకు సేవకుడనై ఇట్లు చేసితిని. నాయాత్మ చూపిన మార్గములో నడచుచున్నాను. నాకర్తవ్యమునుండి నన్నడ్డగించుటకు ఎవ్వరికిని శక్తి లేదు. అది వేరువిషయము. అంతటి సమయమే రాదు. నీకు ఉస్మాన్ స్వభావము తెలియదు. వానిమాట కొంచము కఠినముగా నుండును. కాని మనస్సు చాల మృదువైనది. దానికి మనము భయపడవలసిన పనిలేదు. ప్రపంచమెవ్వరినిగాని నిందింపక వదలదు. తప్పుచేయనివారిని గూడ నిందించును. దానికి ఎక్కువ వెల యిచ్చుకొన్నచో మానవుడు కర్తవ్యమును నెరవేర్పలేడు. ప్రపంచ మెప్పుడును బాహ్యైకదృక్కు. అందులో నెన్నియో యభిరుచులు. ఒకనికి మంచిదైనది, మరియొక్కనికి గాదు. ఇట్లున్న బాగుండునని యొకడన్న—కాదిట్లుండవలెనని మరియొకడనును. లోకమున ననేకులు ధర్మభీరువులు. కాని, ధర్మ

మును నమ్మినట్లు నటించుచుండెను. వారియాస్తికతయు నింతే. "ఉస్మాన్" మాటలకు నీవు భయపడరాదు. వానివలెనే నీవు గూడ నాకుమారుడవు. వాడు నాకడుపున బుట్టెను. నీవు నా కభిమాన పుత్రుడవు. కనుక నీవు నాసమ్మతిలేనిదే యిక్కడ నుండి కదలుటకు వీలులేదు."

ఈమాటలకు నారాయణశాస్త్రి బదులు పలుకలేదు. కాని ఉస్మాన్ మాటలు—ఆతనిని బాధింపక పోలేదు. అప్పటి నుండి నారాయణశాస్త్రి 'ఆయేషా'తో మాటలాడు చున్నపుడు చాల హెచ్చరికతో నుండెడివాడు.

ఆమె యొంటరిగ నున్నపుడాతడు మాటలాడుటయె లేదు. మౌలానాసాహెబుతో మాత్రము మనసు విప్పి మాటాడు చుండెను. అతడింటలేనపుడు నారాయణశాస్త్రి నోటికి తాళము. కాని యిట్లున్నను నారాయణశాస్త్రి అయేషా వీరి నడుమ—ఏదో యొక యవిదితమైన మానసిక సంబంధము యెదిగి కొని పోవుచున్నది. తండ్రిగారి పరిత్యాదరములకు పాత్రుడైన శాస్త్రిని, ఆమెయెంతో గౌరవముతో — అభిమానముతో జూచుచుండెను. గాయము మానుకొలదియు నారాయణ శాస్త్రి కారోగ్య మెక్కువచ్చుచుండెను. తాను బోవుదునని యాతడన్నపుడంతయు మౌలానా, అయేషాల హృదయములో నేదో మోహబంధ మాక్రమించుచుండెను. వాతావరణము గూడ నట్లేయుండినది.

"ఉస్మాన్" కాపలా రాత్రివేళలందు. ఒక్క నిమేషము

గనుమూయడు. సులతాను రాజ్యరక్షణ యంతయు దనచేతి లో నున్నట్లు వానిభావన. పగలంతయు నింటిలో నిద్రించును. సాయంకాలములలో స్నేహితులతోడి సంభాషణలు. ఇది వాని దినచర్య. మౌలానా తనపనికొలది బయటికి వెళ్లివచ్చెడి వాడు. మధ్యాహ్నమునకు తిరిగివచ్చును. సాయంకాలము పెద్దమసీదునకు బోయినచో రాత్రి యెనిమిది గంటలవరకును ప్రార్థన చేసెడివాడు. అప్పుడు నారాయణశాస్త్రి అయేషా యిద్దరే యింటిలో నుండెడివారు. శాస్త్రి ఏదో పని మిష పెట్టి బయటికి బోవును. మౌలానా యింటికివచ్చుసరికి ఆతడును వచ్చుచుండెను. కాని యొకటేరీతిగ నుండుట లేదు. ఒక్కొక్క దిన మున శరీర మనారోగ్యముగ నుండును. అప్పుడాతడు విధిలేక యింటిలోనుండెడువాడు. అపుడాతనికి "అయేషా" ప్రియ సాన్నిధ్యమున మాటలు, కథలు, లభ్యమగును. అట్టి సమయ ములలో అయేషా ముసల్మాను స్త్రీయైనను ఆమె ఎంతయో యందగత్తెయని గుణశాలియని నారాయణశాస్త్రి తలపోసెడి వాడు.

"అయేషా"ను చూచినపుడు నారాయణశాస్త్రికి గత కాల స్మృతియొకటి పునరంకురితమగును. అయేషా మాటలు ప్రవర్తన తన 'భారతి'ని జ్ఞాపకమునకు దెచ్చుచుండెడివి. ఆమె బ్రతికున్నచో యౌవనము వచ్చినచో నామెగూడ నట్లే యుండెడిది. అయేషాకిపుడు బాల్యము గడచినది. యౌవనము కన్నులయందు, గల్లములందు—పెదవులయందు వక్షస్సునందు

గ్రీమముగా దొంగిచూచుచుండెను. బాల్యమున నామెకన్ను లు నేరుగా మాటాడెడివి. ఇప్పుడవి వక్రోక్తిని నేర్చుకొన్నవి. చూచుచుండగనే ముఖము దినమునకొక యందమును సంతరించికొనుచుండెను. అదేచిరునవ్వు. అవేముంగురులు, అవే మితభాషణములు. మితమైన ప్రవర్తనము. భారతి 'అయేషా' నీరిద్దరి నొకే మూసపట్టులతో బ్రహ్మదేవుడు సృజించెనని నారాయణశాస్త్రి తలచెను. "అయేషా" మాటలాడినపుడు, చూచినపుడు, ఆమె ప్రియసహవాసము తనకు లభించినపుడు— అంతకుముందు నివురుగప్పిన నిప్పువలెనున్న భారతి స్మృతి మరల వాని హృదయములో సెలవేసెడిది. ఆ మధుర స్వప్నములను తలచుకొని వాడు దుఃఖించుచుండెను. ఆగడచిన కలల నొక్కొక్కటిని భావించుకొని క్రుంగిపోయెడి వాడు. అప్పుడప్పుడు నిద్రలలో "భారతీ"యని కలవరించుకొను స్థితికి వచ్చినది వాని భావన.

ఒకసారి "మౌలానా" నారాయణశాస్త్రితో మాటాడుచు "బిడ్డా! భారతి యెవరు? ఆమె యొకదేవతయా? మీ హిందువులలో ననేక దేవతలున్నారు. ఎందుకామాటను మాటిమాటికి కలవరింతువు? అనియడిగెను. శాస్త్రి తలవంచుకొని యిట్లనెను.

"దాదాజీ! తండ్రివలెనన్ను బెంచిన మీయెదుట నా రహస్యమును విప్పి చెప్పుటకు సంకోచ మేమున్నది? అది నా బ్రతుకునకు భాగ్యదేవత పేరు. అంతటిదేవిని పొంది నిర్గతికు

డుగా బ్రతికియుండు దురదృష్ట వంతుడను నేను.”

భారతితో తనకు వివాహమైనది మొదలు ఆమె యదృశ్యమైనంతవఱకు శాస్త్రి దాదాజీకి వినిపించెను.

దాదా! ఆమెను గురించి ఇప్పటికేమియు దెలియదు. బ్రదికినదో! మరణించినదో! ఆమె జీవించియుండునేమోయని సందేహము వచ్చును. కాని యామె బ్రతికి యుండినచో–నేదో యొకరీతిగా వర్తమానము నాకందియుండెడిది. భారతి బ్రతికి యున్నదను నాస నాకు లేదు. శత్రువులకు జిక్కిన నశించి యుండునని నాయనుమానము. ఈసమాచారము జ్ఞాపకమునకు వచ్చినచో బ్రదుకుపై నసహ్యము వేయును. అది బ్రదుకుట చేదుమ్రింగు చున్నట్లు భావింతును;”

“బిడ్డా! నీదుఃఖమును నేనర్థము చేసికొన్నాను. కాని జీవితమున నిట్టి యగ్ని పరీక్షలు తప్పవు. దైవము పరీక్షించుట కిట్టి సన్ని వేశములు గల్పించును. ఇట్టి సమయములందే మన ము ధైర్యముగ నుండవలెను. హతాశులము గారాదు, గడచి పోయిన దానిని గూర్చి తలంపక రాబోవు దాని కెదురు చూచు టయే కర్తవ్యము. భయపడిన లాభము లేదు.

తన జీవితమున నడచిన యనేక సన్నివేశములను ‘మౌలానా’ యుదాహరించెను.

నిజము దాదా! గడచిన సుఖములను గూర్చి తలపోసిన చో బ్రయోజనము లేదు. కాని–యీజన్మమున భారతిని నే నెట్లు మఱతును. మరచుటకు సాధ్యమగునా!“ అతడు మఱల నేడ్చుట

కారంభించినాఁడు.

"బేటా! అన్ని రోగములకు కాలము దివ్యౌషధము. అది మాయింపని గాయము లేదు, మఱచి పోనివ్వని సన్నివేశ ములేదు. జీవితమొక యనుభవముల సంపుటి. మనుష్యుఁడనేక గుణ పాఠములను జీవితములో నేర్చి కొనును. బ్రదుకు తల్లి వంటిది. కష్ట సుఖముల నొసఁగి యది మనలో మానవత్వము ను జీవింపఁజేయును. జీవిత మొసఁగిన వానిని చిరునవ్వుతో గ్రహించిన నాడే జీవితమున కర్థము. ఇదియే సౌఖ్యమునకు దారి. ఒకదానిని గూర్చి నిరంతము దుఃఖించు చున్నచో-బ్రి యోజనమే మున్నది. చేతనున్న వర్తమానమును గూడ బాడు చేసికొందుము. అదిమంచి పద్ధతిగాదు."

"దాదా! హృదయమున దీవ్రముగ జిచ్చు రేగినది మరి శాంతి యెట్లుదొరుకును?"

"దొరికించుకొనవలెను. లోపలిచిచ్చును బలవంతముగ నార్పవలెను. అప్పుడే మనస్సునకు నెమ్మది. నీకింకను చిన్న వయస్సు. జీవితమున మహత్వాకాంక్ష యున్నది. గడచినది మరచి నూతన జీవితమున నడుగుపెట్టవలెను. నీకు దగిన మరి యొక కన్యదొరకవచ్చును. మేఘములు కమ్మిన జీవితాకాశ మున మరొక మెఱుపు మెఱువవచ్చును."

"దాదా! యీమాట యనుట సులభము. జరుగుట మాత్రము కష్టము. భారతిని మఱచి వేరొక్కరిని పెండ్లాడిన చో-నామె కన్యాయము చేసినట్లుకాదా!" ఈ మాటకు

మౌలానా నవ్వెను.

"బిడ్డా నీవింకను బ్రదుకునకుఁ గన్ను దెరచుచున్న శిశువువు. జ్ఞాపకము క్షణభంగురమనుట నీవు గమనించినట్లు లేదు. అదెగాఢముగఁ బెఱుగును. మఱలఁదఱుగును. గాయము మెల్లప్పటికిని బచ్చిపుండుగా నుండదుగదా! దానినొప్పి క్రమక్రమముగా దగ్గిపోవును. భగవంతుఁడు మానవునకొసఁగిన గొప్పవరము మఱపు. నీవింకను విరహముతో బాధపడుచున్నావు. నామాటలలోని సత్యము నీకిప్పుడే తోచదు. కాని—కాలముగడచుకొలఁదియు నీవుగూడ నందరివలెనే భారతీదేవిని మఱచి—బ్రతుకవలసివచ్చును. అంతవఱకును నీమనస్సు పక్వమగు వఱకును—భారతి మెదలాడుచుండును. తరువాత నావిడ యొక సుఖమయస్మృతి గడచిన యొక మజిలీ."

దాదాజీ యీవిషయము నక్కడకు ముగించినాఁడు; విరహియైన నారాయణశాస్త్రి మనసులో "అయేషా" తొలకరి మెఱుపువలె మెఱసినది. ఆమెగుణములు చూచిన శాస్త్రి తాను బ్రాహ్మణుఁడు. ఆమె మహమ్మదీయురాలను సత్యమును గూడ మఱచి యామెలో లీనముగాజొచ్చెను. తనకు తెలియకనే యామెకు దనమనస్సున స్థానమిచ్చికొన్నాడు. ఇప్పుడాతని యాలోచనలు మరియొక దిక్కును బట్టుకొని ప్రాకుచున్నవి. తన హృదయమున స్థానమిచ్చుకొన్న సంగతి అయేషాకు దెలియునా? తెలిసినచో నామె ప్రతిక్రియయేదీ? 'అయేషా' మాత్ర మీవిషయము నెల్లను తెలియనిదాని

వలె యెప్పటివలెనే యాతనికి సేవలొనర్చుచుండెను. ఆమె విషయము నారాయణశాస్త్రి కొక సమస్యయైనది. బహుశః తనప్రీతికిఁదాను పాత్రుడుగానని తలచెనేమో! తన కరుణ కథను విని—సానుభూతిచూపించినను తాను వివాహితుడనన్న విషయము తలచి మౌనమునవహించినదా యేమి? ఏవిషయ మును వానికి స్పష్టముగ తెలియలేదు. ఆమె భావము వానికి మేఘాంతరితమైన చంద్రరేఖవలెనున్నది. నవకిసలయా చ్ఛాదితమైన పూగుత్తివలె నున్నది. గాలివీచినపుడా దృశ్య ము తళుక్కున మెఱయును. అంతలో నంతరితమగును. ఈమె హృదయమును గనుగొనుటయెట్లు? వానియాలోచన యిదియే యయ్యెను దాని పరిణామము శరీరమున గనపడినది. మఱల వాఁడు నానాటికి దీసికట్టయి పోవుచున్నాడు.

మహాలానాసాహేబున కీస్థితినిజూచి యధైర్యమయ్యెను. ఏదో తనకు తెలియరాని చింతతో నారాయణశాస్త్రి బాధపడు చున్నాడని యతఁడు పసికట్టెను. అతని మనోవ్యథ ఇదియని తెలియుటకు మార్గమేది? ఒకదినమున నాతడు శాస్త్రిని ప్రశ్నించినాఁడు.

"బిడా! ఏదేదియో తలచుకొని గాఢముగ దుఃఖించు చున్నావు. నీయారోగ్యము నానాటికి క్షీణించి పోవుచున్నది. ఆచింత ఏమిటో చెప్పరాదా!"

'దాదా! కన్నతండ్రినిమించి నన్ను పెంచితివి. నీవద్ద దాచుకొను విషయమేదియు లేదు. నానుండివిూకు మనశ్శాంతి దూరమగుచున్నది. ఈయూరికి నేను వచ్చినపని చేటు. అది

నెరవేఱలేదు. ఈ రోగము దాపురించినది. మీరాగాశ్రియు మొసఁగితిరి. అందులకు మీకు గలిగిన ఫలము యింటిలో నల జడి. ఈపరిణామము లెందుకాయని యాలోచించుచున్నాను.' నారాయణశాస్త్రి బరువుగా నిట్టూర్చెను.

"ఇందుకా నీచింత! ఇదిచాల చిన్నవిషయము. ఇట్టి యల్ప విచారములనన్నిటిని పెద్దచేసికొని శరీరారోగ్యమును జెడగొట్టుకొనకుము. నీవలన మాకేమియు కష్టముగలుగుట లేదు. ఇది నీయిల్లేయనుకొనుము. నీవిచ్చట దేనికిని సంకోచ పడనవసరము లేదు. నీవు వచ్చినపని గూడ తొందరలో సఫల మగునను నాశ నాకున్నది. నాకొక స్నేహితుఁడున్నాఁడు. అతని పేరు హాబిబుల్లా. అతను సుల్తానుగారికడ గొప్పయుద్యో గములో నున్నాడు. అతని మూలమున నీకు టిప్పుగారి దర్శ నము సేయింతును. కాని, ఆపనికన్నను నీయారోగ్యరక్షణము ముఖ్యమైన విషయము. శరీరము భగవంతుఁడు నివసించు రథ ము వంటిది. అది బలహీనమైనచో నీకార్యమును సాధింప లేము. కనుక జాగ్రత్తగా నీశరీరమును గాపాడుకొమ్ము. తక్కిన ఏర్పాటులు నేను జూచికొందును."

ఈమాటలు విశ్వాస పూర్వకముగ దాదా యన్నాడు. నారాయణశాస్త్రి ముఖమున గొంత కళ వచ్చినది. ఆముఖ మును గమనించిన మౌలానా సంతోషమే సంతోషము. అతడు దనపనిపై వెడలిపోవుచు బిడ్డతో నిట్లన్నాఁడు

అమ్మాయీ! యీనాడు ఉస్మాన్ కొంతయాలస్య

ముగా వచ్చును. శాస్త్రి కాకలిగినచో గాచికొన నవసరము లేదు, నేనును తొందరగా వత్తును."

శాస్త్రి మరల నాలోచనా ధీనుడయ్యెను. సుల్తానుదర్శన మాతనియాలోచనలలోని యొకభాగమే, మరొక్కచింత యతనిని వేధించుచున్నది.

"అయేషా" వదనమున మాత్రము చిఱునవ్వు చిత్తడి గురిసిపోయినది.

ఆమె చాలదినములనుండి యెదురుచూచుచున్నసదవకాశమిప్పుడు, శాస్త్రి నేకాంతముగా జూచి—తనహృదయ భావములాతనితోఁ జెప్పవలెనని యామెకోరిక. కాని—దానుమహమ్మదీయస్త్రీ 'అతండు బ్రాహ్మణుడు. ఈవిషయముజ్ఞాపకము వచ్చునరికి—ఏదో సంకోచ మడ్డువచ్చుచుండెను. ఎట్లయినను—తనహృదయమును బయటబెట్టుటకు నేడొక సన్నివేశ మేర్పడినది.

ఆమెగూడ దనకుఁ దెలియకయే శాస్త్రికి, దనమనస్సున స్థానమిచ్చినది. దయనీయమైన యాతనికథను—విని—తొలుత సానుభూతికలిగెను. ప్రీతికరములైన మాటలు—ఆతనిప్రవర్తనము క్రమముగా సానుభూతిని అనురాగముగా మార్చివేసినది. కాని యీ భావమును బయటికి ప్రకటించుట కామెకు ధైర్యము లేదు. మొదటిది తనయున్న యుస్థాను భయము, రెండవది తాము భిన్నజాతికి జెందినవారమన్న సంకోచము. మరి తన ప్రేమ యీ జన్మమున సఫలమగునా! దానికి తన తండ్రి,

అన్న, సమాజము సమ్మతించునా! [illegible] శాస్త్రి మనస్సులో నేభావమున్నదో! ఆమె [illegible] మార్పులను గమనించును. అవి యొకప్పుడు దర్పైన ననుకొనును [illegible]  ఆయింతలో మ్లానములగును. [illegible] నకోణమున శృంగేరి కథ జ్ఞాపకమునకు వచ్చును. లేక భారతి తలఁపున మెదలును.

"అయేషా" స్థితి—

"అయేషా" తండ్రి నిజమైన యిస్లాము మతస్థుఁడు. మహమ్మదీయులలో నాతనికి మంచి పేరుండెను. ఆయూరిలో చాలమంద యాతని మాటను మన్నించుచుండిరి. "అయేషా" అతని ఏకైక పుత్రిక. చిన్ననాడే యామె తల్లి గతించెను. తండ్రియే యామెను దలివలెఁ బెంచినాడు. ఆమెనతడు దన యెదపైననే బెంచెను. ఆమె మాలానాకు సర్వస్వమును. ఉస్మాన్ అతని ఏకైక పుత్రుడు.వీరిద్వారాతని రెండుకన్నులు కుమారునిలో నాతడు భగవంతుని గాంభీర్యమును గాంచెడివాఁడు. అయేషా పరాత్పరుని కరుణకు బ్రతీకము. అతని మధుర మందహాసము. తనయింటి నాతడు రెండు దీపములతో వెల్గించికొనెను. ఆసంతానమొక తల్లి బిడ్డలు. కాని వారిగుణములలో నెంత భేదమున్నది? ఎందుకుండదు? దైవసృష్టియె విచిత్రమైనది! వైచిత్రియె వాని ప్రధాన లక్షణము. దాదా సమర్థించికొనెడివాఁడు,

ఉస్మాన్ హఠవాది. కఠినముగ మాటలాడును. అయేషా మృదుత్వమునకు గోమలత్వమునకు బ్రతిరూపు. ఉ

స్మాన్ తన ధర్మము నంధముగ బ్రేమించును. దురభిమానము గూడ నెక్కువ. ఆయేషా కితర ధర్మములపై సానుభూతి యున్నది. అన్న వ్యవహార చతురుడు. ఆయేషా ముగ్ధ, వీరి ర్వురి నొకయెడ జేర్చు బంధము తండ్రి. వారికాతండ్రిపై ననన్యమగు ననురాగము. అన్నాచెల్లెండ్రకును—పరస్పరము ధృఢమైన భావ బంధముండెను. ఒకరికొరకై మరియొకరెంతటి త్యాగమునకైనను సిద్ధపడుచుండిరి.

“ఆయేషా సంశీత్వమును జూచి ఉస్మాన్ ఆమెనొక మొద్దుదానికింద లెక్కవేసి మాటాడెడువాడు.

“నీవు హతవాది” వని నూరానా కొడుకునకు జవాబు చెప్పుచుండెను.

తండ్రి కొడుకుల కిర్వురకు నొకటే యాలోచన. లోకములోని కష్టము కార్పణ్యము మొదలైనవాని తాకిడి ‘ఆయెషా’ కు దెలియదు. కఠోరమైన జగత్తుతోడి సంబంధమే యామెకు లేదు. ఈమె యెట్లు బ్రదుకునా! యని వారి యాలోచన.

ఆమెకు వివాహయోగ్యమగు వయస్సు వచ్చినది. తగిన వరుడు చిక్కలేదు. ఆమె స్వభావ శీలములకు తగిన వానికి తప్ప మరియొకనికిచ్చి వివాహమొనర్చుట “దాదా” కిష్టము లేదు. “ఉస్మాను”న కామెను దిలావర్ ఖానునకిచ్చి పెండ్లి చేయవలయునని వాని యభిలాష. వాడు దనకు మిత్రుడు. తన చెల్లెలిని వాడు చేయిపట్టినచో—తమ బాంధవ్యము స్థిరముగ

నుండునని "ఉస్మాన్" కోరిక. కాని "దిలావర్"పై నయేషా కిష్టము లేదు. ఈవిషయమామె తనతండ్రితో రహస్యముగ తెలిపెను. కుమార్తె కిష్టము లేదని తెలియునుగనుక — తండ్రి దిలావర్ తోడి సంబంధమునకు సిద్ధపడ లేదు. ఒకనాడుస్మాన్ చెల్లెలితో దిలావర్ విషయమును బ్రస్తావించెను. వానినిగూర్చి యేమేమియో బొగడెను. కాని యామె యుత్సుకతను బ్రదర్శింప లేదు. ఆమెను నిర్బంధించు కాఠిన్యముగాని, ధైర్యము గాని, "ఉస్మా"నునకు లేదు. వాఁడేమో సమయము వచ్చిన పుడంతయు దనమిత్రుని బొగడుచునే యుండెను. వాఁడామెలో పరివర్తనమున కెదురు చూచుచున్నాఁడు ఇట్టి స్థితిలో నారాయణశాస్త్రి 'అయేషా" హృదయమున తొంగిచూచెను. ఆమె తొందరపడు స్వభావముగలదిగాదు. చాలదినములామె నిమ్మళముగ యోచించెను. దిలావర్ ఖాను, శాస్త్రి, వీరిరువురి నామె హృదయమను తక్కెడలోనుంచి పలుమాఱు తూచుకొన్నది; ఏ గుణమున జూచినను శాస్త్రితో దిలావర్ఖు నకు పోలిక లేకుండెను. శాస్త్రిని వివాహమాడినచో తాను సుఖపడుదునన్న నిర్ధారణకామెవచ్చినది. ఆమె హృదయము ననే తన సర్వస్వమాతని కర్పించెను. అతని యభిప్రాయమును కనుగొనుటకామె యాతురపడుచుండెను. ఈ విషయమామె తెలిసికొనుటెట్లు? నారాయణశాస్త్రితో నామె తనయభిప్రాయమును బ్రస్తావింప వచ్చునా? అతఁడేమనుకొనునో! తమయిర్వురవి వేఱువేఱు ధర్మములుగదా! తన తండ్రి తమ

వివాహమునకు సమ్మతింప వచ్చును. అన్న సమ్మతింపడు. ఆతని నొప్పించుటెట్లు? తమ యెదుట సమాజము పెద్దరాక్షసి వలె నోరు దెఱచికొని యున్నది. దానిని తృప్తిపఱచుటెట్లు? ఈ యాలోచనలతో నామె సతమతమై పోవుచున్నది. ఆమెకు పరిష్కార మార్గము స్ఫురించుట లేదు.

తండ్రి చెప్పినట్లు నారాయణశాస్త్రికి అయేషా భోజనము తెచ్చిపెట్టి వెడలిపోయినది. కాని యాతడు దానిని ముట్టలేదు. ఏదో యాలోచించుకొను చున్నాడు. దానిని గమనించి అయేషా "భోజనము చల్లగా నై పోవును. తామేదో యాలోచనలో మునిగినారు." ఆమె తిన్నగా నవ్వినది,

ఆ మందహాసము సానుభూతితో చేతోహారిగానుండెను.

"అదిగాదు అయేషా! ఎన్నిదినములు మిమ్మిట్లు బాధించుటయని యాలోచన."

"మీతో మేమే బాధననుభవించుచున్నాము. మీరు మాకు బాధయనుకొను చున్నది మా పాలిట సుఖముగా నున్నది." మరలనదే మందహాసము.

"ఎట్లు?"

"సరే కాని — ఆచారనిష్ఠులైన బ్రాహ్మణులు — మా యింట భుజించి కులము చెడిపోలేదా!"

"అంతేగదా! నారాయణశాస్త్రిగూడ నవ్వెను. అది అర్థరహితమైన నవ్వు. క్షణకాలము మౌనముగ నుండి మరల నిట్లనెను.

"ఏనాడుమాహిందువులైన మహారాష్ట్రులుతమగురుపీఠముపై దాడివెడలి స్వామినవమానించి-తమవారేయైనహిందువులపైననే యమానుషముగ నత్యాచారముల నడిపిరో—నాకే నామతాభిమానము మూడిపింజవలె నెగిరిపోయెను. లోకములోని యేయుద్ధములకును ధర్మశ్రద్ధ కారణముగాదనియు స్వార్థమువారి దైవమనియు దేల్చికొన్నాను. నాకీనాఁడేమతముపైనను అభిమానము లేదు. నేనీనాడు నమ్మెధర్మ మొక్కటే, అదిమానవధర్మము. విశాలసృష్టిలోని మానవకోటినంతయు దనవారని దెలిసికొను మానవధర్మము. తక్కినవాగ్ములకథ తరువాత. ఈభావమునకడ్డువచ్చుజాతి—మతము మొదలగునానార్థములన్నియు-నపకారకములన్న తలపీనాడు నాహృదయమున త్రిష్ఠవేసికొన్నది. ఈసముద్రముల కావలమనుష్యులున్నారోలేదో నేనెఱుగను. ఉన్నచో వారేజాతీయులోనాకుఁదెలియదు. ఒకవేళ ఈజన్మమునవారినిజూచుట దటస్థించినచో వారితోఁగూడఁబొత్తుగలిపి భుజించుటయే నేఁడునాకున్న భావము. ఇంకనీహిందూముస్లిం భేదము లేమున్నవి. ఈమహాధర్మమును బోధించినవారు మీతండ్రిగారు అతఁడుతలవంచెను.

"మీజీవితమున జాలకష్టములు పడినట్లున్నది. మీరిక్కడికివచ్చినప్పటినుండియు మీపైనాకెందుకో విపరీతమైనసానుభూతి,కాని—నాసానుభూతితో మీకేమియు బ్రయోజనము లేదు. నేనీజీవితమున మీవలెనే నిర్భాగ్యురాలను."

"అయేషా నీవు నిర్భాగ్యురాలవు. గావు. నావంటి వారికి స్ఫూర్తివి."

నేనంతటి భాగ్యశాలినా! ఆమె నారాయణశాస్త్రి ముఖము వైపు జూచినది.

"ఎందుకు కాదు. ఇంకను సందేహమా?"

"మీమనస్సు లోని యభిప్రాయము నేనెన్నడో గనుగొన్నాను, నాకు భారతి కున్న యోగ్యత లేదు. కాని యొక యాశ మాత్రమున్నది. నాసేవ మీకిష్టమైనచో—నేనొక చంద్రబింబముగ బ్రకాశింప లేకున్నను. చిన్న నక్షత్రము వలె"

అయినచో నీవింతగాఢముగనన్ను ప్రేమించుచున్నా వన్నమాట." నారాయణశాస్త్రి హఠాత్తుగా నడిగెను."

ఈమాటకయేషా మౌనముగ నవ్వినది. ఆమెతలవంచుకొని నేలవైపు జూచుచుండెను. శాస్త్రియె పలుకరించెను.

"అయేషా! ఎందుకీచింత?"

"మనప్రేమ శైలామజ్ఞా గాధవలె మారిపోవునేమో"

"మనము మానవ ధర్మముయొక్క విశాల ఛత్రము క్రింద నొకరైన ప్రేమికులము. లోక సంఘ దృష్టులలో భిన్న ధర్మములకు జెందిన వారము. ఈ విభిన్నతను మనము మఱచినను ప్రపంచము మరువదు."

మనసంబంధమునకు మీతండ్రి, అన్న సమ్మతించినచో లోకపుగొడవయె నాకక్కఱలేదు. నీవు నాదానివైనచో

అనంతత్యాగము నాకొక క్రీడామాత్రము."

"మా తండ్రిగారి విషయ మెట్లున్నను-మాఅన్న అంగీక రించునన్న ధైర్యము నాకు లేదు.

'ఎందుకు?"

'అతని కిస్లాము ధర్మముపై గుడ్డిభక్తి, వానిధర్మాభి మానము, ధర్మశ్రద్ధ, యీ వివాహమునకు సమ్మతింపవు. వాడు జీవించియుండువఱకు నేనొక సనాతన హిందువును వరించుటకు సాధ్యముగాదు. వాని ప్రాణము బోయినను దీని కంగీకరింపడు. నాకు తెలియును.

'అయినచో నీసమస్యకు బరిహారమే లెదా!"

'ఉన్నది. కాని అది సాధ్యమాయని నాయాలోచన.

'ఏమి? మతము మార్చుకొనుటయా

"అవును."

"నీకొఱకై నేను మహమ్మదీయుడనగుటకు సిద్ధముగ నున్నాను. ఆచింత నీకక్కఱలేదు. నీవు నాదానివైనచో సప్త సాగరములనైన జుట్టివత్తును."

"ఆయవసరము వచ్చినపుడా యగ్నిపరీక్ష. మనయిర్వురి సంబంధము—భగవత్సమ్మతమో గాదో నిర్ణయించుశక్తియు నాకు లేదు. ఒక్కటిమాత్రము సత్యము. నాకీవిషయమున స్వాతంత్ర్యము లేదు. నా హృదయములోని ప్రణయమిట్లే యింకి పోవలసినదే. నానుండి మీ కేయగ్నిపరీక్ష సంభవించి నను నాహృదయమును గాల్చివేయును. భగవంతునకు నే

నొనర్చు ప్రార్థన యొక్కటే. "అల్లా! ఇకమీద నైనను యీ తని జీవితమున క్రొత్త బాధలను సృష్టింపక శాంతినిమ్ము."

ఇంతలో ఉస్మాన్ లోనికివచ్చిన చప్పుడైనది. అలికిడి తోచిన దేతడవు అయేషా చరచర వంటయింటిలోనికి నడచి నది. శాస్త్రి నిదురించువానివలె నటించెను. అప్పుడే నిద్ర మేలుకొన్నట్లు—

"ఉస్మాన్‌గారూ! మీరు వచ్చినది తెలియనేలేదు." ఉస్మాన్ ఆమాట కుత్తరమివ్వనేలేదు. తిరస్కార పూర్వక ముగ శాస్త్రివైపు జూచెను.

అయేషా! నాయనగారేరీ!" వాడు నిలుచున్నచోటు నుండియే గర్జించెను.

"వారు మసీదుకు వెళ్లిరి"

"యింటిలో నిన్నొక్కదానినే వదిలి వెళ్లినారా?" ఈ మాటలలో వ్యంగ్య, హాస్యమున్నది. దానికామెబదులివ్వలేదు.

"వారికింత వయస్సు వచ్చినను లోకమర్మముగాలేదు. వెంట్రుకలు తెల్లబడినవేకాని బుద్ధి బాల్యమందేయున్నది. నాటివారందరతని నెవడో యొక మహాత్ముని వలె గౌరవిం తురు కాని మాదాదాకు వ్యవహార జ్ఞానము సున్న. ఈసారి దాదాజీ యింటికి వచ్చినచో నీవిషయమును స్పష్టముగఁ దెల్చి వేతును. మనయింటిలో నిట్టియనాచారములు సహింపలేను. ఈకాఫర్‌ను బయటికి పంపివేయకున్నచో నేనే యిల్లువదలి వేసెదను" వాని ముఖమొక పెనము వలెనున్నది బట్టలెనను

మార్చుకొనక వాడక్లే చదికిల బడెను.

"అన్నా! వంటయైనది. వడ్డింతునా?"

"నీభోజన మెవరికి గావలెను ఈకాఫరు కొక అన్న సత్రమేర్పాటు చేయండి. వీడు భోజనము చేసిన యింటిలో నేను భుజింపను. 'ఈమాటకు' అయేషా ఉత్తర మివ్వ లేదు. కండ్ల నీరు గ్రుక్కు కొని వంటింటి లోనికి పోయినది.

అంతలో మౌలానా సాహేబు యింటిలో బ్రవేశించుటతో పరిస్థితి కొంచెము శాంతించినది. 'దాదా' కుమారుని వైపు జూచెను, అతని ముఖము కోపరంజిత మైనది. వెంటనే శాస్త్రి ముఖమును జూచెను.

"బేటా! ఉస్మాన్!" వచ్చినావా! అని యనుచునే శాస్త్రితో "బిడ్డా! అన్నము తిన్నావా!" యన్నాడు.

"దాదా! నాకాకలి గాలేదు."

"ఈయుత్తరముతో నేదో రగడ జరిగినదని దాదా యూహించినాడు. నడచిన వృత్తాంత మేదో తెలిసి కొనవలెనని అయేషా యని పిలిచెను. ఆమె ప్రత్యుత్తర మొసగలేదు. అతడు మరియొక సారి పిలచినాడు ఆపిలుపుతో నామె యెదుట వచ్చి నిలిచెను. ఆకన్ను లెర్రవారి యుండెను. తండ్రి పిలిచినంతనే—అయేషా బాష్ప క్లిన్నము లైన కన్నులను దుడుచుకొన్నది. కాని యూతడి యింకను—ఆరిపోలేదు. అదృశ్యము నకాతడు గళవళపడినాడు.

"ఏమమ్మా! నేనింట లేనపుడేమైన రగడజరిగినదా?"

ఆమె తనయన్నవైపు జూచినది. ఉస్మాన్ సంభాషణ నందికొనెను.

"దాదాజీ! మీ కెంతవయస్సు వచ్చినను వ్యర్థము. యౌవనములోనున్న బిడ్డ నింటిలో నొంటిగా వదలి పోగూడదని మీకు దెలియదా? ఆవిషయమును గూడ మేమే చెప్పవలెనా? బయట మనయింటిసంగతిని లోకము కోడిగమై కూయుచున్నది."

"ఏమనుకొనుచున్నారు?"

"ఏమనుకొందురు? "దాదా" తనబిడ్డను కాఫరునకు "నికా" చేయదలచినాడనుచున్నారు. దానికై యొక్కపరదేశిని యింటిలో బెట్టి పోషించుకొనుచున్నారు. ఊరి కంతయు మనకథ నవ్వులాటయైపోయినది. నేనింక తలఎత్తుకొని తిరుగ లేను."

"ఇంతేగదా! ఇంత చిన్నవిషయమునకై నీవు మనస్సు చెడగొట్టుకొనవలసిన యవసరమేమున్నది? మొదలు అక్కలి కథ విచారించికొమ్ము. తర్వాత నీవిషయములు నెమ్మదిగ చర్చించికొందము." దాదా గుడ్డలు మార్చుకొనెను. కాళ్లు కడిగికొని వచ్చెను. ఇంతయైనను ఉస్మాన్ కూర్చున్నచోటు నుండి లేవలేదు. శాస్త్రిగూడ మంచమువిడిచి కదలిరాలేదు.

"బిడ్డా నీకొక మంచిమాట చెప్పెదను. అన్నము తినుము." మౌలానా శాస్త్రిని చిన్న శిశువువలె లాలించెను.

"దాదా! విషయమేమి?"

"నీవు భుజింతువన్నచోఁ జెప్పెదను."

"అట్లే కానిమ్ము."

"నీవిషయమంతయు మున్షీతో చెప్పినాను. రేపటి దినమువారు నిన్ను సుల్తానుకడకు తీసికొనిపోయెదరు."

"అయినచో నారొట్టెజారి నేతిలోపడినది."

"అందుకే నేయిదండిగా వేసికొని యన్నము దినుము" మౌలానా ఉస్మాన్ వైపుదిరిగెను. వాడక్కడ లేను. అటనుండి వెడలిపోయి చాలసేపయినది. మౌలానా కన్నుల నీరు దిరిగెను. ఎవ్వరు చూడకముందే వానినాతఁడు తుడిచివేసికొనెను.

౧౧

మరుదినమున నిశ్చిత సమయమునకు సరిగా మౌలానా నారాయణశాస్త్రిని మున్షీ అబ్దుల్లా కడకు గొంపోయి పరిచయమొనర్చెను. నారాయణశాస్త్రినిగూర్చి మౌలానా యింతకుముందే, మున్షీసాహేబుతో వివరముగ జెప్పి యుండెను. అందుచే మున్షీ శాస్త్రి నెక్కువ వివరము లడుగలేదు. పైగా నాతఁడు మితభాషి. మున్షీకి మౌల్వీసాహేబుపై నెక్కువ గౌరవము. అతనిమాటను దైవవాక్యముగ నెంచెడివాడు. దాదాపు నారాయశాస్త్రిపై నభిమానముతో మాటాడినపుడిక సుల్తానుతో తప్పక భేటీ చేయించవలెననుకొన్నాడు.

"మీరు సుల్తానుగారి దర్శనమునకు సిద్ధమైవచ్చినారా?" అని యాతడు శాస్త్రినడిగెను. నారాయణశాస్త్రి యవునన్నా

డు. మున్షీ రాజమందిరపుదారి బట్టెను. శాస్త్రి యాతని వెంట నడచెను. ఆతని మనస్సున నుల్లాసమే యుల్లాసము. దానితో దూరమునుండికనపడు చున్న రాజమందిరము నిరతిశయ శోభా మయముగ నుండెను.

శాస్త్రి సుల్తానుగారి మేడ చూచుటదే మొదలు. అంతః పురము చుట్టును నూటారుసైనికులు నిలిచియుండిరి. వారిభుజ ములపై వ్యాఘ్రముద్రలుండెను. హస్తములలో మృత్యు దేవత కటాక్షములవంటి నిశాత కరవాలములు. లోన ప్రవేశిం చినదే విశాలమైన హజారా; అందులో రమణీయమైన యు ద్యానము. ఆచెట్లు మరుద్వృధా జలవర్ధితములు; అగుటచే నా తావులేవో క్రొత్తలు. గోడలపైనున్న శిల్పములు సామాన్య ములేమైనను చూడ సుందరములై యుండెను. ఆనేలలపై రత్నకంబళ్లను బరచియుండిరి. అవి పర్షియా దేశమునుండి తెప్పించినవి. గోడలపై నక్కడక్కడ 'ఖురాను'లోని వాక్య ములను జెక్కినారు. వానిపై నిగనిగమను బంగారునీరు. రాచనగరున సంపదకంటెను సారళ్య గాంభీర్యము లెక్కువగా నగుపించుచుండెను.

బయటి హజారమును దాటి లోపలికి బోయినచో రెం డువైపులను రెండు దివాన్ ఖానాలు.దర్శనమునకు వచ్చినయతి థులు విశ్రమించుటందే; అక్కడి నేలపై గూడ వెలగల జము ఖాణములు పరువఁ బడినవి; అటనట దిండ్లమర్చబడి యుండెను వానియెదుట-పుష్ప గుచ్ఛములుండిన కాచ పాత్రలు. దివాన్

ఖానాల కిరువైపుల మారుతములతో మేలమాడు పొడలు అవి ఖురాన్ లోని యక్షరముల పోల్కిగత్తరింప బడినవి. ఆమంజు నికుంజములపై—సుగంధ ద్రవ్యములు—జిలుకరింప బడినవి. సుల్తానునకు దనప్రజలపై విపరీత మైన యభిమానము నారి యను కూలముల నాతడు శ్రద్ధతో గమనించు చుండెను 'దివాన్ ఖానా'ను దాటిపోయినచో—సుల్తాను విశ్రాంతి మందిరము. దానినానుకొనియే వేరొకప్రక్క సభాభవనమున్నది. సభాభాగమునకు పశ్చాద్భాగమున నంతఃపురము మరియొక దిక్కున వ్యాసంగమందిరము. దానికానుకొనియున్న పుస్తక భాండాగారము. అంతఃపురము వెనుకటి వైపున పరిచారికా గృహములుండెను! వానికానుకొని పాకశాలలు, రాజభవనము బయటికి సామాన్యమైన కట్టడమువలెనే యగుపించెడిది. కాని, సుల్తానుగారికి వలయుచున్న సౌకర్యములును అందులో నిమిడి యుండెను; టిప్పూ స్వభావతః మహాసాహసి. సరళజీవి అతడు రాజసుఖములకంటెను శ్రమమునకే యెక్కువ యల వాటు పడెను. అందుచేనాతనికి భోగములపై లాలసతక్కువ, అతనికి రాజవైభవమున సారళ్యమే యెక్కువ గనిపించు చుండెడిది.

స్వాభిమానియు, సాహసియు, వీరపక్షపాతియునగు టిప్పూసుల్తానునకు 'పులి' యన్నచో మహాప్రీతి. వాని దృష్టి లో నది ధైర్యసాహసములకును, పౌరుషమునకును, సంకేతము. ఈ గుణముల నెంతయో మెచ్చుకొనుచున్న యాతడు

తన్ను మైసూరు పులియని పిలిచికొనెను. రాచరికమునకు ప్రతివస్తువుపైనను పులినే చెక్కించుకొన్నాడు. అంతఃపురపు గోడలపై పులుల చిత్రములుండెను. కంబముల బోదెలకు పులులనే చెక్కించెను. సైనికులు ధరించు వస్త్రములు పులి శరీరమును బోలియుండెను. "జనానా" రక్షణవాడు ఆరడుగుల ఎత్తుగల వ్యాఘ్రములను సరిపెణలతో బంధించి యుండెను. అవి పెంపుడు పులులు. అతిస్వేచ్ఛగా (బారాడుచుండెడివి. వానికన్నుగప్పి యెవ్వరుగూడ నంతఃపురమున బ్రవేశించుటకు వీలులేదు. అంతమాత్రమేగాదు సభాభవనపు గోడలకు గూడ పులిరంగే పూయబడి యుండెను. సభాభవనమున నెత్తైన చోట తానుగూర్చొనుటకొక వ్యాఘ్రాసనమమర్చబడి యున్నది. అదియెంతయో రమణీయముగ నుండెను. ఆ యాసనమును పురుష ప్రమాణముననున్న వ్యాఘ్రమొకటి మోసికొని యుండెను. దానికి బంగారు త్రిగడులు, ఆపులి రూపు రేకలు శత్రువులపై బడుటకు సిద్ధముగనున్నదా! యని పించు చుండెను. వ్యాఘ్రాసన పీఠమున కష్టభుజములు. అది యయిదడుగుల యెత్తు. ఆయష్టభుజములందును మట్టసముగ జెక్కబడిన వ్యాఘ్ర ప్రతిరూపములు. అవి సువర్ణమయములు వానికన్నుల నీలములు. పుచ్ఛమున మరకతములు. పాదముల గోమేధికములు. ఉదరమున వైడూర్యములు, తెరచికొనియున్న వదనమునరక్తచ్ఛటాలంకృతములురత్నములు నాల్కలో ముత్తెములు ఆసనముపై నెక్కుటకు సోపానములున్నవి.వానిపైననుబం

గారు తగదుతే. వ్యాఘ్రాసనమునకు వెనుకల నొక యయిద డుగుల ఎత్తుగల స్థంభమున్నది. అదియంతయు రత్నఖచిత స్వర్ణమయము. దానిపై శ్వేతచ్ఛత్రమున్నది. అదిదారు నిర్మితము. పైని బంగారు రేకులు. దాని యలంకారము వర్ణింపతరముగానిది. మరిరెండు కన్నులెరువు దెచ్చికొనవలెను. ఆశ్వేతచ్ఛత్రమునిండ నిటనట జెక్కబడిన వ్యాఘ్ర శీర్షములు. ఖురానులోని వాక్యములు ఆఛత్రముపై సరిగా సుల్తాను తలపై నుండునట్లు 'ఖనా' అనునొకపక్షి చెక్కబడి యున్నది. ఆపక్షి స్వర్గమునుండి వచ్చెడి సందేశమునకుగుఱుతు. ముమ్మూర్తుల నది జీవత్పక్షినే బోలియుండెను. ఇది చూచుటకొక పారావతము వలెనుండును. బంగారుకడ్డీలతో దయారుచేసి యుండిరి. కన్నులలో బొదుగబడిన వైడూర్యములు వానివలె కొన్ని లక్షలు.

దర్బారు మందిరము చూపఱకొక నాట్యమందిరమువలె నున్నది. దాని కట్ట దిక్కులను కమానులు. ఆకుపసురు రంగుతోనున్న పట్టెలు పర్షియనులిపిలో సుందరముగవ్రాయబడిన ఖురాను వాక్యములు. వానిలోనిది యొకటి

"సుల్తాను సింహపరాక్రముడు అతని కటాక్ష మాత్రముతో శత్రువులు బెదురుదురు."

ఇంకొక వైపున "టిప్పూ జ్ఞానియు పండితుడు నగుట చే—మహాశక్తి శీలి" యని చెక్కబడీ యున్నది. దర్బారునకు వెనుకల అంతర్గృహములకు, ప్రక్క వాటుగా—సుల్తాను శయనా

గారము. అతడచ్చటసామన్య సైనికుని వలెనే— యేవైభవమును లేక పవ్వళించుచుండెను. నామందిరమున కినుప వాకిళ్లు.” ఏప్రాణియు నందులో ప్రవేశించుటకు వీలు లేదు.

మున్షీ నారాయణశాస్త్రిని పిలిచి కొని వచ్చినపుడు టిప్పూ శస్త్రాగారమున నుండెను.

అదొక చిత్రమైన గది. అందులో సుల్తాను నకు ప్రియమైన శస్త్రాస్త్రము లుండెను. స్వయముగా సుల్తానే నిర్మించిన యనేక యంత్రములుండెను. చిఱు కత్తులు కొమ్ములు—చిత్ర విచిత్రములైన ఘటీకారములు. అవియొక్కొక్కటి నిలువెత్తు. వాని వెడల్పు రెండఱచేతులంత మందము నాల్గఱచేతులేసి. వానిపై నెటజూచినను పులి చిహ్నములే. వానిలో సుల్తాను ధరించెడి ఖడ్గము మరియు పెద్దది. దానిపై ‘వ్యాఘ్రపరాక్రమి’ అని చెక్కబడినది. ఆ చెక్కడమున రత్నములు. ఒక్కొక్క యక్షర మొక్కొక్క పులిని దలపించుచుండెను.

శాస్త్రి సుల్తాను దర్శనమునకు వచ్చినపుడు అతడొక విచిత్రమైన వేడుకలో నుండెను.

అక్కడనొక యంత్రమున్నది. దానికీలుత్రిప్పిన దాని పైనున్న పురుష ప్రమాణ వ్యాఘ్రము నోరు దెఱచును. అప్పుడది ప్రాణమున్న దానివలె భాసించును. ఆపులి క్రింద నొక బ్రిటిష్ సైనికుడుండెను. ఆపులి తన ముందటి పంజానెత్తి—వాని మెడపై వైచెను. వానియెద చీలును. అప్పుడది గట్టిగా గర్జించును. పులి పంజా వేసినపుడంతయు—క్రిందనున్న

సైనికుని బొమ్మ బాధతో మూల్గుచున్నటు లుండును. ఈదృశ్యము జరిగినపుడంతయు టిప్పూ హుంకరించి నవ్వుచుండెను. తాను రణరంగమున సాధించ వలెనను కొన్న విజయమును వాఁడు తన ప్రయోగశాలలో కీలుబొమ్మతో సాధింపఁ జేసి కొని గర్వపడు చున్నాడు. అపుడపుడా వేడుకను జూచుటకు వాడు తన కుమారులను పిలిపించెడివాడు వారా వేడుకను జూచి నవ్వెదరు. అపుడు వాని యానందమునకు మితి లేదు.

కాని నేడా బిడ్డలు తన దగ్గర లేరు. వారి ంగ్లీషువారికిఁ జెల్లించ వలసిన ధనమునకై కుదువగాఁ బోయి నారు. వారు లేని లోపమును వాఁడు, వారి ప్రియమైన యా యంత్రము వద్దగఘుప్రను—తీర్చి కొనుచున్నాడు. ఆయంత్ర మాడినపుడంతయు—వానికి కుమారులు ఎదుట నిలచి నవ్వి నట్లేయుండును. వాఁడునవ్వును. వెంటనే వారి వియోగము స్ఫురించును అది యరుంతుదము. వాఁడా బాధతో సుడి దిరుగును. వాని రోషము ద్విగుణీకృత మగును. ఇట్లా యంత్రము వాని పాలికి జీవనాడి. వాని రోషము సంజీవ నౌషధము.

'మున్షి' లోనప్రవేశించి—సుల్తానునకు సలామొనర్చి నిలుచుండెను, సుల్తాను కొంతవర కాతనిని గమనింప లేదు. అతడనన్య మనస్కుఁడు. కొంతవడి కాతడు క్రొత్తవారి యలికిడి గమనించి, తల యావైపునకుఁ ద్రిప్పెను. 'శాస్త్రి' తలను

నేలకువంచి "సలాము"చేసి నిలుచుండెను.

టిప్పూ యీ క్రొత్తవానినిజూచి "ఇతడెవరు?" అన్నట్లు మున్షీవైపు దిలకించెను.

"హుజూర్! నేనింతకుముందు తమకు మనవిచేసికొన్న శాస్త్రి యితడే. తమదర్శనమునకై చాలదినములనుండి గాచికొని యున్నాడట.

"ఏమి విషయము?"

"హుజూర్! నేను స్వాములకడనుండి వచ్చితిని," ఈ మాటలకు టిప్పూ హఠాత్తుగ తెప్పరిల్లెను.

"ఏమీ? మీరు శృంగేరినుండి వచ్చినారా? స్వామిగారి కారోగ్యమేనా? వారు "కార్కళ"నుండి తిరిగి వచ్చినారా? వారినుండి దోచికొన్న ధనము దుర్మార్గులైన మహారాష్ట్రులు వెనుకకిచ్చినారా? సందేశమేమంపిరి.? శ్రీమఠములో పూజా కార్యముల కేకొరత లేదుగదా!" ఇత్యాది పది ప్రశ్నలడిగెను.

వానికి నారాయణశాస్త్రి యుత్తరమిచ్చులోపలనే అతనికొక యున్నతాసనమును జూపి గొప్ప యతిథివలె గౌర

"టిప్పూసుల్తాను పరివర్తనము శాస్త్రికపూర్వాశ్చర్యముగలిగించెను. హిందూ ధర్మద్వేషియని ప్రసిద్ధుడైన టిప్పూ శృంగేరి పేరువిన్నంతనే తన్నీరీతి సత్కరించునని యతడు కలలో గూడ ననుకొనలేదు. ఇదంతయు సచ్చిదానందుల యను

గ్రిహామని శాస్త్రి యూహించెను. నారాయణశాస్త్రి తాను వచ్చినవిషయమంతయు సమగ్రిముగ నివేదించికొన్నాడు.

"హుజూర్ తమదగ్గర నొకమనవి యున్నది. అనుగ్రిహింప వలెను."

"ఏమది? సంకోచ మెందుకు?"

"ప్రిభూ తమకు శృంగేరి గురుపీఠముపైనున్న యాదరాభిమానములను, శ్రిద్ధాగౌరవములను చూచి దిగ్భ్రాంతుడనైనాను. మహారాష్ట్రిలు నడపిన యత్యాచారము తమకు తెలిసియుండునని కలలోగూడ ననుకొనలేదు. స్వామి "కార్కళము"లో నున్నారని మీనుండి వినుచున్నాను. నాకే తెలియదు. వారందుండుట తమకెట్లు దెలిసినది.?"

"ఇందులో నాశ్చర్య మేమున్నది. వారు జగద్గురువులు విశేషించి మాకు హితైషులు. నేడేగాదు మాతండ్రిగారి కాలము నుండియు వారు మాహితమును గోరుచనే వచ్చుచున్నారు. మాజనకులు వారి నెంతయో గౌరవముతో చూచిరి. మేముకూడ నట్లే యింతవరకు నడపుకొని వచ్చినాము. మరి యిప్పుడు వారి యోగక్షేమములను విచారించుకొనుట మాధర్మముగాదా? పైగాస్వామివారు మాకొక నిరూపమును గూడి వ్రాయించి యుండిరి. అది మాకు ముట్టినది. వెంటనే వేగులను శృంగేరికంపి అక్కడ మహారాష్ట్రి లొనర్చిన హత్యాకాండలు, అత్యాచారములు తెలిసికొన్నాము. స్వామి

శృంగేరి వదలిపోయిన విషయముగూడ మాచెవికి వచ్చినది. అప్పుడు మాకెంతయో దుఃఖమైనది. వారి పోలుపులు విచారించికొని రావలసినదని గూఢచారుల నంపితిమి. వారు మహారాష్ట్రుల కంటబడక రహస్యముగా "కార్కళ"లో నివసించుచున్నారని వార్త తెలిసికొని వచ్చిరి. వారు క్షేమముగా నున్నందులకు అల్లాకు మాకృతజ్ఞతలు తెలిపికొన్నాము. స్వాములను రాజమర్యాదలతో రాజధానికి దీసికొని వచ్చుటకు దూతలనంపినాము. మీకుగూడ నీవిషయము దెలిసియుండ వచ్చుననుకొందుము. మీరిప్పుడు వచ్చినపని యేమో తెలిసి కొనవచ్చునా?"

"హుజూర్! నేనిక్కడికి గొప్పయాశతో వచ్చినాను. మాజనులను మహారాష్ట్రులు హింసించిరి. అమానుషముగ మానభంగములొనర్చిరి. వారిపై పగదీర్చుకొనుటయే నా దాహము. ఆవిషయమున దమసాయమర్థించి వచ్చితిని."

ఈమాటలకు సుల్తాను మౌనముగా నుండెను. ఆమౌనము శాస్త్రి హృదయమున నిరాశను రేకెత్తించెను.

"హుజూర్! తమరాలోచనలో మునిగిపల్లున్నది. ఈ విషయమును నేనింతకుముందే పూర్ణయ్యగారికి మనవి చేసితిని. వారు నాకనుకూలముగ మాటాడలేదు. ఇప్పుడీయవమానములను మ్రింగికొని యుండవలెనని వారొసగిన యుపదేశము. మీయభిప్రాయముగూడ నదియేయైనచో నిక నేమి సేయగలను? ఈకావేరిలోబడి యాత్మహత్య యొనర్చికొందు

ను. "సర్వ దుఃఖములకును మరణము మంగళప్రీతి."

ఈమాటతో సుల్తానున కాత్మగౌరవము దెబ్బ తిన్న ట్లైనది.

ఏమంటిరి? పూర్ణయ్యగారు—తమ యసంసిద్ధతను దెలిపిరా?"

"అవును. అంత మాత్రమే గాదు. తమ దర్శనమునకై ప్రార్థించి నను వారేమియు గమనింపలేదు. కాని—నాపుణ్యము మంచిది. మున్షీ సాహేబువంటి వారి సావాసము లభించినది. వీరు దయ బెట్టకున్నచో—నేను నిరాశతో నాత్మ హత్య యొనర్చి కొని—యీపాటికి కొన్ని దినములై యుండెడిది."

మీమాట నిజమైనచో—మానుండి మీకు చాలనన్యాయమైనది. విచారింతుము గాక!" వెంటనే దివాను—పూర్ణయ్యకొఱకు పిలుపు వెళ్లెను. సుల్తాను ఆజ్ఞను—మాతల మూలమున దెలిసిన వేంటనే—మహామంత్రి యున్నవాడున్నట్లు టిప్పుకడకు వచ్చెను.

హుజూర్! సన్నిధానము నకు రావలసినదని యాజ్ఞయైనది.

ఈమాటలనుచు పూర్ణయ్య చుట్టును దిలకించెను: ఆతని కంట నారాయణశాస్త్రి పడినప్పుడు ఆతని యాశ్చర్య మింతంత గాదు.

మహామంత్రీ! తమరీయాసనముపై దయచేయుడు. తమకీ నారాయణశాస్త్రి గారు పరిచితులే నను కొందును"

"నేను వీరినెక్కడనో చూచినట్లున్నది. ఎక్కడ చూచినానను నుట స్పష్టముగ జ్ఞాపకము వచ్చుట లేదు"

పూర్ణయ్య మఱపును నటించెను.

"మంత్రిమణీ! ఆదినము తమ కృపాబిక్షకై వచ్చి వట్టి చేతులతో దిరిగి వెళ్లిన నిర్భాగ్యుడు నారాయణశాస్త్రిని నేనే ఇప్పుడైనను జ్ఞాపకము వచ్చినదను కొందును"

ఆధ్వనిలో వ్యంగ్య హాస్యముండెను.

"అవును. హుజూర్! వీరుతమ దర్శనమునకై వచ్చి యుండిరి."

శృంగేరిలో మహారాష్ట్రిల సైనికులు నడపిన దుర్మార్గములు మీరు వివరముగ విన్నారు గదా!

"విన్నాము"

ఆవిషయమున తమ యభిప్రాయమేమి?

"హుజూర్! నా యభిప్రాయము నపుడే స్పష్టముగ దెలిపినాను."

"దానిని మేముగూడ వినవలయునని మాకోరిక"

"మాస్పష్టములైన యభిప్రాయములను తమరుక్షమింప వలెను. ఇప్పుడు మనము దైవోపహతులము. రాజకీయవాతావరణముగూడ ననుకూలముగ లేదు. మనశత్రువులందరు నొకకూటముగ జేరినారు. మొన్నగడచిన యుద్ధమునుండి మనమిప్పుడిప్పుడే కోలుకొను చున్నాము. మఱల నింతలో యుద్ధసన్నాహము లొనర్చుట మంచిదిగాదు."

'ఎందుకు?'

"సన్నిధానము నాపై గోపము చేసికొనగాదు. ఆంగ్లేయులతో మనముజేసికొన్న "శ్రీరంగపట్టణ"సంధివిషయము తమ రెరిగినదే! వారికి నాలుగుకోట రూపాయలు మనమిచ్చుకొనవలసినది. ఇప్పుడు రెండుకోట్లు జమగట్టినాము. తక్కిన డబ్బుకై సన్నిధానము యొక్క కుమారులను వారికడ నుంచినాము. వారినాంగ్లేయుల చెరనుండి విడిపించికొనుటకుముందే మరల యుద్ధమున కుపక్రమించుట సర్వనాశము నాహ్వానించి నటగును,

"మనము మహారాష్ట్రులపై యుద్ధమునకు బోయినచో ఆంగ్లేయులు మనపై నేలవత్తురు?."

"ప్రభూ! ఈవిషయమును మఱికొంత జాగ్రత్తగ నాలోచింపవలెను. మనయుత్కర్ష సహింపక మహారాష్ట్రులు నిజాము ఆంగ్లేయులకు మిత్రులైనారు. మన పైకింగ్లీషువారెత్తి వచ్చినపుడు, వారిద్వరును వారికి తోడు పడినారనుట తమకు తెలిసిన విషయమే. ఇపుడు మనము మహారాష్ట్రులపైకివచ్చినచో కాలుత్రివ్వి యింగ్లీషువారిని పిలిచినట్లుగాదా? వారికి మిత్రులైన యాంగ్లేయులు దమమిత్రుల నుపేక్షింతురా?"

సన్నిధానము దయతో నిదానముగ నాలోచింపవలెను ఇపుడు మనము యుద్ధమున నోడి దుర్బలులమైనాము. మన సైనికులలోగూడ ముందటి యుత్సాహము లేదు. వారియారోగ్యములు క్షీణించినవి. సైన్యమునకై వెచ్చించుటకు భాండా

గారమున ధనములేదు. ఇంతమాత్రమే యైనచో నెట్లో సరి చేసికొనవచ్చును. తమ కుమారులు వారిదగ్గఱనున్నారు. మన ము తొందరపడినచో సర్వనాశము తప్పదు. ఈసారి యుద్ధ మైనచో నింగ్లీషువారు మనలను జయించి మైసూరు రాజ్య మును తమలో లీన మొనర్తురు.

"మరి శృంగేరి పీఠమునకైన యవమానము?"

హుజూర్! ఇప్పటి రాజకీయ పరిస్థితులలో మనమేమి యును చేయలేము. తొలుత యుద్ధఖర్చులను సంపాదింప వ లెను. వేలూరు చెరలోనున్న తమ కుమారులను విడిపించి కొన వలెను. ఆపైని విజృంభించి—శత్రువులకు బుద్ధినేర్ప వలె ను. కాల మనుకూలమగు వరకును—ఓర్చుకొని యుండుటలో దోషములేదు. అది రాజనీతి యనుట దమకు దెలిసిన విష యమే. కొంతకాలము వఱకీయవమానము మ్రింగికొని మెల గుటయే సరియైన దారి."

"మామనస్తత్వముల కది యసహ్యముగా నున్నది

"అయినచో దమయాజ్ఞ"

"శృంగేరి గురుపీఠము మైసూరులోని హిందువులకు మాత్రమే సంబంధించినదిగాదు. భారతదేశమందలి సమస్త హిందువులును దానిని గౌరవింపవలెను. ఇంతవఱకు క్లేనడచినది శ్రీమఠమునకైన యీ యవమానము హిందూ మాతృనకు జరిగిన యవమానము. హిందువులేయైన మహారాష్ట్రులు శృం గేరి శారదా పీఠముపైనను, ఆర్చకులపైనను అత్యాచారము

లను నడిపినపుడు యిక నీ యధర్మము నేమనవలెనో అర్థము గుటలేదు. ఈపరిస్థితిలో మనమూరకున్నచో మన ధర్మసింహాసనముండి యేమి ప్రయోజనము? ప్రజల కష్టసుఖములను గమనింపని రాజు వ్యర్థము. ఈనాడూరకున్నచో మహారాష్ట్రులు మన బలహీనత నాధారముచేసికొని రేపు మహమ్మదీయులపై కూడ విజృంభింపవచ్చును; కనుక దీనిని మూలముసందే ఛేదింపవలెనని మాయూహ."

"హుజూర్! ఇది తొందరపడు విషయముగాదు. మహారాష్ట్రులందరును దుష్టులనుటకు వీలులేదు. వారిలో నెందఱో శ్రీమతముపై గౌరవప్రపత్తులు గలవారున్నారు. వారిసైన్యములోనున్న ధగ్గులు. పిండారీలు మొదలగు తస్కరజాతులు మాత్రమే శృంగేరిపై దాడిపెట్టి గురుపీఠమునకపచార మొనర్చిరి. అక్కడి వస్తువులను కొల్లగొట్టిరి. అంతమాత్రముతో మహారాష్ట్రులందరును నీచులు దుష్టులనుట న్యాయము గాదు. మనమీ సమయమున నేమి తొందరపడినను మనయునికికే కీడగునను భయముగానున్నది. నాసలహామీకు ప్రియమైనచో మనకైన యన్యాయమును దీర్చికొనుటకొక మార్గమున్నది."

"అదియేమి?"

హుజూర్! ఇప్పుడు మహారాష్ట్రులవలనడి గురుపీఠమున కఱువది లక్షల డబ్బునష్టమైనది; ఇంకను దురాగ్రములెన్నియో జరిగిపోయినవి. మనమీ విషయమై మహారాష్ట్రులతో

దూతల మూలమున సంపాదింప వచ్చును. పీష్వాలు బ్రాహ్మణులు మాత్రమేగాదు. దైవభక్తులు కూడ. వారి సైన్యమందును ఆస్థానమందును సాత్వికులైన బ్రాహ్మణులెందరో యున్నారు. మనము వారిమూలమున బ్రయత్నించినచో పీష్వాల మనస్సులను లోగొని యుద్ధము లేకయే గురుపీఠమునకైన నష్టమును రాబట్టుకొనవచ్చును. నిదానముగ నత్యాచార మొనర్చిన దుష్టులను శిక్షించి పగదీర్చికొనవచ్చును."

"సామవాక్యములతో నీపని సాధింపగలిగినచో నది మాకు సమ్మతమే. కాని, మన సామవాక్యములకు పీష్వాలు సమ్మతింతురా? ఆనమ్మకము నాకులేదు."

"ప్రయత్నించుట మనవిధి. ఫలము దైవాధీనము. ఈ కార్యమునకు భారతీస్వాములవారినే బంపినచో పని సులభముగా నెరవేరునని మాయాశ."

"స్వాములవారిప్పుడు మనకు లభ్యమగుదురో?"

"వారు "కార్కళము"న నున్న విషయము మనమెఱిగినదే. వారచట క్షేమముగ నున్నారన్న వార్తలు వచ్చినవి. వారినిటకు రప్పించుటకు దమయాజ్ఞ కావలెను. వారు వచ్చువఱకును మన మేనిర్ణయమునకు రాలేము."

స్వామి దయసేయువఱకును గాచికొనుటకు సాధ్యముగాదు. పీఠమునకైన నష్టమునకు బరిహారము వెంటనే దొరకవలెనని మాసంకల్పము. మహారాష్ట్రులకడకుఁగాయబారమంపుటకు మనకీ శాస్త్రిగారు చాలుననుకొందును."

ఇది యోగ్యమైనమాటయే. శాస్త్రిగారిందు కంగీక రింపవలెను. ఇంతకుముందు వారితో నేనాడిన మాటలలో నే దైన వారిమనస్సును నొప్పించిన విషయమున్నచో దానిని వారు మఱచిపోవలెను. వారిని నొప్పింపవలెననుట నా యుద్దేశ్యము గాదు."

"గడచినవిషయములను మఱచిపోవలెనని యేనాసలకుకో గూర వారు కార్యమునకు బూనుకొనవలెను."

సుల్తాను నారాయణశాస్త్రివైపు చూచెను.

ఈమాటతో నారాయణశాస్త్రి దిగ్భ్రాంతుడయ్యెను. సుల్తానుగారి కార్యమునకు తన్ను నియోగింతురని యూతడను కొనలేదు. దీనికి పూర్ణయ్య సమ్మతించుననియు నాతడు భావింపలేదు. దైవానుగ్రహమున నీరెండును సమకూడినవి. స్వామి క్షేమముగ నున్నారని తెలిసినది. అంతమాత్రియేగాదు, శ్రీ మఠమునకైన నష్టమునకు బరిహారము లభించుమార్గము కనుపించుచున్నది.

శాస్త్రికి దాను శృంగేరిపట్టణమునకు వచ్చినపని సఫలమైనదని సంతోషమయ్యెను. అతడు శ్రీమఠముకొఱకై మహారాష్ట్రుల కడకు రాయబారమునకు బోవుటకు సమ్మతించెను. నారాయణశాస్త్రి సుల్తానుగారియాజ్ఞతో "కార్యాలేశము"నకు బయలుదేరెను. అతనివెంట మితపరివారముండెను. అతనికి సుల్తానొక నిరూపమిచ్చెను. కార్యాలేశము మైసూరునకు బశ్చిమదిశలో నున్నది. అదియొక సుందరమైన గ్రామము. చాల

కాలమునుండియు జైనులకు యాత్రాస్థలము. "బాహుబలి" యొక్క దొడ్డవిగ్రహమట నున్నది. తద్దర్శనమునకై వేలకొలది యాత్రికులట కేతెంతురు. అదివ్యాపార కేంద్రముగూడ. మహారాష్ట్రులు శృంగేరి పై కెత్తినప్పుడు స్వామి యచ్చటదల దాచుకొనెను. ఆవచ్చుట భగవత్ప్రేరణయే.

శృంగేరిపై మహారాష్ట్రులు దాడివచ్చుటకుముందు స్వామి, సర్వాధికారి నిర్బంధముతో నవసరమువచ్చినపు డట నుండి తప్పించికొని పోవుట కంగీకరించెను. కాని. వారంత త్వరగా శత్రువులు దాడివత్తురని భావింపలేదు. హఠాత్తుగ దాడి జరిగినది. స్వామికి సర్వాధికారి సలహాను పాటింపక తప్పలేదు. అదేసమయమున స్వామి నవమానించుటకు పిండారీల సైన్యమొక్కటి యాగ్రామమువైపు వెళ్లినదన్న వర్తమానము వచ్చినది. స్వామిని రక్షించుటకై సర్వాధికారి పరువెత్తికొని వచ్చెను.

అతఁడు వచ్చిన యాపదను దెలిపి యచ్చటినుండి దప్పించికొని పోవుట మంచిదన్నాఁడు. స్వామి పూజావస్తువులను దేవీవిగ్రహమును జాగ్రత్తపఱచికొని కొందఱు శిష్యులు ప్రయాణమైనారు. సర్వాధికారియు స్వామియు నటనుండి రహస్యముగ సాగిపోయినారు. మొట్టమొదటి మజిలీ రామతీరము. అచ్చటనున్నపుడు స్వామికొక కలవచ్చెను. ఆకలలో జగన్మాతదర్శన మొసగినది.

బిడ్డా! అధైర్యపడవలదు. ఇదంతయు నాలీల. ఇఁక

్రైనను జగత్తున ధర్మకై తవమున నడచుచున్న స్వార్థము వంచన తగ్గునని తలంచుచున్నాను. ఇప్పుడు నావచనము నడచికొనుము. నీమనస్సునకు శాంతిచిక్కును. నీవిప్పుడు గోకర్ణమునకు బొమ్ము అట "గోకర్ణేశ్వరుని" దరిసించి తిరిగిరమ్ము ఇంతలో నీపోయిన సంపత్తు శ్రీమఠమునకు మఱల ప్రాప్తించును. నాస్తికుల యెదలలో ధర్మశ్రద్ధ యుత్పన్నమగును. నీవు రహస్యముగ మెలగుము."

స్వామి గోకర్ణమునకుఁబోయెను. అచ్చటనొక మాసము న్నాడు. గోకర్ణేశ్వరుని బూజించి యతని యనుగ్రహము బడసి శృంగేరికి వచ్చుచుండెను. నడుమదారిలో కార్కళమున ననారోగ్య మేర్పడినది. వారిదేహము మఱల యథాస్థితికి వచ్చుటకు దాదాపారు నెలలు పట్టెను. "కార్కళమున" జాల దినములు నిలుచు పరిస్థితులేర్పడినవి. ఇంతలో టిప్పు మాతలు వారిని గుర్తుపట్టిరి.

ఇప్పుడు "టిప్పూ" యాజ్ఞతో స్వామిని శృంగేరికి దరలించుటకు సాధ్యమైనచో రాజధానికి గొనిపోవుటకు శాస్త్రి వచ్చెను. అతడు స్వామికి జరిగినసంగతి నివేదించి సుల్తాను నిరూపమందఁజేసెను. దానిలో నిట్లున్నది.

శ్రీమత్పరమహంస పరివ్రాజ కాచార్యులైన శ్రీ భారతీస్వాముల దివ్యపాద సన్నిధికి,

తమరంపిన పత్రికామూలమున సమస్త వృత్తాంతము లును దెలిసినవి. మహారాష్ట్రులదండు శృంగేరిపై బడినందు

చాల చింతించుచున్నాము, ఆసైన్యములక్కడి జనులను నవ మానించి మానభంగములుచేసి వస్తువులను కొల్లగొట్టినందు కుగాను మా మనస్సునకు చాల బాధకలిగినది. ఆ యవమాన ములు మాకు జరిగినట్లుగా భావించుచున్నాము. తమరు నలు గురు శిష్యులతో 'కార్కాశము' చేరుకొంటిమని వ్రాసినారు. సంతోషము. జగజ్జననియైన శారదాపీఠము పురాతనమైనది. అందుచే ఆదేవతను ప్రతిష్ఠ చేయుటలో చంద్రసూర్యులున్నం తవరకు కీర్తి శాశ్వతముగానుండును. ఆదేవిని పునఃప్రతిష్ఠిం చుటలో నాసహాయ మవసరమగుట నాగొప్ప భాగ్యము. అట్టి మహత్తర స్థలమునకన్యాయమొనర్చిన మహారాష్ట్రులు దాని ఫలమును తప్పక యనుభవించెదరు. వారికి వంశనాశమగుటలో సందేహములేదు. ఈద్రోహులు ప్రజలకు కల్గించిన సంకటము ను మీరు ప్రత్యక్షముగ చూచియేయున్నారు. వారు మన కొనర్చిన యీ యపకారమునకు తక్షణమే నాశమగునట్లు తమరు నన్నాశీర్వదింపవలెను. ఇప్పుడు శారదాదేవిని పునః ప్రతిష్ఠించుటకు నగదు యిన్నూరు వరహాలు పంపుచున్నాము సర్కారు ఖజానానుండి యేవస్తువవసరమైనను యిప్పించునట్లు నగరపు "అసఫ్"నకు మేము 'మసుహావాన్' పంపించి యు న్నాము. మాయాజ్ఞను నగరాధిపతి దగ్గరకంపి నగదురొక్క మును తీసికొనవలెనని మాప్రార్థన. సర్కారువారు యినాము గానిచ్చిన గ్రామమునుండి కావలసిన సరంజామా తెప్పించు కొనవలెను. సంతర్పణ చక్కగాచేయించి శారదాంబను

పునఃప్రతిష్ఠ చేసి దేవతాసేవకే బాధయులేక నడచునట్లుగా చేయవలెను. మాకు శ్రేయస్సు అభివృద్ధి చెందునట్లు తాము తపస్సు చేయుచుండవలెను.

తారీఖు

5 వమీాలే జ బరిసాత్

విరోధికృతు సంవత్సరము.

ఆషాడ శుద్ధ పంచమీాలు.

ఈ నిరూపమును జదివినదే స్వామికన్నులలో నీరు నిండెను. విధర్మియైన టిప్పూ తమకువ్రాసిన పత్రికలలో చూపించిన యభిమానమును దలచి మహారాష్ట్రులకంటెను అతడే హిందూధర్మముపై నభిమానముగలవాడనియు స్నేహితుడనియు. అతనిపై గృతజ్ఞత ఏర్పడెను. వారు కొంతసేపు మౌనముగ నుండిరి.

"గురుదేవా! సుల్తానుగారు మహారాష్ట్రుల మూలము మఠమునకు గలిగిన కష్టనష్టములపై యెంతయో బాధపడుచున్నారు. మఠమునకు గళంకమును కల్గించినవారిని శిక్షింపవలెనని వారియభిప్రాయము. కాని, యిప్పుడే తొందరపడరాదని పూర్ణయ్యగారు మనవిచేసినారు. సకల రాజమర్యాదలతో తమ్ము రాజధానికి దీసికొని రావలసినదని సుల్తానుగారి యాజ్ఞ."

తమరిని పీష్వాలదగ్గరకు రాయబారులుగా పంపి యీ మూలమున శ్రీమఠమునకైనయన్యాయమును సరిచేసికొనుటకు సుల్తాను యోచించుచున్నారు.

"సుల్తానుల యభిమానములకు మా కృతజ్ఞత. కాని, యిప్పటిలో మేమెక్కడికిని ప్రయాణింపలేము. ఇంకను గొంత కాలమిక్కడేయుండి శృంగేరికి పోవలెనని మాతలంపు."

"అయినచో సుల్తానుల కేమని విన్నవింపుమందురు?"

"స్వామి యధ్యాత్మ సింహాసనమునకే యధికారులు గాని, రాజకీయములకుగాదు. అన్యాయమును సరిదిద్దుకొనుటకు మేము పీష్వాలకడకు పోవుట బొసగదు. సుల్తానుగారే యెవరైన చతురులైన వారిని బంపవలెను, ఈ పనికి మా యాశీర్వాదమున్నదని తెల్పుము."

భారతీస్వాములు పై మాటతో యొక శ్రీముఖమును పొందించి సుల్తాను కివ్వవలెనని నారాయణశాస్త్రికిచ్చెను, అతఁడు రాజధానికివచ్చి జరిగిన వృత్తాంతమంతయు ( దెలిపినాఁడు. ఆపత్రిమును జదివి సుల్తానుకు గొంతనిరాశ గల్గినది. కాని సుల్తానునకు స్వామిపై గొప్ప గౌరవము. వారికిష్టములేని కార్యమునకు వారిని నిర్బంధించుట దగదనుకొన్నాఁడు. వారి దయను సంపాదించుకొని కార్యమునుసాధించుటకై మరియొక పత్రిమును వ్రాసెను.

"శ్రీమత్పరమహంసాది బిరుదాంకితులైన భారతీ స్వాముల పాదపద్మములకు. సుల్తాను పాదుషా సలాములు...

"మీరింతకుముందు శృంగేరిలో మహారాష్ట్రిలు—అనేకులకు గురుద్రోహము దైవద్రోహముచేసి స్త్రీపురుషులకు ఉపద్రవము గల్గించి మీ మనస్సు నొప్పించినారనియు అర్థమై

నది. మీరు రెండవసారి పంపిన (శ్రీ)ముఖములోని విషయము లు చక్కగ గ్రహించినాను. ఈశ్వర కోపముతో వారి వంశము నశించును."

మీరు దొడ్డ తపస్వులు. లోక శ్రేయమును తలచును రాజద్రోహము చేసినవారికి నాశము కల్గుగాకని సదా ధ్యానింపవలెను.

మీ యాశీర్వాదముతో లోకమునకు గల్గిన ఉపద్రవము వెంటనే తీరిపోవును. మీ పాలకీ, పట్టపేనుగు మొదలైన వన్నియు గురుద్రోహులు కొల్లగొట్టుకొని పోయిన సమాచారము సర్కారుకు తెలిసిన దానివలన తమకొక ఏనుగును బంపుచున్నాము. దయచేసి స్వీకరింపవలెను. ఒక పాలకిని తయారుచేసి పంపుచున్నాము. (శ్రీ) శారదాదేవిని ప్రతిష్ఠించుటకు బత్తెమునకు 200 వరహాలు "పేష్" చేయవలెనని నగరము "అసఫ్వర్వాన్"నకు ఆజ్ఞను బంపినాము. ఆమేరకు ధనము తీసికొని ప్రతిష్ఠ చేయించి తాము వివరములు వ్రాయింప వలెను.

ఈశ్వర ధ్యానము యేకనిష్ఠతో చేయుసమయమందు సర్కారు సుల్తానునకు సకలమనోరథ సిద్ధికలుగునట్లు నాశీర్వాదము చేయవలెను. దేవికి ధరించుటకు పెద్దచీర, రవిక, తమ శాల్వాల జోడు, పంపికొన్నాను. దాని వివరము వ్రాయింప వలెను. (శ్రీ)మఠము విషయమున కావలసిన వస్తువులు తయారు చేయింపుమని నగరస్వామి కానపెట్టినాము. ఆ పనులు

చేయించికొనవలెను. 26 మాలేసమంసాల్ జర్జుత్ 1219 మహామ్మద్. విరోధికృత్ సం॥ ఆషాఢబహుళ ౧౨ లు.

టిప్పూ వ్రాలు.

## ౧౨

టిప్పుసుల్తానుని పత్రము మేరకు శ్రీమఠ జీర్ణోద్ధారమాయెను. మహారాష్ట్రులచే నపవిత్రముచేయఁబడిన శారదాదేవి విగ్రహ ప్రతిష్ఠాపనకై తేవలసిన సంభారములన్నియు నేర్పాటు చేయుమని సర్వాధికారి కాజ్ఞయైనది. అతఁడు నగరపాలుని చెంతకేగి యేర్పాటులు గావించెను. నగరపాలకుఁడు సుల్తానుల ఫర్మాన మేరకు శ్రీ స్వాముల ఘనతకుఁదగిన బంగారు పల్లకిని దయారు చేయించినాఁడు. మఠముకొఱకు మరియొక సుందర పల్యంకిక, ఒక ఏనుగును సుల్తాను గోపాలజోయిస నారాయణశాస్త్రిల వెంటఁబంపెను. సంప్రోక్షణము, దేవతార్చన మొదలైన క్రియా కలాపమునకుఁదగిన ధన ధాన్యాదులు నానాదిక్కులనుండి వచ్చినవి. సుల్తాను స్వామి సొంతఖర్చుకై హైదరీ నూరు మొహరీలను "అబరీ"-'చికరీ' నాణెములను బంపియుండెను. దేవాలయములో నడుపఁబడు శాస్త్రవిధులకు దేవతాకార్యములకు శారదా పునఃప్రతిష్ఠకు గావలసిన వెచ్చమంతయు నగర ఖజానానుండి యివ్వవలెనని సులతానుల ఫర్మానతీ.మహారాష్ట్రులు పెల్లగించిపోయిన యత్తి చెట్టు విగ్రహము నదిలోఁబడియున్నది. దానిని స్వామి చాల

కష్టముతో వెదకించి బయటికి దెప్పించెను. దురదృష్టవశమున నదిభగ్నమైనది. అందుచే దానిని గర్భగుడిలో నుండక యుంచిరి. అట్టిదే వేరొక విగ్రహమును ప్రతిష్ఠించిరి. సుల్తానుని యాజ్ఞమేరకు దేశమున ప్రజాక్షోభ రాజ్యక్షోభ తగ్గిపోవుటకై సహస్ర చండీహోమము విధ్యుక్తముగ నెరవేర్పవలెను. టిప్పు ఫర్మానాననుసరించి నగరము, కొప్పము, తాలూకా వీనికి సంబంధించిన యధికారులు స్వాములకడ దాసులవలెఁబని చేసిరి. అన్నదానములు విరివిగా సాఁగెను. దేవతా ప్రతిష్ఠాపనము జరిగినతర్వాత స్వామి నారాయణశాస్త్రితో శ్రీరంగపట్టణమునకు ప్రసాదమును బంపిరి.

ఇంతయైనను స్వామికి సంతోషములేదు. హిందువులేయైన మహారాష్ట్రులు హిందూధర్మమున కొనర్చిన యవమానము వారిమనస్సునందు బాధగల్గించుచున్నది. వారుదోచుకొన్న పదార్థములను మరలఁ దెచ్చువఱకును స్వామి మనస్సునకు సమాధానములేదు. వానిని సాధించుటకు స్వామియే పూనావఱకు ప్రయాణ మొనరింపవలెనన్న యభిప్రాయము సుల్తానునకుండెను. కాని, స్వామికి శృంగేరి వదలుటలో నిష్టములేదు. తాముపోవుటకు వీలులేదనియు, దయపరముగా మరియొక్కరు బోయినచో దాము సంధానము సలుపుటకు సిద్ధమనియు, సుల్తానునకు బత్రము నంపిరి. పరశురామభావుకూడ దానిజతలో నొకకమ్మయుండెను. "మహారాష్ట్రులు శ్రీమఠమునుండి యరువదిలక్షలు వెలసేయు సామాను లూటీ చేసి

కొనిపోయిరి. దానిని వెనుక కిప్పింపవలెన"ని యాలేఖ సారాంశము. ఈలేఖను వారు శాస్త్రిచేతికొసంగిరి. ఈ లేఖను మహారాష్ట్రులు గౌరవించినచో సరి. లేకున్న వెన్కకుఁదెచ్చి దానిని సుల్తానునకు జూపవలెనని వారియాదేశము.

ఇంతలో పూనాకుబోయిన చారులు మరలవచ్చిరి. అక్కడి సమాచారములను దెచ్చిరి. శృంగేరినుండి వెడలినప్పటినుండియు పరశురామభావే మంచము పట్టినాడు. అతడు బ్రిదుకునట్లులేదు. దైవశాపము స్వామిశాపము తీవ్రముగ గొట్టినవి. ఈవిషయము సుల్తానునకు తెలిసినచో బాగుంకునని స్వామి యిట్లు వ్రాసిరి. స్వామికి తెలిసినచో బాగుండునని సులతానిట్లు వ్రాయించెను. పరశురామభావే చనిపోయినాడని చారుడు తెలుపుచున్నాడు. ఈ విషయము నమ్మవచ్చునా? మీరు తపస్వులు. మనపైకి వచ్చిన ముప్వురు శత్రువులు నాశమగునట్లు, సర్కారునకు క్షేమమగునట్లు. త్రికాలమందు ను యీశ్వరుని ప్రార్థన సేయవలెను. సర్కారు క్షేమము గోరవలెను.

నారాయణశాస్త్రిని సుల్తానుపూనాకు బోవనీయమించెను. అతఁడు మితపరివారముతో బయలుదేరెను. భారతీస్వాముల శ్రీముఖము సులతానులయుత్తరములను పీష్వాలకందజేసి శాస్త్రివారిదర్శనమొసర్చెను. కాని—లాభములేకపోయెను. పూనాలోని రాజకీయములుసంధికి సిద్ధముగాలేవు.పరశురామభావే హరిపంతు వీరిర్వురును పీష్వాలయాస్థానము

లోఁ బ్రముఖులు. పీష్వావీరితో విరోధముగట్టుకొనుస్థితిలోలేఁడు. అట్లయినచో—దనయధికారమునకే భంగముగలుగునేమోయ నిమాతనిభయము. అతఁడుసమయమునకై గాచికొనియుండె ను. ఆకాచుటలోఁగొన్ని నెలలు గడచినవి. వచ్చినపనిసఫలము గునట్లు నారాయణశాస్త్రికి దోచలేదు. నడచినసమాచారము నాతఁడు సులతానుల కెఱుకపఱచెను. టిప్పుఆగ్రహోదగ్రుఁడై నాఁడు, వెంటనేతిరిగిరావలసినదని శాస్త్రికివర్తమానము పంపె లినవి, సులతానుమంత్రులతో నిట్లుమంతనమాడెను. "ప్రార్థ య్యాగా [illegible] భారము సఫలమగునట్లులేదు. పీష్వాశా స్త్రిమాటలను నెలయొసఁగలేదు. మరి—కార్యసాధనకు—స్వామి యే పూనాకు బోవలసివచ్చునేమో?"

"వారంతమాత్రము దయసేసినచో—పనిసాధింపఁబడున చున్ను. కాని—వారందులకు సమ్మతించుటలేదు. వారికిష్టములే నిపనకై—వారినినిర్బంధించుట మనకును క్షేమకరముగాదు. ఏ మిచేయుటకును దోచుటలేదు."

"జరిగినవిషయములన్నియు వారికిమనవి చేసికొన్నచో—వారుపూనాప్రయాణమునకు సమ్మతింపవచ్చును, మనము మ రియొకసారి వారినిబ్రార్థింతము. వారెట్లును సమ్మతింపకున్న చో—వేరుదారి వెదకుదము."

సుల్తాను దేశక్షేమమునకై—ప్రజా క్షేమమునకై — పూనావరకును బోయిరావలెనని ప్రార్థించుచునొకపత్రమును వ్రాసెను.

ఈసారిస్వామికి సులతానుకోరికను దిరస్కరించుటకు మనస్సురాలేదు. వారియారోగ్యము బాగలేదు. కానిపూనావరకుఁ బోయివచ్చుటకు సంకల్పించికొనిరి. తమసమ్మతి సుల్తానునకెఱిగించిరి. అందుకుఁదగుసన్నాహముల నొనర్చిరి. పీష్వా స్వామిని భక్తి ప్రపత్తులతో నాహ్వానించెను. వారికి రాజోచితమైన విడిది నేర్పాటు జేసెను. పూజాదులకు దగిన వ్యవస్థలు నడపెను. సకలగౌరవములును సరిగానడపెను. మహారాష్ట్రులు నడిపిన యత్యాచారముల కతఁడు పశ్చాత్తాపమును వెల్లడించెను. వారుగైకొన్న వస్తువులన్నియు వెనుక కిప్పింతునని స్వామికి మనవి యొనర్చెను. మఱముపై నీరీతి యత్యాచారములు నడపినవారిని శిక్షింతుననియు మనవిచేసెను.

ఇంతయైనను వారు నిరీక్షించిన ఫలమేమో రాలేదు. వారు దమ పరివారముతో సుమారు మూఁడుమాసములు పూనాలోనుండిరి. అయినను, వారిదర్శనమునకు హరిపంతులుగాని, పరశురామభావేగానిరాలేదు. వారిని నిర్బంధించి వస్తువులను స్వాధీనపరచుకొను శక్తి "పీష్వా" కున్నట్లు స్వామికి దోఁచలేదు. కాలము గడచిపోవు చుండెను.

"పీష్వా" నేఁడు; రేపువారిని బిలిపించి బుద్ధి చెప్పునని భారతీస్వామి వేచెను. వారికి వేసరికయైనది. తామే పీష్వాను గలిసికొని—యీవిషయమును బ్రస్తావింప దలచిరి. ప్రస్తావించి కూడ "పీష్వా" యావిషయమును దాటించివేసెను; స్వామి విడిదికి వచ్చెను. తాము శృంగేరికి మఱలి పోవుచున్నామని

జగద్గురువు వర్తమాన మంపినాడు. రాజంతట్లో భయపడి వారి దర్శనమునకు వచ్చెను.

"పీఠస్వాగారూ! మేమిక్కడికివచ్చి చాలదినములైనది. త్వరగా వెనుదిరుగవలెను. మా విషయము నేదో తేల్చివేసి నచో బాగుండును."

"తాముఉ మఱికొన్ని దినములిచ్చట నుండవలెనని మాకోరిక. మా ప్రదేశములను పవిత్రీకరింపవలెను. తాము శృంగేరికి బోయిమాత్రము చేయునదేమున్నది? శిష్యోద్ధరణ మేగదా! అపని యిక్కడనుండియే చేయవచ్చును." "పీఠస్వా నవ్వెను. అనగవు పరిహాస సత్యవద్యత్వములనడిమిసీమ యందుండెను.

"మేము శిష్యకోటి నుద్ధరించు కాలముగాదు, వారే మమ్ముద్ధరింపవలెను; శ్రీమఠముపై దాడిజరుపుటంత దుర్మార్గముగాదా? ఎవరో నీచులొనర్చిరని చెప్పుకొన్నను వారి నింతవరకు శిక్షింపకుండుటలో వివా యభిప్రాయమేమి? మఠమునకు దగిన పరిహారమైన నిప్పించుచున్నారా? ఆకార్యమును గూడ జాగొనర్చుచున్నారు. ఇవన్నియుజూచినచో పరిహార మొసగుట మీకిష్టములేనట్లు దోచుచున్నది. దైవేచ్ఛ యెట్లున్నదో అట్లుజరుగుగాక. మేము మాకర్తవ్యమును నెరవేర్చి కొంటిమి. వట్టిచేతులతో వెన్కకేగినను బాధలేదు. మేమిక్కడనుండి వెడలుట కనుమతించినచో జాలును. అదేమాకుఁ బదివేలు.

పీష్వాస్వామి పాదముల బట్టుకొనెను.

"గురుదేవా! మానుండి యయిన యపచారమును క్షమింప వలెను. దయచేసి మీరు మఱియొక (బది రోజులు న్నచో తమ వస్తువులను వెనుక కిప్పింతును. అపని సాధ్యము గాకున్నచో మాఖజానా నుండి యైనను ధనము నిప్పింతును తమరు వట్టిచేతులతో వెన్కకు బోరాదు."

'భారతీ' స్వామి యందుకు సమ్మతించెను. వారమేమో గడచెను, పీష్వా వాగ్దానము చెల్లించుకొన లేదు. ఇంతలో సులతానుల నుండి యొక పత్రిక వచ్చినది. అది యిట్లుం డెను.

"తమరు వ్రాయించిన పత్రిక మూలమున నన్ని విష యములును దెలిసినవి. తాము జగద్గురువులు. సర్వలోకము లను క్షేమము గోరుచు-త్రికాలముల యందును దపమొ నర్చు మహానుభావులు మాకభివృద్ధి గల్గునట్లు దమరు తపస్సు జేయవలెను. మీవంటి దొడ్డవారు మా దేశమందున్నచో వా నలు సక్రమముగ గురియును. తఱిదప్పగ ఋతుక్రమము చెల్లు ను. దేశము సుభిక్షముగ నుండును. తమరచ్చట చాలరోజు లుండుట మాకిష్టములేదు. దయచేసి తిరిగివచ్చు నట్లేర్పాట్లు చేయింపవలెను.

తా॥ 29 మార్చిమాసే, పాజుపాల్, సహూర్సన్, 1220 మహమ్మదీ పరిభావి సంవత్సర మాఘబహుళ పద్మాలుగు.

ఈ పత్రిముతో స్వామికి సులతానుల భావమర్థమైనది

వారిక పీష్వాను చూడదలచుకొనలేదు; ప్రయాణముకట్టి సుర
క్షితముగ శృంగేరి జేరినారు. తామూరు జేరుకొంటిమని
సుల్తానుకు బత్రము వ్రాసిరి. వాడు తృప్తితో గట్టి యార్పు
వదలెను.

"పూనా రాయబారము వ్యర్థమైనట్లే." పూర్ణయ్య
గారి కోరిక ఫలించలేదు. తర్వాత నేమి చేయవలెననుట
సుల్తానునకుబోధపడలేదు. అతడు పూర్ణయ్యగారినిబిల్పించెను.

"పూర్ణయ్యగారూ! మహారాష్ట్రులతో సంధి ఫలించ
లేదు. వారిని సరిచేయుటకు శస్త్ర మొక్కటేదారి." దివానేమి
యు బల్కలేదు. వారు గొంతతడవు మౌనముగ నుండిరి.

"హుజూర్! తొందరపడవలసిన విషయముగాదు.
మనరాయబారము విఫలమైనది నిజమే. దీనికి కారణము
మనయందు మహారాష్ట్రులకున్న తిరస్కారదృష్టి.ఇది స్పష్టము
మన శస్త్రాస్త్రములపైనను, మనసైన్యముపైనను, వారికి బరి
హాస దృష్టి యున్నది. లేకున్నచో స్వామిని పట్టిచేతుల బంపి
యుండరు. కాని, మనము శక్తి సంచయ మొనర్చుకొననిది
వారిపై బడుట యుక్తముగాదు. మనము యుద్ధములచే నలిగి
నాము. అందుచే గొంతకాల మోపిక పట్టవలెను. అనుకూల
సమయమము జూచి వారిపై బడవలెను."

"అయినచో బ్రతీకారమున కింకను దగిన సమయము
రాలేదని తమరి యూహ."

"నిజమేహుజూర్! లేకున్న మనకింతటి యవమానమేల

కలుగును? మనకనుకూలమగు సమయము వచ్చువరకును దైవమునునమ్మి యవమానమును మ్రింగికొనవలెను. ముండ్లపై వస్త్రమును వేసినాము. గట్టిగా నీడ్చినచో గుడ్డ చినిగిపోవును. ఉపాయముగ వస్త్రమును దీసికొని తరువాత కంటకోన్మూలనమొనర్తుము. తొలుత శత్రువుల కివ్వవలసిన ధనమును జెల్లించి కుమారులను రప్పించికొందము. తరువాత యుద్ధ ప్రయత్నము."

"అట్లే కానిండు. మనమిపుడు పరాజితులమైనామని మహారాష్ట్రులు తోసికొని వచ్చుచున్నారు. కాని కాలమిట్లే యుండదు. మైసూరుపులి సామాన్యమైనదిగాదు. కాలము వచ్చినపుడు గాండ్రించి మీదబడును. మహారాష్ట్రులపై పగ దీర్చికొను వఱకును నాకు మనశ్శాంతి లేదు; వారిని ముప్పు తిప్పలు బెట్టకున్నచో నా పేరు టిప్పూగాదు."

సుల్తాను దనయాసనమునుండి యావేశితుడై దిగ్గున లేచెను. ఆకాలము "టిప్పు"న కంతయనుకూలముగ నుండలేదు. అతడింగ్లీషువారితో యుద్ధమున నోడిపోయి యుండెను. వారితో సంధిచేసికొన్నాడు. యుద్ధపు ఖర్చులు కట్టింపవలసినదిగా షరతు. అంతవఱకు తన కుమారుల నాతడింగ్లీషువారి కడ కుదువయుంచెను. ఈ పరిస్థితిలో సుల్తాను ప్రతిజ్ఞ పూర్ణయ్య చెవులలో భయంకరమై మారుమ్రోగెను. సుల్తానిట్లనెను.

"నేను నూరు వర్షములు మేకగా బ్రదుకుట కంటె రెండు క్షణములు "పులి"గా జీవించుటకే యాశింతును.

మానధనముకన్న గొప్పధనము లేదు. ఆత్మగౌరవమే రాజ లాంఛనము. అదిపోయినచో బ్రతికి యేమిలాభము? ఈనాడు శత్రువులదే పై చేయికావచ్చును. కాని యంత మాత్రములో సర్వదా వారే విజయలక్ష్మి నేలికొన లేరు. ఆనాడు మన సర్వనాశనమును దప్పించి కొనుటకై సంధికంగీకరించితిమి అంత మాత్రము చేత గౌరవమును వారికి బలియిచ్చినట్లర్థము గాదు. ఈసారి పులివలె వారిపై (బడెదను. ఇంగ్లీషువారి వినాశ మొనర్చి—యీభూమి నుండి తరిమి వేయుటయే నాజీవిత ధ్యేయము. నేను వారిని యుద్ధమున నోడించు వఱకును నాస మస్త సుఖభోగములను త్యజించు చున్నాను. ఈక్షణమునుండి నేను తల్పముపై (బవ్వళింపను." ఈప్రతిజ్ఞ బెప్పి ప్పా కడపటి వఱకును నెరవేర్చెను.

తన ప్రతిజ్ఞ తీర్చికోన వలసిన సమయ మాసన్న మైనది. శృంగేరి శ్రీమఠమున కొనర్చిన ద్రోహమునకై-మహారాష్ట్రులపై దండెత్త వలెను. అనగా నింగ్లీషు వారితో సమరమన్న మాట. ఆంగ్లేయులకును—మహారాష్ట్రులకును—అంతటి గాఢస్నైత్రియుండెను. ప్రతిజ్ఞ యొనర్చిన నాటినుండియే—సుల్తాను యుద్ధప్రయత్నము లారంభించెను. సైనికులకు వీర తాంబూలము లొసంగ బడినవి; ఘోరఘోర శస్త్రాస్త్రముల దయారు సేయుట మొదలయ్యెను.

ఆంగ్లేయుల వశమున నున్న దన కుమారులను విడిపించి కొనుట కాతడు యత్నించెను. కాని—వారిని విడిపించి కొనుట

యనఁగా రెండు కోట్ల రూప్యము లను జెల్లించుట. రాజ భం డారమున ధనము లేదు. దేశము చాలవఱకప్పటికే శత్రు వుల పరమైనది. జనులపై గ్రొత్త సుంకములను విధించుటకు వీలులేదు. వారప్పటికే కష్టములలో సదమద మైనారు. యు ద్ధపు ఖర్చులు గూడ వారినెత్తిన వేసినచో—వారు జీవించుట యే గష్టమగును. అప్పుడు జనులు దిరుగబడ వచ్చును. అం దుచే పూర్ణయ్య యెక్కువ పన్ను వేయుటకు సమ్మతింప లేదు. దేశ పరిస్థితులును భయంకరముగా నున్నవి. ఎక్కడజూచి నను క్షామము ముమ్మరమైనది. యుద్ధకాలమున పైవారి పరా మర్శలు తక్కువగుటచే పాలెగాండ్రు నిరంకుశులై ప్రజలను బీడించుచుండిరి. వారంతకుముందుకంటె నెన్నియోరెట్లు మంతులైనారు. రాజకీయముగ ననుచితవాతావరణమున్నది. వీనినన్నిటి చక్కబఱచనిదే పరిపాలన సుఖకరముగా సాఁగు నట్లు లేదు. మరియిప్పుడు యుద్ధఖర్చులకై రెండుకోట్ల రూపా యల నెట్లు తేవలెను?.

పూర్ణయ్యగారీచిక్కునకు (బరిహారము సూచించిరి.

"ఇప్పుడు మనము ఖర్చులను దగ్గించి ధనముకూడ బెట్టుకొనవలెను. దీనితో మనకు కొంతసాయ ముండవచ్చును. రాజు చిక్కులలోనున్నపుడు రాష్ట్రములోని ప్రతిపౌరుడును, దనయాస్తిని రాజుక్షేమమునకై వెచ్చింపవలెను ఇదిధర్మము."

"ఇది యోగ్యమైన సలహా. దీనినమలు జరుపుటెట్లు.?"

"దానికిగూడ మార్గమున్నది. మనము నెమ్మదిగా

నున్నపుడు అధికారులకు గొప్ప జీతము లిచ్చినాము. వానితో కొందరు శ్రీమంతులైనారు. మనకు గొంత ధనమును ఋణ మిచ్చినచో బాగుండును."

"చక్కని యూహ."

"ఇంతమాత్రమేగాదు. యుద్ధములలో మునిగి యున్న పుడు పాలెగాండ్రు శ్రీమంతులైనారు. ఆధనమంతయు ప్రజ లది. వారక్రమముగా సంపాదించినారు. ఆధనములను మనము ఖజానాకు జేర్పింపవచ్చును."

"బాగున్నది."

"సైనికులు యుద్ధకాలమున దోచిన ద్రోపిడులను స్వాధీనపరచికొన్నచో మరికొంత ధనము వచ్చును."

"ఇదియును యుక్తమే."

ప్రజలపైబడి హింసించిన యధికారులు దుర్మార్గులు. వారికి శిక్షవిధించవలెను. దానికిబదులు వారినుండి యపరాధ సుంకములను వసూలు చేయవచ్చును. కొందరు కప్పములను బాకీపడినారు. వానిని వసూలు చేయింపవలెను. ఈ మార్గము లతో మనము రెండుకోట్ల రూపాయలను సులభముగా సంపా దింప వచ్చును.

"గొప్ప సలహా! మీవంటి వారున్నచో మాకే యాప దయు నుండదు.

ఈకార్యములన్నియు సక్రమముగా సాధిచుటకధికారులకు నిరూపము లొసగ బడెను; శరవేగమున బనులు సాగినవి.

అనుకొన్న దానికంటె యెక్కువ ధనము సమకూడెను. టిప్పూ యింగ్లీషు వారికి—ధనము చెల్లించి కుమారులనువిడిపించుకొనెను, వాడు శ్రీరంగ పట్టణమును చేరిన వెంటనే సుల్తాను సంతోషముతో

"ఈగడియ నుండి నేనాంగ్లేయులకు పరమ శత్రువును. వారి నాశమునకై నాసర్వస్వమును వినియోగింతును. ఈద్రోహులను భారత దేశము నుండి తరిమి వేయకున్నచో నాపేరు మైసూరు 'పులి' టిప్పూగాదు" అని గాండ్రించెను.

## ౧౩

నారాయణశాస్త్రికిని—సుఖమునకును—పదియామడలయ్యెను." భారతీదేవిని" పెండ్లాడుటతో నాతడుయౌవనసుఖచింతాతంతువులతో క్రొత్త దుకూలమును వేసికొనుచున్నప్పుడే మహారాష్ట్రుల దాడులు వచ్చిపడినవి. వానికలలన్నియు చెదిరిన కలువ రేకులయ్యెను. వాని సుఖస్వప్నములతో పాటు వాని జీవితముగూడ "సహనాపప్రవృత్తి స్సహనానివృత్తిః" యను న్యాయమయ్యెను; కాని, వానిపాలి "యయేషా" యొక కాంతిస్తంభమైనది. ఆమెను వాడు దొలుతఁ జూచినదినమున దారితెన్ను దెలియక బాధపడుచున్న వానిజీవిత నౌకకామె ధ్రువతారయైనది. ఆనక్షత్రము సాయముతో వాడొకదరికిఁ జేరుకొనెను. విధివాని 'సయేషా'యను నౌకదీవికి దెచ్చినది. బాధాదష్టుడైన వానిపాలికామె సంజీవినీలతయైనది. శాస్త్రికామెను జూచువరకును దాను జీవింతునను నాశ లేదు. తాను బ్రదు

కు జేవరికొఱకు? ఎందులకు? అను ప్రశ్నలను వాడెన్నిసారులో వేసికొన్నాడు. మహారాష్ట్రులపై కసిదీర్చుకొనవలెనను నొక వాంఛ వానికుండెను. ఆపని యొనర్చినచో తనయన్నకు వదినెకు, పరలోకమున శాంతిచిక్కును. కాని, యిది పరార్థము. మానవునికి పరార్థము స్వార్థమంత ప్రియముగాదు దీనితో వానికి జీవితమున శాంతిలేదు.

"భారతి"నిపోగొట్టుకొన్న వెనుక . తానుపిశాచివలె జీవింపవలెనని వాడనుకొనెను. సుఖము—శాంతి యీజీవితమున లేదు. నైరాశ్యముతో చక్రములూడినరథమువలె వానిబ్రదుకున్నది. అపుడయేషా వానికి దివ్యాప్సరసవలెగాన్పించినది.ఆమె వానిజీవితమున సుందర స్వప్నముల సృష్టించెను. వట్టిపోయిన జీవితపాత్రను మధువునింపెను. బ్రతుకున కర్థమున్నదని వానికి దెలిసినది, మరెవ్వరికొఱకు గాకున్నను అయేషాకొఱకు జీవితమును గడుప నిశ్చయించికొన్నాడు. ఆమె వానిహృదయమున శాశ్వత మణిప్రతిమ యైనది.

"మౌలానా శాస్త్రి బ్రదుకున దేవతవలె సాక్షాత్కరించి యాశ్రయ మొసఁగెను. ఆనాఁడా యాశ్రయము లభింపకున్నచో వానిజీవిత మేమైయుండెడిదో! వీధిపాలగుచుండెను. లేక నదీగర్భమున జేరియుండెడిది. విధి వానిపై గొంతకరుణ చూపెను. అది మౌలానా రూపమున సాక్షాత్కరించి వాని చేయి పట్టుకొన్నది. తాను హిందువు. వారు ముసల్మానులు. ఎటువంటి సంబంధము. ఇప్పుడయేషాను దనజీవిత భాగస్వా

మినిగా జేసి విధి మరియొక నాటకమాడ బోవుచున్నది. తాను బ్రాహ్మణుడు. ఆమె మహమ్మదీయస్త్రీ. ఎంత చక్కని సంబంధము!"

'అయేషా తనయందనురక్తురాలగుట తానామెయందు మనస్సు జొనుపుట ఈవిషయములు మౌలానాకు దెలియుటకు చాలకాలము పట్టలేదు. ఆనాడు మౌలానా పరపురుషుడైన శాస్త్రినినమ్మి వానినింటిలో నొంటిగా నదలిపోవుటచూచి ఉస్మాన్ ఆగ్రహోదగ్రుడైనాడు. తనతండ్రికి ముసలితనముతో బుద్ధి చెడిపోయినదని వానియూహ. శాస్త్రి మౌలానా యింటిలో నున్నవార్తలు ఊరంతయు వ్యాపించినవి. నల్గురు నాల్గు రీతులుగ నసుకొనుచున్నారు. ఈవార్త ఉస్మానునకు దలవంపులుగా నుండెను. అన్నిటికంటెను వానిమనస్సు నెక్కువ బాధించుచున్న విషయము వానిస్నేహితుడు దిలావర్ ఖాన్ తన్ను విశ్వాసముతో చూచుటలేదు. దీనికి కారణము నారాయణశాస్త్రి తమ యింటియందుండుటయే యని ఉస్మాన్ యెఱుగును. దిలావర్ ఖా నొకనాడయేషాను వివాహమాడ తలచెను. కాని, వానిప్రేమ నామె తిరస్కరించినది. వాని మనస్సునకది యొకబాకు పోటైనది. పైగా నిపుడామె యొక కాఫరునకు సేవచేయుచున్న సంగతి విని వానిహృదయమగ్గిలో బొరలాడినది. ఆమె తన్ను వరింపక శాస్త్రిని వరించినచో ఆదృశ్యము నూహించికొనుటకుగూడ వానికి భయముగా నున్నది. శాస్త్రి యింటినుండి బయటికి

పంపివేయుమని వాడుస్మాన్‌తో చెప్పెను. ధర్మము పేరుచెప్పి ఉస్మాన్‌ను బెదరించెను. ఆయుపాయము విఫలమైనది. సమాజమునుండి వచ్చుభయమును జూపి మరల బ్రయత్నించెను. అదిగూడ గలసిరాలేదు. కడకు వాడు కాపరుతో సంబంధ ముంచికొన్న వారియింటికి దానుబోనని పలికెను. అంతమాత్ర మేగాదు, బయటగూడ దనస్నేహము చాలకాలము సాగదన్నాడు. క్రమక్రమముగా వాడట్లు నడచుకొననారంభించినాడు.

"ఉస్మానున కిప్పుడున్నవి రెండేమార్గములు. ఒకటి—తన మిత్రునైనను ఒదలుకొనవలెను లేకసోదరీ ప్రేమనైనను—వ గ్గించికొనవలెను. వాఁడీవిషయములు—తండ్రికి సూక్ష్మముగ నెరిగించెను, నారాయణశాస్త్రిని—బయటికి పంపుటకు—వాడు యత్నించెను. వానికి సాధ్యముగాలేదు, 'మౌలానా' శాస్త్రిని వదలుట కంగీకరించిన వాడుగాఁడు.

శాస్త్రినొంటిగ నింటిలో విడచిపోయిననాడు.తండ్రితో "ఉస్మాన్" తీవ్రముగ వాదించెను. ఇంటిలోఁ దానైననుండ వలెను. లేక శాస్త్రియైన నుండవలెనని వానివాదన. తండ్రి వానిమాటలు లెక్కింపలేదు. పైగా శాస్త్రికి సుల్తానుతోడి పరిచయమును గల్గించినాడు. మైసూరు రాజకీయములలో నా తడొక పాత్రను వహించుస్థితి నాతడు కల్పించెను. శాస్త్రికి గలిగిన ఈ గౌరవముజూచి ఉస్మాన్‌నకు గన్నుగుట్టినది. తానే యిల్లువీడవలెననుకొన్నాడు. వాడాపని యొనర్చెను. ఉస్మాన్ మనస్సునకు శాంతినొసగి వానినిమరల నింటికివచ్చు

నట్లొనర్చుటకు మౌలానా తనమిత్రుడైన మీర్జాఖాను సాయ
మును గోరెను. కాని, యంతకుముందే దిలావర్ ఖా నాత
నికి మౌలానా యింటిలో నడచుచున్న సంగతి జెప్పియుండెను.
"ఆయేషా" శాస్త్రియందనురక్తురాలగుట దిలావరునకెట్లో
తెలిసినది. వాడావిషయమును ఉత్ప్రేక్షాలంకారములతో
మీర్జాఖానునకు వర్ణించిచెప్పెను. తన యనుమాయతో నావిష
యమునకు వాడు చిత్రవిచిత్రములైన రంగులుదిద్దినాడు.
వాని దృష్టిలో మౌలానాసాహేబు వర్తన ముస్లిం సమాజ
మున కంతయు దలవంపులుగా నుండెను. మంచిమాటలతో
శాస్త్రిని బయటవేయకున్నచో ముస్లిములనుండి మౌలానాకు
బహిష్కారము తప్పదని వాడు చెప్పిపంపియుండెను. కాఫరున
కాశ్రియ మొసగుట కారణముగా ఉస్మాన్‌కు దనకుటుంబము
నకు నడునదగిన సంబంధముకూడ నిలిచిపోయినదని వాడు చెప్పి
పంపెను. వానిదృష్టిలో మౌలానా యొక ధర్మద్రోహి.

ఇంత రభస జరిగిన తర్వాత మౌలానాయీ విషయ
మును గూర్చి కొంత తీవ్రముగ నాలోచించినాడు. ముస్లిములు
తన్ను బహిష్కరించుటకు పూనుకొనుట, తాను శాస్త్రికింటి
లో నాశ్రియ మొసంగినందులకుగాదు. అంతమాత్రమునకే
వారంతకుపితులై యుండరు. మరికోపమునకు కారణము?
ఆయేషా శాస్త్రి వీరి పరస్పరానురాగమై యుండును. ఆ
వివాహమును దానుగాని సమాజముకాని యంగీకరింపలేదు.
ఈవిషయము నాతడు మనస్సులోనే దాచికొనలేదు. వారిద్దరి

ముందు తనహృదయమును విప్పిచెప్పెను.

దీనితో నారాయణశాస్త్రి ముఖము కళ తప్పినది. భావోద్వేగముతో 'నయేషా' కన్నుల నిండ నీరుసిలిచెను. ఆమె తండ్రి యొడిలో దలనుంచి బావురుమని యేడ్వ మొదలు పెట్టెను. నారాయణశాస్త్రిమాత్రము—చెఱగి పోవుచున్న ధైర్యము గూడఁ గట్టుకొనుచుండెను. నేఁడు గాకున్న రేపైనను—ఈసంగతి బైటికి రావలసినదే; ఎన్నఁడో రావలసినది. నేఁడు గడ్డకు వచ్చినది. ఇదియు మంచిదే లెమ్మనుకొన్నాఁడు. అతఁడు మాలానాతో నిట్లనెను.

"బాబా! మీరు నాకొనర్చిన యుపకారము నీవిధమున తీర్ప వలసి వచ్చుటకు చాలదుః ఖంచుచున్నాను. నేను అయేషా నెప్పుడు కామదృష్టితో చూడ లేదు. దేవతవలె చూచి పూజించితిని; ఆమె నాపాలిట స్త్రీగాదు. నన్నుద్ధరించుటకు వచ్చినభాగ్యదేవత.నాజీవితమును నిలిపిన యదృష్టము ఆమెవిషయమున నేమియైన నపచార మొనర్చిన క్షమింపవలెను మీచేనుపకార మొనర్పబడిన నేను మీకీర్తికి కళంకమును లేకయుండవలసినది. కాని నాతప్పును గమనింపకముందే చాల దూరము బ్రయాణించితిని.ఇందులో నాయపరాధమును లేదనుకొందును. మీ పుత్రికయైన అయేషా పరిశుద్ధప్రేమకు దాసుడనైతిని. నాహృదయ పీఠమునొసగి పూజించితిని. ఆమె నా పూజను తిరస్కరించియున్నచో నిరాశతో నేను మీయింటిని వదలియుందునేమో! నా దేవి నాచేయి వదల లేదు. ఆమెనన్ను

ద్ధరించుటకే వచ్చినది. ఎట్లువదలుదు? నాకరుణకథనాలించి సానుభూతి నాపైవర్షించినది. తనహృదయమున నాకు స్థల మొసగినది. బ్రతుకుట కిచ్ఛలేని నాజీవితమున వెలుగుఁదెచ్చి నది. ఆశను పొటమరింపజేసినది. జీవితమున నొకయర్థమును గూర్చినది. నేడామెను విడచి నాబ్రతుకులేదు. ఈ మార్గ మయోగ్యమని నేను తెలిసికొను నంతలోననే మనస్సామెకు పూర్తిగ వశమైనది. ఇకనామెను వదలలేను. ఒకవేళ నామె సుఖమునకై నేను నాప్రేమను త్యాగముచేయవలసి వచ్చినచో నాడే నాజీవిత పరిసమాప్తి."

"మీచేత నుపకృతుడనై మీకే యపకారమొనర్చి నందులకు నన్ను క్షమింపవలెను. దాదా! మీరు క్షమింపకున్న చో మీపాదములను వదలుటలేదు."

శాస్త్రి మౌలానా పాదములను గట్టిగాబట్టుకొని యున్మత్తునివలె రోదించెను.

మౌలానా ఇంతవరకు శిలామౌనముగనుండెను. శాస్త్రి పాదములంటుటతో నాతడిక నిల్వలేక పోయినాడు. మౌలానా శాస్త్రిని దిన్నగ పైకిలేవనెత్తెను. కరుణారసభరితముగ నాతడిట్లనెను.

"బేటా! నీవొనర్చినదానిలో ననుచితమేమో నాకు తెలియదు. ఇదంతయు నా అల్లా యిచ్ఛ. ఆయిచ్ఛననుసరించి నీవునడచితివి. లేకున్నచో నేసంబంధము లేనివాడవు;నీకు మాయింట నాశ్రయము దొరకుటయేమి? అయేషాకు నీవెవ

రమో దెలియదు, ఆమె తనహృదయ మర్పించు టేమి? వివాహ మాడుటకు సమ్మతించుట ఒక్కమాటతో జెప్పవలెనన్నచో నదియంతయు చిద్విలాసుడగు భగవంతునిలీల. "ఏకాలానా" తృప్తిగా నవ్వెను. ఆనవ్వులలో నాపాదచూడము భక్తిని యున్మాదమే యున్నది.

"ఎక్కడో యుండిన మిమ్మిద్దర నొక చోటచేర్చి విధి భగవదిచ్ఛను గొనసాగించుచున్నది. దీనినపరాధముగ నేను భావించుట లేదు. కాని భగవంతుని విలాసములు చూచినపుడు మాత్రమే నాకాశ్చర్యమగు చుండును. అయేషాను దిలావర్ ఖానున కొసగవలయునని నాకుమారుని యాశ. నాకది యిష్ట ములేదు. వేరెవ్వరినైన గుణవంతుని వెదకి వివాహ మొనర్ప తలచియుంటిని. కాని భగవంతుడే వరుని వెదకికొని తెచ్చి నాడు. నాకుమార్తె నిన్ను వలచుటకు నీసద్గుణములే కారణము. నీయున్నతాదర్శమే యామె యనురాగమును బ్రేరేచినది. నీవీవిషయమున జంతింపవలసినది లేదు. పాలు పాలతో జేరక నూనెతో జేరునా ఏమి? భగవంతుడు మీయిద్దరి సుఖము కొరకే మిమ్మిద్దరనొకచోట చేర్చినాడు; అట్లా తలచిన యీ సంబంధమును తిరస్కరించుటకు నేనెవ్వడను?"

మౌలానా వారిద్దర నాశీర్వదించెను.

"ఇదొక్కటిమాత్రి మసాధ్యము. "ఉస్మాన్" జీవించి యుండు వఱకు అయేషా కాఫరునకు భార్యకాలేదు."

ఎవరో వెనుకగర్జించెను. అందరును తలత్రిప్పి చూచి

నారు. ఉస్మాన్ నిలబడియుండెను. వానిని దైత్యుడావరించి నట్లున్నది. వాడు బైటనిలిచియె వారిసంభాషణ వినుచుండెను.

"ఉస్మాన్! బయటెందుకు నిల్చికొన్నావు? లోపలికిరా నాయనా! అయేషా నాకుమాత్రి మాత్రిమేగాదు. నీచెల్లెలు గూడ. ఆమె భావిసుఖమునుగూర్చి యాలోచించుటలో నా కెంత యధికారమో నీకునంతేయున్నది. అది నీబాధ్యతగూడ

"మౌలానా శాంతముగ ననెను."

"అదే నేనుకూడ ననుచున్నాను. "శాస్త్రి" కాఫరు. వానిని పెండ్లాడినచో నామెజీవితమున శాంతి లవలేశముకూడ నుండదు. అల్లాతోడు వానితో నామెవివాహము నడుచుటకు వీలులేదు."

"బిడ్డా! ఇదితొందర పడవలసిన విషయముగాదు. నిదానముగ నాలోచింతము. మనకుకావలసినది. అయేషా సుఖము. ఆమె శాస్త్రిని వివాహమాడుట కంగీకరించినది. వారిద్దరకును బరస్పరానురాగమున్నప్పుడు మనము వారిని విడదీయుట భగవంతునకు ప్రీతికరమైనపనియేనా? అల్లా సమ్మతించిన వివాహమును మనము వేర్పరుచుట మహాపాపము. అట్లొనర్చినచో అయేషా జీవితము నాశమగుట తప్పదు. ఆమె త్రికరణములతో నాతనిని ప్రేమించినది. ఆమెహృదయమున ప్రతిష్ఠించుకొన్న మూర్తిని తీసివేసి మనము మరియొకరిని ప్రతిష్ఠించుట సాధ్యముగాదు. అట్లొనర్చినచో నామెజీవితమున నిప్పుముట్టించి నట్లగును. నిదానముగ యోజింపుము."

'ఉస్మాన్' మాటలకు నొచ్చికొన్న భావము—అతని ముఖముపై స్పష్టముగ నగుపించు చున్నది.

"దాదా! నీవు నూరు చెప్పినను—యీవివాహము జరుగుటకు వీలులేదు"

"ఎందువలన"

"అయేషా శ్రేష్ఠమైన యిస్లాం ధర్మమున బుట్టినది. ఆమె మౌలానా పుత్రిక. నాసహోదరి. అట్టి దాని నొక కాఫరున కిచ్చి వివాహము చేయవచ్చునా? వీరికన్నను నూఱురెట్లు యోగ్యత గలమరియొక్కని వెదకుదము ఆమె—ముస్లిములలో నెవరిని—వివాహమాడినను—నాయాక్షేపన లేదు"

"బిడ్డా! నారాయణశాస్త్రి హిందువైనంత మాత్రమున—అతని నెందుకు నీవు తిరస్కరింప వలెను? అతనిలో నెన్నియో—గొప్పగుణము లున్నవి. ముస్లిములలో నీచగుణము కలవారెందరు లేరు? 'అయేషా' చేయి బట్టుట కాతడెంతయు సర్హుడు. ఇట్టి సౌశీల్యము కలవాడల్లుడైనచో—మనమెంతయు సంతోషపడవలయును."

"దాదా! మీకు బుద్ధి పెడతల బట్టినట్లున్నది. అందుకే యిట్లు ప్రేలాపించు చున్నారు. అయేషా కిష్టమైనచో—దిలావర్ ఖాను వంటి యువకులెందరో యామెను వివాహమాడుటకు సిద్ధముగ నున్నారు; వారి నందఱిని నామె తృణీకరించినది. ఈ కాఫరు వెంటబడినది. వారిలో లేని గొప్పగుణములు శాస్త్రిలోనే మున్నవో—నాకుబోధపడుట లేదు. ఆమె ఈపట్టుదలతో

మనవంశగౌరవము నాశమగు చున్నది. చాలనందుకు మీరు కూడ అయేషాపైపే వాదించు చున్నారు మనలను జూచి యూరంతయు నవ్వుచున్నది,"

బేటా! నీవుచెప్పు విషయము లన్నియు నేనును చక్కఁగా నాలోచించి యున్నాను. పరస్పరము ప్రేమించుకొన్నవారిర్వురును వివాహ మొనర్చి కొన్నచో-ఆవిషయము మనకెట్లు తలవంపు లగునో నాకర్థమగుట లేదు ఈవివాహమును మన సమాజమెందు కాక్షేపింపవలెను? అనేక హిందూ స్త్రీలను మనవారు వివాహమాడుటలేదా? వారినెందుకు మనసమాజము తిరస్కరించుటలేదు? అప్పుడు మనకు విజయ గర్వము! పరాయి ఆడుదాని నెత్తుకొని వచ్చినాడు లెమ్మని చంకలు గొట్టుకొందుము. మనయాడువారిని వారేలికొనరాదు. ఇదేనా నీవనుచున్నది?"

"ఇతరులకు మార్గదర్శకులుగా నుండవలసిన మనమే ఈ వర్ణసంకర వివాహమునకు సమ్మతింపవచ్చునా? అయేషాకు తగినవరుడు ముస్లిములలో దొరుకడా? ఆమె దిలావర్ ఖాను వంటి వారినేల వివాహమాడరాదు? మీరేమి చెప్పినను ఈ వివాహమునకు నేను సమ్మతించుట లేదు."

"బిడ్డా! నారాయణశాస్త్రి ముస్లిముకాడనికదా నీ యాక్షేపణ. కాని హృదయమేజాతిది? దానికి నీ దేశకాలములకు తగినట్లు మతము, నీతి, జాతి మొదలైన వన్నెలను బూసికొను చున్నారు. సత్యముగా హృదయమున కేరంగును లేదు.

అది కేవల రసపిపాసి. ప్రేమను మాత్రమే యది యాస్వాదించును. అయేషా గుణవంతునే వరించినది. అతడు మహమ్మదీయుడుగాకపోయినచో నేమి? వారిరువురి వివాహమాదర్శప్రాయమైనది. మనస్వార్థ సంకుచితదృష్టితో వారిని వేరుపరచుట మంచిదికాదు. వారిసుఖమే యభిలషించు మనవిూపని యొనర్చుట రాక్షసకృత్యము."

"దాదాజీ! మీ రేమన్నను సరియే! అయేషా కాఫరును పెండ్లిచేసికొనుట మాత్రము నేను చూడలేను" ఆమెకు వివాహము గాకున్న నాకు దుఃఖము లేదు. ఈవివాహము మాత్రము జరుగ నివ్వను."

"ఒకవేళ నామె మనమాటలను దిరస్కరించి యాతని పెండ్లి చేసికొన్నచో?"

"ఆమె దేహమును 'కాఫరు' స్పర్శతో కళంకితమైన శరీరమును నాఖడ్గముచే ముక్కలు చేయుదును."

"అన్నా! నానుండి మీ సుఖసంతోషములకు కీర్తి గౌరవములకు ప్రతిబంధ మేర్పడుట నాకిష్టము లేదు. నేను బ్రతికియున్నచో గదా! యిన్ని సమస్యలు! ఇదిగో యిప్పుడే నీ కత్తితో నాతలను నఱికివేయుము. నా చావుతో మీకందఱకు శాంతి దొరకునట్లున్నది."

లోపలనుండి యన్నమాటలను వినుచున్న 'అయేషా' గోడపై మొలికికి వ్రేలాడుచున్న కత్తి తీసికొనివచ్చి ఉస్మానున కిచ్చినది. ఆమె యితని యెదుట దలవంచికొని నిలిచెను.

"దాదాజీ! అపరాధిని నేను. అయేషా కాదు. ఆమె నిరపరాధిని న్యాయముగా నాశిక్ష నాకుగావలెను."

నారాయణశాస్త్రి లేచినిల్చికొనెను.

"ఉస్మాన్! అపరాధులు మీరిర్వురునుగాదు. నేనేదోషిని. అయేషాను కన్నదే నా మొదటి యపరాధము. దానిని పుట్టినపుడే చంపివేయక యింతవరకు పెంచినది రెండవ యపరాధము. ఆమె తనకిష్టమున్నవారిని వివాహమాడుటకు ననువిచ్చినది మూడవతప్పు. ఈ యపరాధములకై శిక్షకావలసినది నాకుకనుక నీచుడైన యీతండ్రిని నీవు ఖండించివేయుము. నేనువలదనుట లేదు. నాకొఱకై నీవవమానము పొందుట నా కిష్టము లేదు."

ముగ్గురును కుమారునెదుట తలలువంచినిలిచికొన్నారు. వానికేమి సేయుటకునుదోచలేదు. మనస్సు పరిపరి విధముల బోయినది. ఈముచ్వురిలో నెవ్వరపరాధులో వానికిఁదెలియలేదు. 'అయేషా' వైపొకసారి నారాయణశాస్త్రి వైపొకసారియు వాడుచురచురజూచినాడు. వాడుతండ్రితో నిట్లుపలికెను:

"దాదా! ఈవివాహమునకు నేను సమ్మతింపను. దైవసాక్షిగ సమ్మతింపను. నేనుబ్రతికి యుండునంతవర కయేషా కాఫరునకు పెండ్లాముగా లేదు. అట్టిప్రసక్తియే వచ్చినచో నాయీకత్తికి కరుణ లేదు."

వాడు తుఫానుగాలివలె నింటినుండి బయటికి దూసికొనిపోయెను.

ఆపోవుచున్న వానిని జూచుచు మువ్వురు శిలావిగ్రహములవలె నిలచిరి. వారికేమి చేయుటకును దోచలేదు. కొడుకు తనకు ప్రాణసమానుడు. వానినివదలుట మౌలానా కిష్టములేదు; బిడ్డవానికి రెండవప్రాణము. ఆమెకోరికను త్రోసిరాజన లేదు. 'మౌలానా'ముఖము. చిత్రవేదన ననుభవించుచున్నది. నారాయణశాస్త్రి ఆయేషాను వివాహమాడుట యీజన్మలో సాధ్యమా? ఈప్రశ్నకుత్తరమెవ్వరు చెప్పనలెను?

అయేషా తన పతిక్షేమమునకై తన స్వార్థమును బలియొసగుటకు సిద్ధముగా నున్నది. ఆమరణము కుమారిగా నుండుట కామె జంకుట లేదు. శాస్త్రియు నామె సుఖమునకై తన ప్రేమను త్యాగమొనర్చుటకు సిద్ధము. కాని దాని పరిణామము దురంతముగ నుండెను. ఈ రెండు చిత్తవృత్తులను మౌలానాకు స్పష్టముగ దెలియును అతడీ వివాహమును దైవేచ్ఛయని నమ్మెను. దీనినెదురించువారు దైవద్రోహులు పాపులు. దైవమిచ్చించిన దానిని—దైవశాసనమునన్న దానిని నడిపించుట కాతడేత్యాగమునకైన సిద్ధముగ నున్నాడు. మరి యీచిక్కును విడదీయుటెట్లు? దీనికి పరిహారమేమి! ఎవ్వరికిని—యేమియు దోచుటలేదు. జీవితములో నీనాడొక యగ్ని పరీక్ష.

నారాయణశాస్త్రి తన త్యాగము నొఱబెట్టి నాటి కొను దినము నేడు వచ్చినది. తాను బ్రతికి యుండు వఱకు ఈ వర్ణసంకర వివాహము జరుగుటకు వీలులేదని ఉస్మాన

దైవముపై నొట్టుబెట్టి చెప్పినాడు. వాడు చండశాసనుడు. వానిసమ్మతిని సంపాదించుకొననిది అయేషా పెండ్లిజరిగినచో వాడనుకొన్నంతపని చేసితీరును. మౌలానా కీవివాహమిష్టమే అతడేమిసేయును! కుమారునివర్తనమునుగూర్చి హృదయమందే నుసినుసియై పోవుచున్నాడు. తనవార్ధక్యము, ఈస్థితిలో కుమారునితో జగడమాతనికి గొడ్డలిపెట్టు. అంతమాత్రమేగాదు దిలావర్ ఖాఁ ముస్లిములను తనపైకి తిప్పుచున్నాడు. వానికి దివారాత్రములు పరిచారమేమైనది. అందరితో నీతనిపై కక్షగట్టించువఱకు వాడు నిద్రపోవుటలేదు. వారు తన్నింక నానారీతుల నవమానింతురు. వానినన్నింటిని మ్రింగికొని జీవింపవలెను. దీనినుండి యెవరికి సుఖము? అయేషాకా? ఆమెకు తండ్రి యన్నచో బ్రాణము. అన్ననువిడిచి క్షణకాలము జీవింపలేదు. అన్న నెదురించుటకు బదులుగా నామె తనజీవితమునే బలియొసగుటకు సిద్ధముగనున్నది. ఆమరణము కన్యగా జీవించుటకామె దుఃఖించుటలేదు. నారాయణశాస్త్రి యెక్కడినుండియో వచ్చి శాంతములైనవారి జీవితములలోఁ గల్లోలము లేపినాడు. తనయునికి వారిజీవితములను నాశమొనర్చునని యతడెంచెను తానచ్చటనుండి కదలివెళ్లుట యుక్తమని భావించినాడు. మౌలానాసాహేబు తనను తండ్రివలె పెంచినాడు. అయేషా తనజీవితమున భాగ్యదేవతవలె నిలిచినది. వీరిర్వురి సంతోషమునకు దన ప్రేమను త్యాగ మొనర్చుటయొక్కటే యోగ్యమైనదారి. ఈ త్యాగమునుండి తాను

వెనుకంజ వేయరాదు. నారాయణశాస్త్రి యొకనాడు హఠా త్తుగ నిల్లువదలిపోయెను. మాలానా కాసంగతి తెలియుటకు రెండుదినములు పట్టినది. ఏదోపనిపై పోయియుండునని మొదటి దినమాతడెంచెను. రెండవనాడుగూడ శాస్త్రి గనుపింపలేదు. మాలానా హృదయమున గొంత కలతరేగినది. అయేషా నారాయణశాస్త్రి పడకవిదలించెను. అందులో నొకచిన్న జాబున్నది.

"దాదా! నాయపరాధమును క్షమింపవలెను. నేను మీ యింటికి బరదేశివలె వచ్చితిని. పరదేశివలెనే పోవుచున్నాను. కాని యిటనుండి పోవునప్పుడు మీ ప్రీతి, విశ్వాసములకు ఋణ పడి పోవుచున్నాను. చావకబ్రతికియున్నచో మీఋణమును దీర్చికొందును. నానుండి మీకెంతయో మానసికవ్యథ గల్గినది. దానికినన్ను మన్నింపవలెను. "అయేషా" నోదార్చు భారము మీది. నేనుజన్మలో నామెనుమఱువలెను. ఆమె యొకానొక యపూర్వమైనపుష్పము. ఆమెయెచ్చటనైనను—దనపరిసరము లను సుగంధిలములొనర్చుచు బ్రతికినచో—నేను ధన్యుడను. నేనిల్లువదలి పోవుచున్నాను. "అల్లా"మిమ్మందరిని రక్షించు గాక.

నాకై వెదకు ప్రయత్నములను చేయవలదని నామనవి.

ఇట్లు,

నిర్భాగ్యుడు,

నారాయణశాస్త్రి."

ఈ లేఖ చూచి "మౌలానా" సాహేబు" కండ్లు తిరిగెను. శరీరమును పదిపాములు పీకినట్లయ్యెను. హృదయమును నిప్పంటుకొన్నది.

"బిడ్డా! ఇంతపనిచేసినాడు. నాతోనొక మాటైనను చెప్పియుండకూడదా?"

"మౌలానా యావురని ఏడ్చెను. అతడా ఏడ్పులోనే మూర్ఛపోయినాడు. అయేషా కన్నీటి చెరువైనది. ఆమె తండ్రి తలను తొడపైనుంచుకొని శైత్యోపచారము లొనర్చుచున్నది. కొంతసేపటికి మౌలానాకు తెలివివచ్చినది. అతడు గన్నులు తెరచెను.

"అయేషా! ఉస్మానింటికి రాలేదా?"

"ఇంకను రాలేదు."

"వానితో చెప్పుము. ఇకవానికే భయమును లేదు. సుఖముగ పాలు, చక్కెరలు త్రాగుమనుము."

మంచమునంటుకొన్న మౌలానా మూడుదినములు లేవలేదు. ఈ విషమసమయమును అయేషా ధైర్యముతో ఓర్చికొన్నది. ఆమె ఏ ప్రతిక్రియయు ఒనర్పలేదు. ఆమెపాలికి రాత్రియు, పగలును, రాత్రియే యైపోయినవి.

ఈఘటనతో సంతోషపడిన వాడొక్కడే. ఉస్మాన్ శాస్త్రి యిల్లువదలిన సంగతి వానికి తెలిసినది; ఇంటికివచ్చెను. తండ్రిని చెల్లెలును పరిపరివిధములుగ నోదార్చినాడు. వారు వానితో మాటాడుటే లేదు. దినములు గడచుకొలదియు—

నీదుఃఖమును మఱచి పోదురు లెమ్మని వాపోరకుండెను. దిలావర్ ఖాన్ ముందటి వలెనే యింటికి వచ్చి పోవుటకు మొదలు పెట్టినాడు. వానిరాక పోకలు అయేషాకు హృదయ నిర్భేదకముగా నుండెను. వాడెప్పుడప్పు డామెతో మాటాడెడి వాడు వాని ప్రేమోదంతముల నామె విషమువలె మ్రింగుకొనుచున్నది. మౌలానాకు దిలావర్ వర్తనముగిట్టలేదు. అతడొక దినమున కుమారునితోఁ గఠినముగ నిట్లనెను.

నీయిష్టాను సారముగ శాస్త్రిని బైటికి నూకినావు. ఆ ద్రోహి దిలావర్ ఖాన్ మనయింట నడుగు బెట్టిన-చో నేను సహింపలేను మనయింటిని నాశమొనర్చిన ద్రోహివాడు ఆయెషాకీజన్మలో బెండ్లి కాకున్నను చింతలేదు. వానికి మాత్ర మామె నివ్వను."

మౌలానా గబగబ నడచి వెళ్లిపోయెను. ఉస్మాన్ దిగ్భ్రాంతుడైనాడు! తనతండ్రికోపమును వాడెప్పుడును జూడలేదు. మౌలానా పరమ సాత్త్వికుడు. అతని కోపము గొన్ని ముఖ మూరివారికే తెలియదు. నాడాతడింత కఠినముగ భాషించుట కుమారునకు గొత్తగా నున్నది. 'దిలావర్' ప్రణయ ప్రసంగమున కిదియదను గాదనుకొన్నాడు వానిని గొన్నిదినము లింటికి రావలదనియుఁ జెప్పెను. 'అయేషా'కు శాంతి శూన్యమైనది. శాస్త్రి కనుమరుగైనది. మొదలు ఆమె కనులలోని తేజమింకి పోవుచున్నది. శాస్త్రి యేమై యుండును? ఆత్మహత్య చేసికొన్నాడా? అజ్ఞాతమైయుండును

లేకున్నచో నాతడు దన్ను వెదుకవలదని యేలవ్రాయును? ఈ జన్మలో దానాతనిని మరల చూడలేనన్న నిరాశ యామె హృదయము నాక్రమించినది.

"అయేషా మనస్సు కాలిన పెనమైనది. కారిన కన్నిటికి మితిలేదు. ప్రతిబాష్ప బిందువునందును నారాయణశాస్త్రి రూపమే చిత్రితమైయున్నది. ఆమె మంచము బట్టెను. జ్వరము వచ్చినది, తలనొప్పి ప్రారంభమయ్యెను. అయేషాకు పిచ్చి యెత్తు సూచనలు గల్పించుచున్నది. ఆహారమెన్నడో వదలినది. ఒకదినము భావోన్మాదముతో నామె "దాదా! వారిని నేనింక యీజన్మలో జూడగలనా? ఆమెగట్టిగా నేడ్చుటకు మొదలుపెట్టెను.

"అయేషా! శాంతింపవమ్మా. శాస్త్రి తప్పక బ్రతికి యుండును. నీకుకొంచము జ్వరముతగ్గినవెంటనే యెచ్చటనున్నను ఆతనిని వెదకి తెత్తును. నీవుచింతింపకుము." తండ్రి యామె నోదార్చెను.

"లేదుదాదా! అతడు బ్రతికి యుండడు. ఈయవమానమాతని నాత్మహత్యకు ప్రేరేపించియుండును. నాకొఱకై యాతడు మరణించెను. మరణింపకున్నచో నీపాటికి వచ్చియుండెడివాడు; నీకాతని స్వభావము దెలియదు. నాసుఖమునకై యాతడు తనజీవితమును బలియిచ్చుకొన్నాడు."

"బిడ్డా! ఆవేశపడకుము. దేవుడు కరుణామయుడు. నీ జీవనము సుఖమయమై తీరును."

"ఆ ఆశనాకు లేదు దాదా! నాకు జీవితాశకూడ లేదు. మీయందరికి బరువై బ్రతుకుటకంటెను మరణమేనాకు శ్రేయము. దేవా! మాపై నెందుకింత నిర్దయుడవైనావు? ఏమి యపరాధ మొనర్చితిమని యీశిక్ష?"

"అయేషా గట్టిగా నేడ్చుచు ముసుగుపెట్టి పండుకొన్నది. ఎంతయోదార్చినను ఆమె ఏడ్పునిలుపలేదు. మౌలానాకు దిక్కు తోచలేదు. అతడచ్చటనుండి లేచిపోయెను.

దినములు గడచుకొలదియు నామెబ్రతుకు భారమగుచున్నది. శాస్త్రిలేని దామెపాలికి బ్రతుకే లేనట్లైనది. అతనిని తానన్యాయముగ నవమానించి బయటికి నెట్టితిమని యామె బాధ. దానికి క్షమాపణ చెప్పవలెకామెకు శాంతిలేదు. ఇదే యామె నిరంతర స్మరణ. దీనితో నామెకు పిచ్చియెత్తితీరును.

"మౌలానాకు అయేషాయొక సమస్యయైనది. ఆతడామెకు మందిప్పించెను. ఆమందులామెతినదు. అతడెదుట నుండి తినిపించును; మందామె యొంటికంటదు. ఆమె రోగము శరీరమునకుగాదు. మరి మనస్సునకు. అయేషా యికబ్రతుకదు. ఆమె బ్రతుకవలెనన్న మందొక్కటే. శాస్త్రిదర్శనము. మౌలానా నారాయణశాస్త్రికొరకై నగరమంతయు శోధించెను. ఎవ్వరును చెప్పువారులేరు. అతనికీనడుమ యూరిలో గొందరుమిత్రులేర్పడిరి. వారిని విచారించినాడు. వారి కతని జాడయే తెలియదు. అతడు కావేరిలో దూకెనా? ఏమో! వాని శవమునకై మౌలానా వెదకెను. దొరకలేదు. మరియాత

డేమైనట్లు? ఊరువిడిచి పోయెనా? నాలానా యడిగినవారినే అడుగును. వెదకినచోటునే వెదకును. వెదకినచోటునే వెదకినచో శాస్త్రి కొట్టుకొని వచ్చునా యేమి? అయేషా పిచ్చి మాలానా సాహేబునకుగూడ సంక్రమించుచున్నట్లుండెను. "హకీములు" అయేషాకు మందొసగుట నిలిపివేసిరి. ఆమెకు మందుపట్టదని వారు నిర్ణయించుకొన్నారు. ఆమెకుబ్రతుకవలె నన్నచో భగవంతునిదయయె మందు. మాలానాతలపై చేతులు పెట్టుకొని కూర్చొన్నాడు."

"నారాయణశాస్త్రి యూరిలోనున్నచో ఆయేషా యనారోగ్యపుసంగతి అతనికి తెలిసియుండును. ఆమెను బ్రతికించికొనుటకై యతడు పరువెత్తికొని వచ్చియుండును. రాలేదు. అతడు శ్రీరంగపట్టణమున లేడనియే దానియర్థము. సుల్తానాతనికొక రహస్యపు రాయబారమప్పగించి యుండును. దానిని సాధించుట కాతడు వెళ్లినాడు.

'శాస్త్రి' కాగితమును వ్రాసిపెట్టి-బయలు దేరెనంటిమి. అతడు నేరుగా పూర్ణయ్య యింటికి వచ్చినాడు. వాని మనస్సుకల్లోలితమై యుండెను. ముందేమి చేయువలె నని వాని యాలోచన. తానిప్పుడు ముందటి వలెనే పరదేశి. తనకిప్పుడా ప్రియ మెక్కడ చిక్కును! ఏమి చేయువలెను? వాని కాత్మహత్య యొనర్చికొనుటకు బుద్ధిపుట్టలేదు. అది పిరికితనము. జీవితమును ధైర్యముతో నెదిరించక ఆత్మహత్య యొనర్చుకొనుట తనవంటి మహాత్వాకాంక్ష గల వానికి తగదనిపించి

నది. తానొక ప్రతిజ్ఞను తీర్చుకొనుటకై బ్రతికినాడు. దానిని తీర్చుకొనక ముందే మరణించుటలో నాతనికి సుఖము లేదు. తనవదినె—అన్న వీరికైన యుపకారమునకు ప్రతీకారము సేయవలయును. ఆమేరకు దనయన్నకు ప్రతిజ్ఞకూడ చేసినాడు. చావకతప్పనిచో నాత్మహత్యయొకటే నామార్గము? మహారాష్ట్రులపై యుద్ధమునకు వెళ్లవచ్చును. వారితో (బోరి మరణించినచో—యిహపరములు రెండును సిద్ధించును. ఈయాలోచన బలీయముగుటచేతనే నాశుపూర్ణయ్యయింటిదారి పట్టెను.

అతడాయింటిలో బ్రవేశించినంతనే యెవరో “మీారు నారాయణ శాస్త్రిగారా!” యన్నట్లుండెను. శాస్త్రికాశ్చర్యమైనది. అతడు వెనుదిరిగి చూచెను. నిలచికొన్నవాడు పూర్ణయ్యగారి “బక్షీ”

శాస్త్రినిదానముగా జ్ఞాపకము చేసికొనెను.

“నమస్కారము పూర్ణయ్యగారు ఇంటిలో నున్నారా?”

“ఉన్నారు నేనిప్పుడే వారితో మాటాడి వచ్చితిని. మిమ్ము వెదకికొనివచ్చుటకై బయలుదేరినాను. మీారు మహాలానాగారింటిలో నుందురని తెలిసినది. అక్కడికే ప్రయాణమైనాను. మీారాగే యెదురు పడినారు”

ఈమాటతో శాస్త్రికి మరింత యాశ్చర్యమయ్యెను.

“ఏమి? పూర్ణయ్యగారు చెప్పి పంపినారా?” కుతూహలముతో నడిగెను.

'అవును ఏదో తమతో రహస్యముగా మాటాడవలె'

"సంతోషము"

శాస్త్రి గారేవచ్చినారని పూర్ణయ్యకు వర్తమానము వెళ్లెను. వారతనిని గౌరవించి—యాసనము జూపిరి. వారివాలకము జూడగా—ఆతనికొరకే కనిపెట్టుకొన్నట్లున్నది. "శాస్త్రీ"పూర్ణయ్యగారు చూపిన యాసనమున నుపవిష్టుడైనాడు. దివాను సంభాషణ మారంభించెను.

తమరు వెంటనే "పూనా"కు (బ)యాణమై పోవలెనని సుల్తానుగారి యాజ్ఞ"

"[illegible]"

"స్వామి పూనాకుపోయి మూడుమాసము లైనది. వారిసమాచారమేమియు దెలియలేదు. వారిరాయబారమేమైనదోయని సుల్తాను కలతపడుచున్నాడు. మహారాష్ట్రులు మనకుశతృవులు. వారిరాజ్యమున స్వామియున్నిదినములుండుట—సుల్తానుగారి దృష్టికి క్షేమకరముగ దోచుటలేదు. వారికచటనేదైన విపత్తు సంభవించినచో! ఇదిసుల్తానునకు గొప్పచింతయై పోయినది. మీరు వెంటనే బయలుదేరిపోయి—స్వామిని పిలిచికొని రావలెను. ఈపని చాలరహస్యముగ జరుగవలెను. మీరక్కడ చాలహెచ్చరికతో మెలగవలసి యున్నది. మీకార్యము మహారాష్ట్ర గూఢచారులకు దెలిసినచో—వారు మిమ్ముచంపుట నిర్బంధింప వచ్చును. ఇప్పటి పరిస్థి

తులలో స్వామికి రాజకీయములలో సంబంధము కల్పించుట మాకిష్టము లేదు. వారు లోక కల్యాణమునకై తపస్సు చేయుచు నిశ్చితముగా నుండవలెను.

ఇట్లు పూనాయాత్ర శాస్త్రికి నిరీక్షితముగా వచ్చినది. శాస్త్రి పూనాయందున్న స్వామిని రహస్యముగ సందర్శించి వారిని శృంగేరికి జేర్చెను. ఈపనిని సాధించుటకు రెండు నెలలు పట్టినది. నారాయణశాస్త్రి శ్రీరంగపట్టణమునకు మరలి వచ్చెను. ఆతడు వచ్చువేళ కాతని కొరకై యొక యాశ్చర్యకరమైన విషయము కాచుకొని యున్నది. శాస్త్రిని ప్రార్థించి ఇంటికి గొంపోవుటకు స్వయముగ ఉస్మానే వచ్చియుండెను. ఉస్మానునకు తన ప్రవర్తన యింత తీవ్రఫలముగ బరిణమించునని తెలియదు. శాస్త్రి కాఫర్. వానిని తన సోదరి పెండ్లియాడ గూడదని యాతడు తిరస్కరించి యుండెను. తన తిరస్కారము చెల్లెలి ప్రాణములను బలిగొనుటకు సిద్ధపడునని యాతడెంచలేదు శాస్త్రి కనుమరుగైనచో—కాలక్రమమున నామె వానిని మఱచి వేరొకరినైన పెండ్లియాడునని వాని యూహ. అదియట్లు జరుగలేదు. ఆమె శాస్త్రిని త్రికరణశుద్ధిగా ప్రేమించినది. వానిని దప్ప యామె మరొక్కరిని కన్నెత్తి చూడలేదు. వానిచింతతో నామెపడక బట్టినది. హాకీముల మందులు పట్టలేదు. వారిది మనోరోగమనిరి. చెల్లెలి కరుణా జనకమైన యీస్థితిలో తనహఠమును పట్టిసాధించి కొనుటకు—వాని చేతగా లేదు.

ఒకనాడు తండ్రిని సమీపించెను.

"దాదా! తెలియక తప్పుచేసినాను. నాతప్పును మన్నించవలెను. శాస్త్రి రాకున్నచో అయేషా బ్రతుకునట్లులేదు. మొదలాతనని వెదుకుటమంచిది. ఆపుణ్యాత్ముడు కనబడినచోనైనను అయేషా బ్రతుకునేమో?"

ఈమాటవిన్న మౌలానా కెంత యాశ్చర్యమైనదో చెప్పుట కశక్యము. అతడు త్తర మొసగలేదు. కొంచముసేపు మౌనముగ నుండెను.

"దాదా! నాయపరాధమునకు క్షమాపణ లేదా ఏమి? ఉస్మాన్ కంఠము గద్గదమైనది."

"బిడా! నీతప్పు నెప్పుడో క్షమించినాను. కాని ఆదినమున నీవు తొందరపడి ఒక ప్రతిజ్ఞ చేసినావు. భగవంతుని సాక్షిగ ముస్లింకానివానికి నాచెల్లెలి నొసగనంటివి. నీచెల్లెలి కొఱకై ప్రతిజ్ఞను వదులుదువా ఏమి? మౌలానా దైన్యముగ ప్రశ్నించినాడు.

"దాదా! ఆవిషయమును నేనుయోచించి యొకనిర్ధారణకు వచ్చినాను, ఆమెకు శాస్త్రితో వివాహావిషయమై నాయాక్షేపణ లేదు. నాయాక్షేప మొక్కటే. మనది ముస్లిం మతము. నారాయణశాస్త్రి హిందువు. ఈ వివాహము హిందూ, ముస్లిం ధర్మములు రెంటికిని సమ్మతముగాదు. ఏశాస్త్రముగూడ కంగీకరింపదు ఈచిక్కును విడదీయుట కొకటే మార్గము. శాస్త్రి ముసింమతమును స్వీకరించుట.'

"బిడ్డా! ఎవరి ధర్మము వారికి గొప్పది. నారాయణశా స్త్రిని ముస్లింమతమును స్వీకరింపుమని నే నెట్లు నిర్బంధింతును?"

"ఇది నిర్బంధముగాదు. శాస్త్రి అయేషాను తనప్రాణముకన్న నెక్కువగా ప్రేమింనుచున్నాడుగదా! ఆమెకొఱకై ఏత్యాగము చేయుటకును సంసిద్ధుఁడుకదా! ఈచిన్న త్యాగ మేల చేయలేడు? ఈ యగ్నిపరీక్షనుండి అయేషాను తప్పించుటకిది యొక టేదారి. వేఱుమార్గము లేదు."

"ఈ విషయమును నిర్ధరింపవలసినవాఁడు శాస్త్రి యొక్కఁడే. అతడు పూనానుండి తిరిగిరానిమ్ము. తర్వాత నీవిషయమాలోచింతము. అతడు సంకోచింపక యిస్లాంధర్మమును స్వీకరించినచో నాయాక్షేపణ లేదు. ఒకరికిష్టము లేనిది మతధర్మమును బలవంతముగా వారిపై రుద్దుట అల్లాకు సమ్మతముగాదు

"శాస్త్రి ఊరికివచ్చినసంగతి ఉస్మానుకు దెలిసినది. వాఁడు పరుగెత్తికొని వచ్చినాఁడు. తనవిరహాముతో అయేషా పడకబట్టినదని విన్నపుడు శాస్త్రి మనస్సు నిప్పులమూట యైనది. అతడు వెంటనే యింటికి బరుపెత్తెను. దూరమునుండియే అయేషాను గమనించినాఁడు. ఆమె పూర్తిగ బక్కచిక్కిపోయినది. ఈస్థితిలోనే యామె మరికొన్ని దినములున్నచో మరణము తప్పదు. దైవమామె చావునిచ్ఛింపలేదు. వారిర్వురను గలిపి బ్రదుకవలెననియె విధి భావించెను.

శాస్త్రి కంఠము రుద్ధమైనది. అతడయేషా ముందునిలచెను.

'అయేషా'

పైనమాటరాలేదు.

ఆమె కండ్లువిచ్చిచూచినది. అయేషా వెంటనే యాత్రనిని గుర్తుపట్టలేదు.

'బిడ్డా! వచ్చినదెవరో చూడుము. అతఁడు నీ భాగ్యదేవత శాస్త్రి.' మౌలానా గట్టిగానన్నాడు.

'ఎవరది?'

ఆమెలేచి కూర్చొనుటకుఁ బ్రయత్నించినది. ఉస్మాన్ అయేషా పడిపోవునేమోయని తిన్నగా భుజమున కానించికొని శయ్యపైఁ బరుండబెట్టెను.

"అవును. నారాయణశాస్త్రి వచ్చినాడు."

ఉస్మాన్ ప్రీతితో అయేషా తలనిమిరెను.

"అన్నా! నాస్వామికి నాపై కోపములేదా! నన్ను జూచుటకు వచ్చినాడా! నాసర్వాపరాధములు క్షమించి నాపై యనుగ్రహించినాడా?"

"అవునమ్మా నీవింక నిశ్చింతగా నుండుము. నీయదృష్ట ద్వారములు తెఱచికొన్నవి."

శాస్త్రి మౌలానా కాళ్లపైఁ బడినాడు.

"దాదా! నాతప్పు క్షమించవలెను. అయేషా యీస్థితికి వచ్చునని కలలోనైన నూహింపలేదు. నావలన నామెజీవితము నశించినది. మీయుపకారమునుబొంది నేను మీ కపకారమొనర్చితిని. మీరు నాతప్పును మన్నించవలెను."

'బేటా నీవపరాధివిగావు. నిందింపదగినవాడవుగావు. ఈ సమస్తజగత్తును వేయికండ్లతో జూచుచున్న యల్లా పర్వర్దిగార్ ఒక్కడే రక్షించుటకును శిక్షించుటకును సమర్థుడు. అతనిని మనసార బ్రార్థింపుము. వానికి దయగలిగినచో మనజీవితము సార్థకమగును." మౌలానా అల్లా నామస్మరణజేయుటకారంభించినాడు.

"దాదా! మిమ్ముసరిగా నర్థము చేసికొనలేక పోయినాను. నన్ను క్షమింపవలెను."

ఉస్మాన్ దీనముగ బ్రార్థించెను.

"బడ్డా శాస్త్రికిఁజెప్పిన యుత్తరమే మనకుగూడ. ఇందులో నీతప్పులేదు. అల్లా వీరిద్దరి ప్రేమలను బరీక్షించుటకొక యగ్నిపరీక్ష బెట్టినాడు. అందులో వీరిద్వరును గెలిచినారు. ఇక వీరి వివాహమున కాలస్య మెందులకు?"

"మరి, నేను పెద్దమసీదు 'ఖాజీ'గారిని పిలిచికొని వత్తునా;"

"మావివాహ మెన్నడో జరిగిపోయినది. ఇప్పుడు జరుగవలసినది.—సమాజ మేర్పఱచిన—సాంకేతిక వివాహము. దానికి తయారు" శాస్త్రి పలికెను.

"బిడా! ఇందులో నొక చిన్నసంగతి యున్నది. నీవన్యథా భావింపరాదు. ఉస్మాను తొందరపడి యొకచిన్న ప్రతిజ్ఞ చేసినాడు. దానిని నెఱవేర్చుటకు— నీవు ముస్లిం ధర్మమును స్వీకరింపవలెను. అదికూడసమ్మతమైన నే నానిర్బంధము లేదు.

శాస్త్రి చకితుడయ్యెను అయేషాను పెండ్లిచేసి కొనుట కు నేను ముస్లింగావలెనన్నమాట.

"బిడ్డా! నేనట్లనుటలేదు. ఇది ఉస్మాను యిచ్ఛ. వాడు తొందరపడి భగవంతుని సాక్షిగా నీవ్రతిన వట్టెను. ఆవిషయ మును దెలిపితివంతే. నాయభిప్రాయ మడిగినచో నీవు ఇస్లాం మతస్థుడవైనను కాకున్నను నాకొక్కటే. అయేషాకు నీవు భర్తవు.

శాస్త్రి నవ్వుచునన్నాడు "దాదా! నామాట మీరు తప్పుగా నర్థముచేసికొనకూడదు. అయేషా కొఱకై నేను ము స్లింనగుచున్నానని మీరూహింపరాదు. ఆమెకొఱకై నేను నాధర్మమును వదలలేను, కాని, ఏనాడు హిందువులైన మహారాష్ట్రులు శృంగేరిపైబడిరో ఆనాడే మతమునకు వ్యా ఖ్యానము మారిపోయినది. అంతేగాదు. ఒకానొకనాడు నిరా శ్రయుడనైన నన్ను మీరాదరించితిరి. ఆనాడు జీవన-మరణ సమస్యలో నుంటిని. అయేషా నన్ను మరణదంష్ట్రనుండి రక్షించినది. ఆమెయుపకారమునకై నేను హిందూధర్మమును వదలుచున్నాను. అటువంటి పవిత్రమేదైన ముస్లింమతమును స్వీకరించుచున్నాను. వాస్తవమునకు నాకేనాడేమతమునులేదు నా యీ పనిలో అయేషా ప్రాణముతో నిలిచినచోజాలును. నేనొకనాడు నాయభిప్రాయమును మీకు స్పష్టముగ జెప్పి నాను. మఱల నదే జెప్పుచున్నాను. హిందూ ధర్మమే గొప్ప దని నేననను. ముస్లిం ధర్మమును తక్కువగాదు. అన్నిమతము

లును ఉదాత్త ధర్మమునే బోధించినవి. కాని-మానవుని మనస్సులో నరకమున్నది. అందుచేతనే—హిందువునైనను—నలుగురు హిందువులవలె బ్రదుకలేను. మహమ్మదీయుడనైనను నల్గురివలె జీవింపలేను. నాదిమానవ ధర్మము. మౌలానా గూడ నదే ధర్మమునకు జేరినాడు. అయేషాయు నంతే. ఇంక నేను మతము మార్చుకొన్నానను ప్రశ్నయే లేదు. మతమొక్క—జటిల బాహ్యాచరణము. నా కేమతము పైనను మమతలేదు. మానవ ధర్మముపై నభిలాష యున్నది. 'అయేషా'కు నాహృదయమిచ్చి కొన్ననాడే—మానవ ధర్మమును స్వీకరించినాను నా కే యితర ధర్మముల యావశ్యకతయు లేదు. మీాసంతోష మునకై మీాయిచ్ఛననుసరింతును"

శాస్త్రి ఉస్మాన్ వైపు అర్థగర్భితముగ జూచెను. ఉస్మానేమియు బలుకలేదు. అతఁడు తలవంచు కున్నాడు.

ఆనాఁడే శాస్త్రి పెద్దమసీదునకు బోయి అక్కడి ఖాజీతో ఇస్లాం మతదీక్ష గైకొనెను. ఖాన్ జహార్ ఖాన్ అనుకొ్రొత్త పేరు బెట్టికొన్నాడు. మరుదినము ఇస్లాం శాస్త్ర ప్రకారము అయేషాకు శాస్త్రితో పెండ్లియైపోయినది.

ఈసంగతి విని—యూరిలోని జనులు చకితులైరి. కొందరు శాస్త్రిని నిందించి—వాడు కామాంధుడనిరి. అయేషా—రూపము వానికి బిచ్చెక్కించినదన్నారు. ప్రేమకు కండ్లు లేవని కొందరనిరి. ఎన్నడో జరుగవలసిన పెండ్లి నేఁడు జరిగినదని. కొందరు చమత్కరించరి.

వానికి గావలసిన పిల్ల హిందువులలో దొరుక లేదు. అన్యాయముగా కులము మార్చుకొని-మాకందరికిని అపఖ్యాతి దెచ్చినాడు—నీచుడు అని సనాతనులు కండ్లెఱ్ఱ జేసినారు. ఇవే వియు శాస్త్రి మనస్సుపై బనిచేయ లేదు. మౌలానాసాహేబు నవ్వుకొన్నాడు.

ప్రపంచములోని సర్వమతములు చెప్పు నుపదేశ మొక్కటే. దేవుడొక్కడే ననుట. మనమాతని సంతానము' కాల దేశములనను సరించి, యాత్మశోధన మార్గమున వేరు సంప్రదాయము పుట్టియుండ వచ్చును. అంతమాత్రముతో మానవులు భిన్నులుగారు. వారందరు నన్నదమ్ములు మేము "కరీం" అని పిలుచువానినే మీరు "కృష్ణు" డందురు. ఇతరులు యేసుక్రీస్తని సంబోధింతురు. కాని' చైతన్యస్థితి యొక్కటే. దాని నేపేరిట బిలిచిననేమి? నదులన్నియు సముద్రము న జేరును; అట్లే మానవు డేభాషతో బ్రార్థించినను—ఆపిలుపు భగవంతునే యందుకొనును. లోకమున బ్రతికియుండు సంతవరకు వీడు హిందువు. వాడు ముసల్మాను ఇతడు క్రైస్తవుడు, మఱియొకడు బౌద్ధుడు ఈభేదభావమున సంకుచిత దృష్టి. భగవంతునిదృష్టిలో నివిలేవు. ఈదివ్యసత్యమును "మౌలానా" గ్రహించి యుండెను.

౧౪

"దివానుగారూ! ఈకావేరి మనకు మాతృదేవత. జీవన ప్రదాయిని. సందేహము లేదు. కాని, యీామెనే నమ్మియుం

నుట కష్టము. కారణమేమన నీమెమతి చంచలము. ఏసమయ మునకు మనలను చేయినదులునో చెప్పలేము. ఈమెను నమ్మి మనము కోటకు వేరొక కందకమును నిర్మింపకున్నచో మూర్ఖులమగుదుము. ఒకవేళ కోటగోడలు శత్రువుల ఫిరంగులతో బలిమినీడినను దానిని వారెక్కి వచ్చుటకు సాధ్యముగానుండ దు. పెద్దకందకమడ్డముగా నుండవలెను."

ఈ మాటలన్నది సుల్తాను. అతడు బయటికోట మర మ్మత్తు చేయించుచుండెను. ఈసారి శత్రువులు దాడిచేసినచో కోటలోని యొకరాయినిగూడ పెకలింపలేక పోవలెను. ఇది యాతని హృదయాభిప్రాయము. యుద్ధఖర్చులక్రింద నివ్వవల సిన పరిహారద్రవ్యము నాతడు కాసుమొదలుకొని తీర్చివేసి నాడు. కొడుకును వెనుకకు పిలిపించికొనెను. తర్వాత కోట మరమ్మతు లారంభమైనవి. అతడు కోటల రక్షణకై ఫిరంగు లుంచెను. శస్త్రాస్త్రములు సమకూర్పబడినవి. సైన్య సంగ్ర హము వేగముగా సాగిపోవుచుండెను. ఆహారములు సమకూర్ప బడుచుండెను. యుద్ధసామగ్రి సేకరణ మారంభమైనది. ఈసమ యమున సుల్తాను పదిచేతులతో పనిచేసినాడు. వానిదేశమం దున్న కమ్మరులు, కుమ్మరులు, కంసాలులు యుద్ధసామగ్రిని, పగలురాత్రి కష్టించి తయారుచేయుచుండిరి. దేశమునలుమూల లనుండియు సైన్యములు వచ్చుచుండెను. ఈసారి ఫ్రెంచివారి సాయముతో నాంగ్లేయులను భారతదేశమునుండి పూర్తిగ తరిమివేయవలెనని టిప్పూనిర్ణయము. వారిసాయముతో నాత

డనేక ప్రదేశములలో క్రొత్తయంత్ర పరికరములను దయా రుచేయించెను. కర్మాగారములు నియమించినాడు. దుర్గరక్షణ కు గొప్పకందకము త్రవ్వింపవలెనని యాతనియూహ. ఈ యో చన తట్టినదే తడవు టిప్పూ మంత్రులతో నాలోచించి కందక మును విస్తరింపజేసి లోతుగ ద్రవ్వుట కాజ్ఞయిచ్చినాడు. ఈ పని సాఫీగా జరుగుచున్నదో లేదో తెలిసికొనుటకు తానే దినమున కొక్కసారి గుఱ్ఱముపై చుట్టి పోవుచుండెను.

ఆదినము కోటకుత్తర దిశయందున్న కందకపుపని యె ట్లున్నదో చూచుటకు సుల్తానరుదెంచినాడు. అతనివెంట పూ ర్ణయ్య, ఆతరువాత మున్షీ హబిబుల్లాసాహేబును, నారాయణ శాస్త్రియు నడచుచుండిరి. ఇంతలో సుల్తానుదృష్టి, నదిలో తళతళ మెరయుచున్న ఏదో పదార్థముపై బడినది.

"ఏమది హుజూర్? నదిలోనేమో వెదకుచున్నారు."

సుల్తాను నదివైపు చూపించుచు నిట్లనెను.

"పూర్ణయ్యగారూ! ఆగుండ్లసందులో నేదో యొకవస్తు వు తళతళ మెరయుచున్నది. చూచినారా?"

పూర్ణయ్య యావైపు చూచెను. టిప్పూ నిర్దేశించిన స్థలమున నేదో యొకవస్తువు నిగనిగలాడుచుండెను. వారచటి కేగి నదిలోదిగి చూచిరి. ఆశ్చర్యము! అదియొక స్ఫటికమయ శివలింగము. అఱచేత బూజచేయుటకు తగినయాకారము గల యది ముద్దుగులికెడి పానవట్టము దానిపై సుందరమైన లింగ ము. పూర్ణయ్య కండ్లకద్దుకొని యిట్లనెను.

"హుజూర్ ఇదిస్ఫటికలింగము."

సుల్తాను కుతూహలముతో దానిని చేతికిదీసికొన్నాడు. "యే అల్లాపర్వర్దిగార్ ఏమినీమాయ! ఈ శివలింగమిక్కడి కెట్లు వచ్చెను?"

"హుజూర్! ఎంతసుందరముగానున్నది. ఇది యిచటి కెట్లు వచ్చెనో! బహుశః యెవరో సాధువులు జాఱవిడచుకొని యుందురు. నీటిలో నదికొట్టుకొనిపోక యింతవఱకిక్కడ నున్నదే యాశ్చర్యము."

"ఇది మంచిశకునము. ఆరంభముననే పరమశివుడు దర్శ నమొసఁగి మనల నుద్ధరించినాడు. ఈ యుద్ధమున మనకు విజ యము తప్పదు. దైవానుగ్రహము మనవైపున్నది. మనము కావింప నెంచినపని సఫలమై తీరును." నారాయణశాస్త్రి పలికెను.

"అల్లా యిచ్చ యెట్లున్నదో యట్లేజరుగును. పవిత్ర మైన యీ శివలింగము నేమిచేయవలెను?"

సుల్తాను పూర్ణయ్యవైపు చూచినాడు.

"ఏదో దేవాలయమునకు లేక మఠమునకు బంపివేయు దము. నంజనగూడులోని నంజుండేశ్వరుని సన్నిధికి బంపివేసిన -నో మూడువేళలందును పూజలు జరుగును." సుల్తాను కొంత సేపేమో యోచించుకొనుచుండెను.

"మీరు పలికినది సత్యము. దీనికి త్రికాలపూజ నడుప వలెను. దీనితో మనకు క్షేమమగును. దీనిని శృంగేరిలోని శ్రీ

సచ్చిదానంద భారతీస్వాములకు బంపివేయుదము. వారికంటెను ఆచారనిష్ఠులు తపోధనులైన మహాత్ములు మనకుదొరకరు."

హుజూర్ ఇది యుక్తమైన యోచన స్వామి స్ఫటిక లింగమును గాంచినచో జాల నానందపడును. దీనికి వారే యోగ్యులు."

"అట్లైనచో దీనిని రేపే శృంగేరికి బంపివేయుదుము. సకల రాజమర్యాదలతో నీ శివలింగమును, యోగ్యులైన వారు స్వామిదగ్గరకు దీసికొని పోవుదురుగాక."

పూర్ణయ్య శాస్త్రివైపు జూచుచు బలికెను.

"ఆజ్ఞ యైనచో నారాయణశాస్త్రి యీపనికి దగిన వాడు."

"అవును! మీరే శివలింగమును శృంగేరిలో జేర్చిరా వలెను. అట్లేస్వాముల తీర్థప్రసాదములను ఆశీర్వాదములను తీసికొని వెంటనే రావలెను."

"టిప్పూ—అనాడే స్వామికి నిరూపమును వ్రాసి శాస్త్రి చేతికిచ్చి—ఆతనిని శృంగేరికి బంపివేసెను.

నారాయణశాస్త్రి వెంట మితపరివారముండెను. శాస్త్రిశృంగేరికిదారి బట్టుటకుముందు సుల్తానునుండి మరియొకసారి కబురు వచ్చినది. శాస్త్రినిచూచి సుల్తానిట్లన్నాడు.

"శాస్త్రిగారూ! స్వామిగారెందుకో మేముపంపిన గుఱ్ఱములను. ఏనుగులను, వెనుకకంపినారు; అందుచే మామనస్సు చాల వ్యాకులపడుచున్నదని తెలుపుడు. అవసరమున్నదాని

కన్న యెక్కువగా వారెన్నడును మమ్మడిగి యెఱుఁగరు. ఈ విషయము మాకు తెలియును. కాని, స్వామి సంతోషముతో పంపిన ఏనుగు, గుఱ్ఱములు, వీనిని వెనుకకంపక తమదయొద్దనే యుంచుకొనియున్నచో మాకు సంతోషముగ నుండెడిది. వాని నుత్సవములలో వాడుకొని యుండవచ్చును. ఇప్పటికైనను వానిని వెనుకకు దెప్పించికొనవలసినదిగా మనవిసేయుదు'"

"కొన్ని దినములకుముందు సుల్తాను స్వామిసేవకై ఏనుగులను, గుఱ్ఱములను గానుకగా నంపియుండెను. స్వామికి వైభవములపైనంత యిష్టము లేదు. వారు వానిని వెనుక కంపి యుండిరి.

శృంగేరిచేరిన శాస్త్రి స్వామినిజూచి నమస్కరించి సుల్తానొసగిన నిరూపము నొప్పించెను.

దానిలో నిట్లు వ్రాయబడి యుండెను.

శ్రీమత్పరమహంసాది బిరుదాంకితులైన శ్రీ భారతీ స్వాముల దివ్యపాద సన్నిధికి...

టిప్పూ సుల్తాను పాదుషా సలాము. తమరు పంపిన పత్రికతో అన్ని వివరములును తెలిసెను, స్వంతస్థలానికి వచ్చి చేరినవిషయముతో మాకుచాల సంతోషమయ్యెను. మంచిదాయెను. భగవంతునిముందు త్రికాలములు యేకనిష్ఠతో కూర్చొని ఈశ్వర ధ్యానముచేయునప్పుడుమాపైపరామరిక ఉంచుకొన్నారని మల్లా పండిత నరసింహశాస్త్రిలద్వారా వివరములుకృతములాయెను.

మా మనస్సులో మూడుబలములపై అహంకారము న్నది. అదేమంటే ఈశ్వరుడు దయాపూర్ణుడై యుండుట యొకటి. గురువుల ఆశీర్వాదముండుట రెండవది. మూడవది ఆయుధములుండుట. ఈ మూటిలో ఈశ్వరుడు జయము నివ్వ వలెనంటే మీవంటి పెద్దవారి యాశీర్వాదముతోనే జయము కలుగును.

మీరు పంపించిన గుఱ్ఱమును, ఏనుగునుచూచి మనస్సు వ్యాకులత చెందినది. బహుళజనానికి అన్నం వేస్తున్నారు. ఈ మూగి జీవాలకు యేమితక్కువ వచ్చిందికనుక! మఠములో నుంచుకోవలెననెడి అభిప్రాయముతో వెనక్కుపంపుతున్నాను స్వీకరింతురని నాయాశ.

ఇపుడు తాము ధరించుటకు ఒక శాల్వజోడీ పంపినాము తీసికొనేది. స్వల్పదినాలలో "ఖాన్సవారీ" ఆ ప్రాంతములకు వస్తూఉన్నది. వారిని కలుసుకొనేది. కదమ వివరములన్నీ మల్లా పండితులద్వారా తెలిసికొన్నాము.

తా॥ 24 మహేతగ్

ససాల్ షాదాసన్ 1227.

మహమ్మద్. రాక్షస సంవత్సర

జ్యేష్ఠ బహుళ ౮ లో

తాజాకాలీ

ఇప్పుడు మీసమీపములో నుంచుకొని పూజచేయుట కొక స్ఫటికలింగము పంపినాము. ఇదిచాల యోగ్యమైనది.

మీకు మమ్ములను సదా జ్ఞాపకముండుటకు శివలింగమంపితిమి: దయచేసి మీరు దీనికి త్రికాలపూజ నడిపించేది.

స్వామి శాస్త్రియిచ్చిన శివలింగమును దీసికొని కండ్ల కద్దుకొన్నాడు. వారికి తెలియకయే వారికన్నులనుండి ధారాపాతముగ నీరుగారినది. విధర్మియైన టిప్పూ సుల్తాను తమ విషయమున చూపిన యాదరాభిమానములకు వారాశ్చర్య పడినారు. చాలసేపు వారు శాస్త్రితో రాష్ట్రములోని రాజకీయములుగూర్చి చర్చించుచుండిరి. సుల్తాను పంపిన గుఱ్ఱము, ఏనుగుల ప్రస్తావనకూడ వచ్చెను.

"శాస్త్రి! మేము ఇప్పటికే సుల్తాను నుండి చాలయుపకారములను బొందినాము. ఇంకను మావైభవమునకై వారిని పీడించుట మాకిష్టములేదు. జంతువులులేనిది మఠమునందలి యుత్సవములు నడువవా? ఉత్సవముల కేనుగులేగావలెనా? భగవంతునికి నివేదించవలసినది మహానిశ్చలత్వ మొక్కటే."

నారాయణశాస్త్రి వానిని దసికొనవలెనని నిర్బంధించెను. స్వామికి వేరుదారి తోచలేదు. వారంగీకరించిరి.

ఈసందర్భమున శృంగేరిలో మాటలు చిలువలు పలవలుగా నల్లెను. శాస్త్రి హిందూధర్మమునువదలి యిస్లాంధర్మమును జేపట్టినాడని తెలిసినది. "ఖాస జహాన్ ఖాన్" అని పేరు మార్చుకొన్నది తెలిసెను. ఆ స్తికమహాశయులు దీనికి చాల యసహ్యించుకొన్నారు. కొందరు శాస్త్రి గుణమే యింత యనిరి. శాస్త్రి శివలింగమును దీసికొనివచ్చుటయు గొందరి

కిష్టము లేకపోయినది, కాని సుల్తానాలింగమును ద్రాకినాడు గదా! దానినివారు "నావిష్ణుః పృథివీపతిః" అని సరిపెట్టు కొనిరి. వారిదృష్టిలో టిప్పూ శివలింగమును స్పృశించుట తప్పుగాలేదు. శాస్త్రీ ముట్టుకొనుట తప్పైనది. శాస్త్రీ వృత్తాంతమును స్వామికెఱింగింపనిది వారికి నిద్రపట్టలేదు. నారాయణశాస్త్రి స్వామిగారి దగ్గరకు వచ్చినపుడు స్వామి యిట్లు ప్రస్తావించిరి.

"నారాయణశాస్త్రి నీవీనడుమ ముస్లింధర్మమును స్వీకరించినావని విన్నాము. నిజమేనా?"

"అవును గురుదేవా".

"జరిగిన వృత్తాంతమంతయు శాస్త్రి విన్పించెను. స్వామి యిట్లనిరి. "శాస్త్రి! నీవుచేసినపని తప్పని చెప్పలేను. సరియని యనలేను. నీయాత్మ చెప్పినట్లు నీవునడిచికొన్నావు. దీనిని నేనెట్లు దోషమందును? దైవము నేపేరిటపిల్చిన నొక్కటే. అన్నిపేరులును వాసుదేవునికే చెందును. ఆత్మ తనకను రూపమైన దేహము నాశ్రయించునట్లు వ్యక్తి కూడ తన యాత్మోద్ధారమునకు అనుగుణమైన ధర్మమును చేపట్టును. దీనిలో నే దోషమును లేదు. వ్యక్తి యేధర్మమునకు జేరినను ఆధర్మమున సంపూర్ణ శ్రద్ధగలిగి బ్రతుకవలెను. దాని తత్వములందు త్రికరణపూర్వకమైన విశ్వాసముంచవలెను. కేవలము ప్రలోభములకొరకై ధర్మములను మార్చుచు బోవుట శ్రేయస్కరముగాదు. అట్టిధర్మాంతరము వ్యక్తి నేగాదు-సమాజమును

గూడ నాశ మొనరించును. నీవుస్వార్థ(త్రి)లోభములకై యిస్లాం ధర్మమును చేపట్టలేదని విన్నాను. ఆధర్మముతో నీమనస్సునకు శాంతి చిక్కినచో దానినే యనుసరింపుము. ఈదాననే నీకుం గల్యాణమున్నది.”

వేఱొకవిషయము ఒకవ్యక్తి ఒకవిశిష్టధర్మమునకు జేరి నంతమాత్రమున పరధర్మములను ద్వేషీకరింపవలెనని లేదు. అన్యమత సహిష్ణువుగా నుండవచ్చును. దానికి సుల్తానేసాక్షి, అతనికి హిందూధర్మముపై నభిమానమున్నదనుటకు వారు మాకు శివలింగమంపుటయే సాక్ష్యము. అట్టి యాధర్మమును నీవు చేపట్టినచో ధర్మముపేరిట జరుగు దురాచారములంతరించును. జగత్తునకు శాంతి, కల్యాణము లేర్పడును.”

స్వామివాక్కులువిని శాస్త్రి హృదయము కరిగి నీరైనది. వారంతటి యుదారులు గనుకనే విశ్వప్రేమికులు. కనుకనే సుల్తాను వారియందు గురుభావ ముంచికొన్నాడనుకొనెను.

“శాస్త్రి స్వామికి వందనమాచరించెను. వారిమాటలనే మాటిమాటికి మనన మొనర్చికొనుచు నింటికివచ్చినాడు. ఒక బ్రహ్మచారి యెదురుగావచ్చి “మిమ్ము సర్వాధికారులు బిలుచుచున్నారనెను.” శాస్త్రి యావటువు వెంట సర్వాధికారి కడకు వెళ్లినాడు. నరసింహశాస్త్రి యాతనిని విశ్వాసముతో బలుకరించెను. కుశలప్రశ్నలైనవి.

“శాస్త్రీ నీతో కొన్ని ముఖ్యవిషయములు మాటాడ

వలెను. నా వెంటవచ్చుట కాక్షేపణ లేదుగదా?"

శాస్త్రి సమ్మతించెను. వారిరువురును నదివైపు నడచి నారు. నరసింహశాస్త్రి యొక శిలామండపమున విశ్రమించెను.

"నారాయణా! నీవు మతముమారితివని విన్నాను. నిజ మేనా?"

"అవును."

"ఈపని యేల చేసితివని యడుగవచ్చునా? హిందూ ధర్మమున నీకేమి లోపమగుపించినది. ఇస్లాం ధర్మమున నేమి గొప్పదనము గన్నావు?"

"హిందూమతముపై నాకు తిరస్కారము లేదు. ఇస్లాం ధర్మము, హిందూ ధర్మమునకంటె గొప్పదియను భావనయు లేదు."

"మరి మతము నెందుకు మార్చితివి"

"దీనికుత్తరము చెప్పుట కష్టము"

"మహమ్మదీయ స్త్రీయందలి మోహమే దీనికికారణ మని మేమనవచ్చునా?" నరసింహశాస్త్రి వ్యంగ్యముగనవ్వెను.

"మీరేమైనను భావింపవచ్చును. జరిగినకథ యిది" నారాయణశాస్త్రి తాను మహమ్మదీయుడెందుకు గావలసి వచ్చెనో వివరించినాడు. ఇదివిని సర్వాధికారికి గోపము వచ్చినది.

ఈ వృత్తాంతమును జెప్పుటకు సిగ్గగుట లేదా?'

"నేనట్టిపని నేమిజేసితిని?"

"నీకు నీ పై వ్యామోహామున్నచో ఇస్లాం ధర్మము స్వీకరింపవలెనా? అంతటి రూపవతి హిందూధర్మమున లేక పోయెనా? ఒకస్త్రీకై నీతండ్రి తాతల ధర్మమును విడచి ఆశ్లేయమైన సంప్రదాయమునువదలి, ధర్మాంతరమును స్వీకరించుటకు సిగ్గుటలేదా?"

నారాయణశాస్త్రి నవ్వినాడు.

"మీరు నన్ను తప్పుగా నర్థము చేసికొనుచున్నారు. నేను అయేషాపై మోహాముతో మతమును మార్చుకొనలేదు. ఆమెలోని మాననీయమైన ప్రేమకు మానవధర్మమునకు అర్ఘ్యముగా ఆమెను వరించినాను."

"నీకంతకుముందే వివాహామైన సంగతిని మఱచి మాటాడుచున్నావు."

"ఎట్లు మఱువఁగలను?"

"ఈ రెండవ వివాహాముచే నీ భారతి కన్యాయము జరుగలేదా?"

"ఆమె బ్రతికినదో — చచ్చినదో తెలియదు. ఆమె కేవలము నాస్వప్నములో మాత్రమే జీవించుచున్నది. భారతికి నానుండి యేయపచారమును జరుగలేదు. అట్లుచూచినచో— నా భారతి అయేషాలో పునర్జన్మ మెత్తినది."

"ఇప్పుడు 'భారతి' బ్రదికియున్నచో నీ వేమి చేయుదువు"

'సంతోషముగా స్వీకరింతును.'

"నీకు పెండ్లియైనది. జాతిచెడితివి. మతాంతరము నొం

దినవాడు మగడుకాడని స్మృతిచెప్పినది.”

“స్మృతియేమైనను చెప్పనిండు. భారతి బ్రతికియున్నచో ఆమె నావస్తువు. ఆమె యెట్లున్నను నావస్తువే.”

“నీవుమాత్రము ముందటివాడవుగావు”

“అనగా?”

“నీవు ముందటి నారాయణశాస్త్రివికావు. మరి ఖాన్ జహాన్ ఖాన్.”

“నేను లోకముపాలికి ముస్లిమునైనను. భారతిపాలికి హిందువునే. ఆదృష్టితో జూచినచో నేనేమతమునకును జెంద లేదు. నాది మానవ మతము. ఇంతకునామె బ్రతికియున్న గదా యీమాటలు”

“భారతి మరణించినదని నీకెట్లు తెలియును?”

“ఆమె బ్రతికియున్నచో నెటులైనను నాచెంతకు వచ్చె డిది. లేకున్న నామెవృత్తాంతమైనను నాకు దెలిసెడిది. ఇన్ని సంవత్సరములైనను, ఆమె వృత్తాంతమే దెలియలేదు. మీ రామె బ్రతికియున్నదనిన నేనెట్లు నమ్మెదను? ఆవిశ్వాసము నాకులేదు నేనట్టి భాగ్యము నకుగుకొనిరాలేదు.”

‘నీభారతి బ్రతికియేయున్నది.’

“ఈమాట నిజమా?”

“చంద్రమౌళీశ్వరునితోడు నిజము.”

‘ఆమె యెచ్చట నున్నది?’

“ఇచ్చటనే. నీవుకోరినచో నెదుటికివచ్చి నిలుచును.

కాని,, యామెను చూచుటకుముందు నీవునాకొక ప్రశ్నకు సమాధాన మివ్వవలెను."

"ఏమది?"

"నీకు భారతిపై ప్రేమయున్నదా?"

'ఉన్నది.'

"ఆమెను మరల భార్యగా స్వీకరింతువా?"

"చంద్రమౌళీశ్వరుని తోడు"

"అది యీజన్మమున సాధ్యముగాదు."

"నీవిప్పుడు హిందువుగావు. మహమ్మదీయుడవు. భారతి హిందూస్త్రీ. హిందువైన శాస్త్రి సతి."

"అయిననేమి? భారతిపాలికి హిందువైన నారాయణ శాస్త్రినే. నేను వేఱుమతము చేపట్టినంత మాత్రమున ఆమె నాభార్య యెట్లు కాకపోవును?"

'దీనికి స్వామి, సమాజము నంగీకరింపవలెను."

'సమాజపు గొడవ నాకక్కఱలేదు.'

'నీవు సమాజమును ధిక్కరించి బ్రతుకలేవు.'

"వ్యక్తి కొఱకే సమాజము."

"వ్యక్తిహితమును సమాజము సంరక్షించును. కనుక సమాజమును వ్యక్తి గౌరవింపవలెను"

"నేను పెండ్లాడిన భారతిని స్వీకరించుటకు హిందూ సమాజ మేల ధిక్కరింపవలెను?"

"నీవు సంపూర్ణముగ మహమ్మదీయుడవైననుగావలెను

లేక హిందువుగానైన నుండవలెను. భారతినైన వదలవలెను. లేక అయేషానైనను మఱువవలెను. ఒకసారి నీవు రెండు ధర్మ ములు స్వీకరించినచో రెంటి యందును స్థానముదొరకదు."

'చింత లేదు. నాకు మానవసమాజమున స్థానమున్న చో చాలును.'

'నారాయణశాస్త్రి! ఇదినవ్వి మఱచిపోవు విషయము గాదు. సమస్య-అది జటిలమైన మతము.దీనిని కూలంకషముగ చర్చించి తేల్చవలెను.'

"నాసాధ్యమైనంత వఱకును చర్చించి తేల్చికొన్నాను. విషయమెంత జటిలమో అంత సరళమైనది. వ్యక్తిధర్మము వానిశ్రద్ధనుబట్టి నడచును. వానిపుట్టుకనుబట్టిగాదు. ఆత్మశోధ కుడైనవానికి, జాతి,మత, బంధములు జీవచ్ఛవములు. నేనాత్మ శోధకుడను గాకపోవచ్చును. నాకంతటి శ్రద్ధ లేకపోవచ్చును. కాని నాయాత్మ చెప్పినట్లు నేను నడచికొన్నాను. దీనితో నాకేగాదు. లోకమునకును కల్యాణమున్నది. నామతము సంకు చితమైన ధర్మముపై నిలువలేదు. మానవీయ ధర్మముపై నిల్చినది. నాది విశాలమైన హృదయ ధర్మము. దానికి హె చ్చు తగ్గులు లేవు. ఏద్వంద్వ భావమును లేదు, ఆధర్మమున కందరొక్కటే ఈదృష్టితో నేను ముస్లిమునై అయేషాను వరించితిని. ఈ దృష్టితోనే మరల భారతిని గ్రహించుటకు సిద్ధముగ నున్నాను. వారిద్వారును భిన్నమతములకు చేరినంత మాత్రమున నన్ను సమానముగ ప్రేమించుచు నేల బ్రతుక

గూడదు? ఇది నా వైయక్తికప్రశ్న. దీనితో సమాజ మవసరముగా గల్పించికొన గూడదు. వారికేపని శ్రేష్ఠత్వము గాదు. జననమాత్రమున అనగా కేవలము కులమునుబట్టి మానవుని యోగ్యతను నిర్ణయింపరాదు. ఆస్తిపాస్తులను బట్టియు గాదు. గుణములతో నిర్ణయించవలెను. ఆదృష్టియు విశాలమైనదిగావలెను. అట్లుగానిచో సమాజముయొక్క యంతస్తత్వము సన్నగిల్లి పోవును. సమాజము అది హిందూ సమాజమైనను ముస్లింసమాజమైనను దూరముచేసినచో వారికివచ్చు లాభములేదు. నన్ను వారు వేధించినచో దానితో నేను జచ్చినచో నామరణమ నేకులట్టివారిని బుట్టించును. మావంటివారిపై పగదీర్చుకొనుటయే సమాజపు బనియైనచో, అట్టి సమాజ స్వభావము తప్పక నశించును.”

“అయినచో నీవనునదేమి?”

“నేను ఇస్లాం ధర్మమును స్వీకరించి ఖాజఖాన్ ఖాన్ అయినను భారతీపాలికి నారాయణశాస్త్రినే. ఆమెను జూచుటకై నా మనస్సు తహతహలాడుచున్నది. ఆమె బ్రదికియున్నచో నాకు దయచేసి చూపింపవలెను.”

“తప్పక చూపింతును. కాని నిన్నుస్వీకరించుటయు, వదలుటయు ఆమెయిష్టము.”

“అట్లేకానిండు. ఆమె నన్ను తప్పక స్వీకరింప వలెనను హఠము నాకులేదు. ఆమె యెచ్చటనైనను సుఖముగ జీవించిన జాలును. ఇదే నాకోరిక. నేను జగద్రక్షకునకొనర్చు ప్రార్థనయు దే.”

ఈమాటవిని నరసింహశాస్త్రి క్షణకాలము మౌనముగ నుండెను. వెంటనే యటనుండి లేచుచు—

"శాస్త్రి! ఇది నీవైయక్తికపశ్న. దీనిని నీవే నిర్ణయించికొనవలెను. మాపని భారతిని తిరిగి నీకప్పగించునంతవరకే మీలో ఎవరెవరి నుద్ధరింపవలెనను ప్రశ్న మీకు చేరినది."

నరసింహశాస్త్రి యొక బ్రహ్మచారినంపి భారతిని పిలిపించెను. ఆమెనాతనికి జూపించి సర్వాధికారి వెడలిపోయెను.

"భారతి యెదుట నిలిచినంతనే శాస్త్రి ప్రపంచమును మఱచెను. అతడున్మాదివలె నామెను గౌగలించికొన్నాడు. ఒకరి భుజముపై నొకరు తలలుంచుకొని చాలసేపేడ్చినారు. తమదీర్ఘకాల విరహవేదనను మాటలతోగాక మౌనముతో దల్పికొనుటయే వారికి బ్రియమైనదిగ నుండెను."

భావోన్మాదము తగ్గినతరువాత శాస్త్రి "భారతీ"యని యామె ముఖమును చేతితో నెత్తినాడు. ఆమెతలను గన్నీటితో తడిపెను. ఆమెతల నాతడు నిమిరెను."

"భారతి వెక్కివెక్కియేడ్చుచున్నది. దుఃఖమును దెలుపుట కామెకు రోదనమునకంటె వేఱుమార్గము లేదు. కొంతసేపటికి భారతీ! నాకొఱకెంత కష్టపడితివో! నీవిన్నాళ్లెక్కడనున్నావు? మఱి యీజన్మమున నిన్ను జూచుట లేదనుకొన్నాను. నావంటి భాగ్యశాలి లేడు."

ఆమెనతడు మరల దగ్గరకు దీసికొనెను. దుఃఖభారము

కొంత తెప్పరిల్లినమీద నామె తనకథ వచించెను. అది కరుణా జనకమైన దేగాదు. రోమాంచకారిగూడ.

"కిగ్గ"ను మహారాష్ట్ర సైనికులు ముట్టడించినపు డూరిలోని వారందరు నిద్రించుచుండిరి. తెల్లవారినదే తడవు సైనికులూరిలో జొరబడినారు. ఎదుటబడినవారిని నఱకిరి. చిక్కిన దానిని దోచిరి. వారిధాటికి భారతీదేవి యిల్లు బలియైనది. ఇంటిలోనివారు లేచి తెప్పరిల్లు నంతలో వారితలలెగిరి పడెను. మహారాష్ట్రులు వారింటిలో నున్నదంతయు దోచిరి. తండ్రిని నఱకిరి. ఆతని పత్నిని మానభంగ మొనర్చి చంపివేసిరి. భారతికి భయమైనది. ఆమెకు దానేమిచేయవలయునో తెలియదు. తెలియకయే యాయింటినుండి పరువెత్తినది. ఒకరిరువురు సైనికులు దరిమిరి. ఆమెప్రాణములపై నాశవదలి చిక్కినదిక్కునకు బోయినది. చాలదూరమట్లు పరువెత్తెను. ఒక గ్రామమునకామె చేరినది. గోకర్ణమునకు కొందరు యాత్ర పోవుచుండిరి. వారితో నామె తనదీనగాథ సంకుచితముగ జెప్పి వారిలో జేరికొనెను. ఆగుంపులో గొందరు స్త్రీలుండిరి. వారికి భారతిపై గరుణగల్గినది. ఆమెకీయలజడిలో శాస్త్రి జ్ఞాపకమునకు వచ్చినాడు. తానొక్కతెయే శృంగేరికెట్లు పోవును? ఆయాత్రికులానాడే ఆగ్రామమును వదలి గోకర్ణమునకు బ్రయాణమైరి. భారతికి శృంగేరికి బోవలనుపడలేదు. తనవృత్తాంతము నెన్ జెప్పిపంపుటకు సాధ్యముగా లేదు.

గోకర్ణమునుచూచి సేవించి యాత్రికులు ధర్మస్థలము

నకు వచ్చిరి. ఒక శృంగేరి యాత్రికుడు వచ్చినాడు. అతనిని భారతి పల్కరించలేదు. శృంగేరి మహారాష్ట్రులతో నాశమైన సంగతి నాతడు దెల్పెను. స్వామి తలదాచుకొన్న కథయు నెరిగించినాడు. వారెక్కడనుందురో తెలియలేదనెను. శ్రీకంఠశాస్త్రి యిల్లంతయు మహారాష్ట్రులనాటికి నాశనమైనదని యు, శాస్త్రిగతియేమైనదో తెలియదనియు వచించెను.

ఇక తాను శృంగేరికి పోయిమాత్రము లాభమేమి? శాస్త్రికూడ తనయన్నవలె నీ మహారాష్ట్రుల చేతికి జిక్కి మరణించి యుండునని యామె యెంచెను. ఆ మొగుండెకరుగు నట్లేడ్చినది. ఏడ్చి యేమిలాభము? భారతి గోకర్ణయాత్రికుల తోడనే వెళ్ళెను. వారియాత్ర పూర్తియైనది. ఆగుంపు చెదరి వారివారి గ్రామములకు బోయినది. భారతి మొదటినుండియు తనపై ప్రీతివిశ్వాసములు చూపుచున్న "శంకరయ్య" యను గృహస్థునితో పాటు వారియూరికేగెను. వారియూరు తంజా వూరి దగ్గరనున్న యొకచిన్నపల్లె. ఒకటి రెండు సంవత్సరములు గడచినవి. శంకరయ్య చనిపోయెను. అతనికొక కొడుకుండెను. వానికి పెండ్లి కావలసి యున్నది. కాని, వాడుదుశ్చేష్టలు మరి గెను. విలాసజీవనమునకై ఆస్తిని నాశమొనర్చుటకు మొదలు పెట్టెను. తానట్టియింటిలోనుండుట భారతి కిష్టములేదు. శంక రయ్య భార్యమాత్ర మామెను కన్నబిడ్డవలె జూచుచుండెను.

ఒకనాడు భారతి నిద్రించుచున్నది. సాంబయ్య వచ్చి వచ్చి యామెచీపు దడిమినట్లయ్యెను. ఇకనచ్చటనున్నచో శీల

భంగ మగునని యామెభయపడి యింటిలో దెలుపక ప్రయా ణమైనది. నడచినడచి కొన్నాళ్ళకు బెంగుళూరికి వచ్చెను. అచట నెవరియింటనో పనిచేసికొనుచు రెండేండ్లు గడపినది. ఆమెపరివర్తన మాకర్షముగా నుండెను, ఆమెతో మాటాడిన వారెవ్వరైన నామెపై జాలిగానుండిరి. కాని యామె రూప యౌవనములే యామెపాలికి శత్రువులు. ఎవడో యొక్కడు చేయిజేసికొనుచుండెను. ఆమెదినమునకొక గండముగా బ్రదు కుచు కడకు "తీర్థహళ్ళికి" వచ్చినది. నారాయణశాస్త్రి బ్రతికియున్న సంగతి యామెకచ్చట దెలిసెను.

అతికష్టములకోర్చి యామె శృంగేరికి నడచివచ్చినది. అక్కడ పిడుగువంటి యొకవార్త చెవినిబడెను. నారాయణ శాస్త్రి ముస్లింధర్మమునుస్వీకరించి యొకతెనో పెండ్లాడినాడని చెప్పిరి. అతనిపేరు ఖాజహాక్ ఖాన్ అయినదట. దీనితో నామె యాశలన్నియు నిలువునగూలినవి. ఇకనామె ఏమిసేయు ను? సర్వదుఃఖములకును విశ్రాంతిభూమి తుంగభద్రయొక్క యంకమేయని నిశ్చయించికొనినది. ఆసమయమున స్నానము నకు బోయిన నరసింహశాస్త్రికంట నామెపడెను. అతడు పుత్రికా ప్రేమతో నామెను దనయింట నుంచుకొనెను.

భారతీదేవి విషాదకథవిని శాస్త్రిమనసు మలమల మాడినది. చాలసేపేడ్చెను. అతడామె తలనిమురుచు భారతీ! నీకు నేనర్హుడను కానన్నాడు.

"నన్ను మీరు వదలుదురా యేమి?" భారతి కన్నీ టితో నడిడిగినది.

"లేదు. కాని . . . ."

"మరియింకేమి?"

"మరేమియు లేదు."

"మీహృదయమున నాకింకను స్థానమున్నదా?"

"లేకేమి?"

"ఆహృదయము వేరొక్కరిదైనదని విన్నాను."

"చిన్నా! ఆహృదయ మెప్పటికైనను భారతీదేవిదే "అయేషా" భారతీదేవి రూపాంతరము."

"అట్లయినచో నేను భాగ్యశాలిని,"

"నేనంతకంటెను భాగ్యశాలి."

"ఏల?"

"నేను శ్రీదేవి భూదేవులతో గూడిన నారాయణమూర్తిని"

"కాదు ఖాఁ జహాఁ ఖాఁ."

భారతీదేవి అతని కంఠధ్వనితో ధ్వనిచేర్చి పలుకుచు నాతని ముఖమువైపే చూచినది. శాస్త్రిముఖమున మూడు లోకముల కిముడని సంతోషము తృప్తి మిలమిల మెఱసి పోవుచున్నవి.

♦♦ సమాప్తము. ♦♦

నాగభూషణ ప్రెస్, కర్నూల్.